శ్రీ డి. ఆర్. సూద్ 1907 వ సం॥ లో జననమందిరి. లాహోరు ప్రభుత్వకళాశాలలో విద్యాభ్యాసముచేసి 1928 వ సం॥ న ఎం. ఏ. పట్టము పొందిరి. పంజాబురాష్ట్రములోని అనేక కళాశాలలలో ఆంగ్ల భాషాచార్యులుగా పనిచేసి, 1947 వ సం॥ లో 'ట్రిబ్యూన్' పత్రికకు ముఖ్య ఉపసంపాదకుడుగా చేరిరి. ఈ పదవిని 21 సంవత్సరములు నిర్వహించి ఇటీవల పదవీవిరమణ గావించిరి. వీరు అనేక వ్యాసములను 'ట్రిబ్యూన్ సంక్షిప్త చరిత్ర' అను గ్రంథమును రచియించిరి.

శ్రీ సూద్ శైలి సరళమైనది. రామతీర్థస్వామినిగూర్చి వీరు చేసిన రచనలో సమ్యగవగాహనము, గుణగ్రహణ పారీణత, ఆర్ద్రత - గోచరించుచున్నవి. సామాన్యపాఠకుని నుద్దేశింపబడిన యీ చిన్నపొత్తము సరళసుందరముగా నున్నది.

శ్రీ సూద్, మహారాజా రంజితసింగ్ జీవితచరిత్రమును గూడ రచించి ప్రస్తుతివారి కొనంగిరి.

జాతీయ జీవిత గ్రంథమాల

# స్వామి రామతీర్థ

డి. ఆర్. సూద్

అనువాదం :

చాగంటి గోపాలకృష్ణమూర్తి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

న్యూ ఢిల్లీ

# ఉపోద్ఘాతము

రామతీర్థస్వామి వ్యక్తిత్వము బహుముఖప్రజ్ఞాభరితము. భారతీయ, భారతీయేతర తత్త్వశాస్త్రసారమును తనలో నిముడ్చుకొనిన తత్త్వవేత్త రామతీర్థుడు. ఆయన ఆధునికయోగి-సూఫీ.

రామతీర్థస్వామి ప్రాచీన ఆధ్యాత్మికసందేశమును ఆధునికులకు అందించుటకును, భారతీయతత్త్వశాస్త్రసందేశమును పెక్కు పశ్చిమదేశములకు కొనిపోవుటకును ఎనలేని కృషిసల్పిన మహనీయుడు. జాతీయజీవిత గ్రంథమాలలో ఆయన జీవితచరిత్ర గ్రంథమును చేర్చుటకు ఇదియే హేతువు. విద్రాణమైయున్న భారతజాతిని మేల్కొల్పిన వైతాళికులలో స్వామి ఒకరు. రాజకీయములలోను, జాతీయ కార్యక్రమములలోను ఆయన ప్రముఖస్థానము వహింపకున్నను ఆయన చేసిన బోధలు, ఇచ్చిన సందేశము - పెక్కుమంది భారతీయ యువకులను ఉత్తేజపఱిచి వారిని సంకుచితత్వమునకు అతీతులనుగాజేసి, వారిలో విశ్వమానవ సౌభ్రాత్వభావనను నెలకొల్పినవి. దీనినే తరువాత గాంధిమహాత్ముడు చేపట్టెను. స్వామిజీవితము ఒక ఉత్తేజకరమగు కథావిశేషము.

బి. వి. కేస్కర్.

## విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | జననము-ప్రాథమిక విద్యాభ్యాసము | 1 |
| 2. | విశ్వవిద్యాలయములో .... | 8 |
| 3. | రాముని ఉపాధ్యాయపదవులు | 24 |
| 4. | పర్వతములలో సంచారము-సన్యాసము | 38 |
| 5. | జపానులో పదునైదురోజులు | 52 |
| 6. | అమెరికా సంయుక్తరాష్ట్రములలో రామతీర్థస్వామి | 58 |
| 7. | స్వదేశాగమనము | 71 |
| 8. | యాత్రాసమాప్తి | 77 |
| 9. | రామతీర్థుని దృష్టాంతకథలు | 93 |
| 10. | గ్రంథములు-భావములు | 102 |
| 11. | లేఖలు-పద్యములు | 111 |
| 12. | మతభావన. | 127 |

# 1. జననము - ప్రాథమికవిద్యాభ్యాసము

గోసాయి బ్రాహ్మణులలో (గోస్వామి అనియు కొన్నియెడల వ్యవహారము) ఒక పురుషుడు నేటి పశ్చిమ పాకిస్థానులోని చిత్రాలనకు సమీపమునగల 'స్వాత్' అనుచోట స్థిరపడి వంశకర్త అయ్యెను. ఆ వంశములో ఒకని వలన ఆ వంశమునకు పేరుప్రతిష్ఠలు వచ్చినవి. ఆ వంశములో ఒకశాఖ అప్పటి పంజాబురాష్ట్రములోని గుజరన్వాలా జిల్లాలోఉన్న మురళీవాలా అను గ్రామమునకు వలసపోయెను. పంధొమ్మిదవ శతాబ్ది చివరి దశాబ్దులలో ఆ గ్రామమున నివసించుచున్న గోసాయివంశములో హీరానందుడు అను నాయన ప్రసిద్ధుడు. ఇతడు పురోహితవృత్తి చేసికొనుచుండెడివాడు. ఈతనికి 1870 ప్రాంతమున ఒక కుమారుడు కలిగెను. హీరానందుని తండ్రి రామచంద్రుడు. ఆయన గొప్ప జ్యోతిష్కుడు. ఆయన పిల్లవాని జాతక చక్రము వేసెను. జాతకము ఎట్లున్నదని అడుగగా ఆయనకు నవ్వును ఏడ్పునుకూడ వచ్చినవట। జాతకమునుబట్టి చూడగా, పిల్లవాడు అల్పాయుష్కుడో, మాతృవిహీనుడో కాగలడని తోచి ఆయన మిగుల దుఃఖపడెను. కాని పిల్లవాడు బ్రదికి బట్టకట్టినచో మహావిద్వాంసుడై, మతాచార్యుడై తనకు, తన వంశమునకు ఎనలేని కీర్తి తెచ్చుకొనగలడనియు ఆయన గ్రహించెను. రామచంద్రపండితుడు నిజముగ అట్టి ఫలితమునే చెప్పియుండినచో అది అక్షరముల జరిగినదనియే మనమిప్పుడు చెప్పవచ్చును. బాలుని జాతకమును మరికొందరు జ్యోతిష్కులుకూడ పరిశీలించి కొన్నిఫలితములను చెప్పిరి. ఆ పిల్లవాడు పెరిగి పెద్దవాడై నపిమ్మట సంసార బంధములనుండి విముక్తుడై, విదేశయాత్రలు చేయుచు, తన మాతృదేశపు కీర్తిప్రతిష్ఠలను ఇనుమడింపజేయుననియు, అతని 30-40 సంవత్సరముల

నడిమివయసున అతనికీర్తి దశదిశా వ్యాప్తమగుననియు, ఒక జలగండమున అతని జీవితము ముగియుననియు ఆ జ్యోతిష్కులు చెప్పిరి.

పై విషయములను ధ్రువపఱుచుటకు లిఖితాధారము లేవియు లేవు. సాధారణముగా మహాపురుషుల జీవితములలోని సన్నివేశములనుగూర్చి కొన్ని కట్టుకథలు. వానిని జ్యోతిష్కులు ముందుగా చెప్పిరనుటయు మనము విను చుందుము. కాని రామచంద్రగోసాయి, ఇతరజ్యోతిష్కులు, ఇట్టి ఫలితములను చెప్పియుండుట నిజమే అయినచో వారు తప్పక దూరదర్శనులని చెప్పవలసియున్నది. వారు చెప్పినదానిలో చాలభాగము యథార్థమైనది. ఆ పిల్లవానికి తీర్థరాముడని పేరు పెట్టిరి. నారాయణస్వామి, పురాణసింగు అనువారు చెప్పినదానినిబట్టి తీర్థరాముడు పుట్టినతేది 22-10-1873. కాని రామతీర్థస్వామి మేనల్లుడగు వ్రజలాలు 1870 వ సం॥లో ఆయన జన్మించెనని తెలిపెను. (విక్రమ సం॥ 1927 కార్తికమాసము) దీనికి ఆధారముగా ఆతడు సరియైనతేదిని పేర్కొనిన హీరానందుని లేఖను ఆధారముగా చూపెను. ఇదియే సరియైనచో రామతీర్థస్వామి గాంధిమహాత్ముని సన్నిహిత సమకాలికు డన్నమాట.

పిల్లవానికి ఒకసంవత్సరము దాటినపిమ్మట ఆతని తల్లి చనిపోయెను. కొడుకును పెంచి పెద్దచేయవలసిన భారమంతయు హీరానందునిపై బడెను. అందుచే అతడు తన బంధువులలో ఒకరిసాయ మర్థించెను. అతని అక్కగారు ధారమ కౌరును, బావగారు గోసాయి ఠాకూరును జండియాలా అను చోట నివసించుచుండిరి. వా రిద్దరిని, పిల్లవానికి కొంచెము వయసు వచ్చువరకు తనయొద్దకు వచ్చియుండుడని ప్రాధేయపడెను. హీరానందునికి ఒక కుమార్తెకూడ కలదు. ఆమె తీర్థరామునికంటె ఏడాది పెద్దది.

తీర్థరామునికి చిన్నతనములో ఆరోగ్యము బాగుండెడిదికాదు. మతాచారపరాయణురాలయిన ధారమ కౌరు రోగిష్టియైన తీర్థరాముని చంకనెత్తుకొని

ప్రతిదినము మురళీవాలాలోని దేవాలయములకు పోయి వచ్చుచుండెడిది. ఈ దేవాలయసందర్శనము తీర్థరాముని మనస్సుపై ఎంతో ప్రభావము కలుగ చేసినది. సాయంకాలములందు ఆలయములనుండి వినవచ్చు శంఖధ్వాన మన్నచో పిల్లవానికి అమితమైన ప్రీతి ఏర్పడినది. ఒకప్పుడు తీర్థరాముడు పోరుపెట్టి ఏడ్చుచుండగా, అతనిని ఊరడించుటకు మార్గాంతరములేక శంఖ ధ్వానము మ్రోగుచున్న శివాలయమునకు తీసికొనిపోగా అతడు పోరుపెట్టుట మానెనట! తీర్థరామునకు వయస్సు వచ్చుచున్నకొలదియు అతనికి పురాణ కాలక్షేపములకుపోయి కథలు వినుటయం దాసక్తి వృద్ధికాజొచ్చినది. ఒక సారి హీరానందపండితుడు, సుమారు రెండేండ్లవయసులోనుండి తప్పటడు గులు వేయుచున్న తీర్థరాముని కథాకాలక్షేపమునకు తీసికొనిపోయెను. అచ్చట ఆ బాలుడు నిశ్శబ్దముగా కూర్చుండుటయేగాక, పురాణము ముగియు వఱకు పౌరాణికునివంక రెప్పవేయక చూచుచునేయుండెనట. ఈ సంగతి హీరానందుడే చెప్పెను. మరునాడు కథాప్రారంభసూచకముగా శంఖము మ్రోగగానే తీర్థరాముడు ఏడ్వ నారంభించెను. ఆటబొమ్మలు, మిఠాయిలు ఎన్ని యిచ్చినను అతడు ఏడుపు మానలేదు. కథాకాలక్షేపము జరుగుచున్న చోటికి తీసికొని వెళ్ళినపిమ్మటకాని తీర్థరాముడు ఊరుకొనలేదు.

తీర్థరామునికి ఆరేండ్లు వచ్చినవి. అతనిని ఆ గ్రామములోని ప్రాథమిక పాఠశాలలో చేర్చిరి. అతడు పాఠశాలలో బుద్ధిశాలియనియు, శ్రద్ధగలవా డనియు పేరొందెను. అయిదుసంవత్సరముల చదువును అతడు మూడేం డ్లలో పూర్తిచేసెను. అతనికి ఉర్దూ, పారశీకభాషలలో మంచి అభిరుచి ఏర్పడెను. 'షీక్‌సాదీ' కంఠపాఠముచేయుట అతనికి కొంచెము కష్ట మయ్యెను. ఒకనాడు తీర్థరాముడును, మరికొందరు బాలురునుకలిసి ఒక సాధువును దర్శించుటకు పోయిరి. ఆ సాధువు ఈ బాలకుల భవిష్యత్తును గూర్చి జోస్యము చెప్పెను. తీర్థరాముడు భవిష్యత్తులో మత తాత్త్వికరంగ

ములయందు గొప్ప పేరుప్రతిష్ఠలు గడింపగలడవి ఆ సాధువు చెప్పెను. ఈ సంఘటననుగూర్చి ప్రజలాలు వ్రాసెను. తీర్థరామునకు ఆటపాటలలో అభిరుచిలేదు. అతడు ప్రొద్దుటపూట చదువుకొనుచు, పగలంతయు పాఠశాలలో గడపెడివాడు. కథాకాలక్షేపములపై అప్పటికిని అతని ఆసక్తి తగ్గలేదు. పాఠశాలకు సమీపముననున్న ధర్మశాలలో ప్రతిదినము మధ్యాహ్నము రెండుగంటలకు కథాకాలక్షేపము జరుగుచుండెడిది. అచ్చటికిపోయి వచ్చుటకు అతడు తన ఉపాధ్యాయుని అనుమతికోరగా ఆయన నిరాకరించెను. అంతట తీర్థరాముడు ఏడువనారంభించెను. అప్పుడు మౌల్వీ జాలిపడి, పాఠశాలలో ఫలాహారము తీసికొని విశ్రాంతి గైకొనుసమయమున మాత్రమే కథాకాలక్షేపమునకు పోవుటకు అంగీకరించెను. తీర్థరాముడు అట్లే ప్రతిదినము కాలక్షేపమునకుపోయి కథను శ్రద్ధగావినుచు, ఇంటికి వచ్చి పౌరాణికుడు చెప్పిన కథనంతయు తిరిగి యింటిలోనివారికి చెప్పెడువాడు. పాఠశాలలో చదువుచున్నరోజులలో అతడు మౌల్వీ మహమ్మదాలీకి మిక్కిలి ప్రేమాస్పదుడయ్యెను. చదువు పూర్తి అయినపిమ్మట, ఆచార ప్రకారము హీరానందగోసాయి ఆ ఉపాధ్యాయునకు పారితోషికముగా రెండురూపాయ లీయ తలంచెను. ఉపాధ్యాయుడు తన కొక పాడియావు బహుమానముగా వచ్చునని ఆశపడుచుండెననియు, రామతీర్థునివంటి మంచి విద్యార్థి ఉపాధ్యాయుని నిరాశపఱచరాదనియు రామతీర్థునికి పాఠశాలలో చెప్పిరి. ఇదివిని వచ్చిన రామతీర్థుడు తండ్రి నిర్ణయమును తెలిసికొని మొగము ముడుచుకొనెను. తండ్రి చేయునదిలేక పిల్లవానియిష్టప్రకారమే చేసెను.

ఆనాటి స్థానికాచారమును పురస్కరించుకొని, హీరానందుడు, రామతీర్థుడు రెండేండ్లవాడుగా ఉన్నప్పుడే అతనికి పెండ్లిసంబంధము నిశ్చయము చేసెను. పదువు వజీరాబాద్ తాలూకాలోని వైరోకాగ్రామ నివాసి

యగు రామచంద్రపండితుని కుమార్తె. రామతీర్థునికి పదునొకండవయేట వివాహము జరిగినది. వివాహకాండలోని ముద్దుముచ్చటలు తప్ప, నిజముగా వివాహమునకుగల అర్థమేమో రామతీర్థున కవగతము కాలేదు. తనకంత చిన్నవయస్సున గృహస్థాశ్రమమును స్వీకరించుట కిష్టములేదని తండ్రితో చెప్పుట కాతడు సాహసించలేకపోయెను. అతనికి పెండ్లి చేసినప్పు డెవ్వరికిని తీర్థరాముని చిత్తవృత్తి సర్వసంగపరిత్యాగమున కభిముఖముగా ఉన్నదని గాని, గృహస్థజీవిత మాతని ఆశయములకు ప్రతిబంధకముగా ఉండునని గాని తోచలేదు. తీర్థరాముడు తన మాధ్యమిక-ఉన్నత పాఠశాలా విద్యాభ్యాసమునకై మురళీవాలానువదలి వెళ్ళవలసివచ్చెను. హీరానందపండితుడు తనభార్య చనిపోయినపిమ్మట కొన్నాళ్ళకు మరల వివాహము చేసికొనెను. ఈ రెండవసంబంధపు మామగారు నానక్‌చందు పండితుడు. ఈయన 'గుజరన్‌వాలా' నివాసి. హీరానందుడు రామతీర్థుని అప్పటికై స్రీ ఉన్నత పాఠశాలలో చేర్పించి, తన మామగారి యింట నుంచెను. ఆ యింటిలో అందరును రామతీర్థుని ఆదరముగా చూడసాగిరి. గుజరన్‌వాలాలో ఉన్నప్పుడే రామతీర్థునకు 'భగత్ (భక్త) ధన్నామల్లు'తో పరిచయమేర్పడెను. రామతీర్థుని జీవితమున ధన్నామల్లు ప్రభావము మిక్కుటముగా ఉన్నది.

ధన్నామల్ ఒక విచిత్రమైనవ్యక్తి. రాగివస్తువులు తయారుచేయుట అతని వృత్తి. ఏమియు చదువుకొన్నవాడు కాదు. ప్రాథమికపాఠశాలతో అతనిచదువు ముగిసినది. కాని ఒకవిధమైన తాత్త్వికమార్గమునబడి జీవితము వెళ్ళబుచ్చుచుండెను. ఇతనికి కుస్తీపందెము లున్నచో చాలు అన్నపానము లక్కరలేదు. ఆజన్మబ్రహ్మచారి. ఒకసాధువు ఈతనికి యోగాభ్యాసమున సాయపడెను. ఇతడు క్రమముగా యోగశాస్త్రమున ప్రవీణుడై, యోగవాశిష్ఠము నందలి విషయములను చక్కగా వివరింపగల నేర్పు సంపా

దించెను. ధన్నామల్లునకు ఒకప్పుడు ఇతరుల మనస్సులందలి భావములను చదువగలశక్తి యుండెడిదనియు, కొన్నాళ్ళ కాత డాశక్తిని కోల్పోయె ననియు రామతీర్థస్వామియే చెప్పెను. ఈ వ్యక్తినిగూర్చి పురాణసింగు ఇట్లు తెలిపెను: 'ఈ భగత్ ధన్నామల్లు రామతీర్థుని జీవితపు తొలినాళ్లలో అతనికి ఆధ్యాత్మికవిషయములపై గల అభిరుచికి చాల దోహదముచేసి అట్టి ఉన్నత విషయములపై ఆసక్తి పెంపొందించెను.'

రామతీర్థుడు ఈ గురువుచే ప్రభావితుడగునప్పటికి అతనివయస్సు 13-14 సం॥లకు మించియుండదు. అతడు చాల శీఘ్రముగా ధన్నామల్లునకు దాసు డయ్యెను. అతనిని విడిచి ఒక్క నిముసమయిన ఉండలేనంత మమకారమును గౌరవమును అతడు పెంచుకొనెను. వారిద్దరికిని గల అసాధారణమైన యీ అనుబంధమును విరూపించుటకు ఒక సంఘటనమును పేర్కొందును. చుట్టపు చూపుగానో, ఏదైన పనిమీదనో 1886 సం॥ మేనెలలో తీర్థరాముడు తన మామగారి గ్రామమగు 'వైరోకా'కు వెళ్లెను. అతడు ఆ గ్రామములో ఉండగా ధన్నామల్లునుండి ఒక లేఖవచ్చెను. తాను 'బద్దోకా'లో జరుగు చున్న ఒక వస్తుప్రదర్శనము చూచుటకు వచ్చుచున్నట్లు ఆయన ఆ లేఖలో వ్రాసెను. ధన్నామల్లును కలుసుకొనుటకు తీర్థరాముడు కొన్నిమైళ్ళదూరము నడచి అచ్చటకు చేరుకొనెను. ఇతనికి ఆయనపైగల గౌరవమంతటిది. కాని ధన్నామల్లు అచ్చటకు రాలేదు. తీర్థరాముడు నిరాశోపహతుడయ్యెను. తానున్నపల్లెలో పోస్టుకార్డులు దొరకవు. అందుచే తీర్థరాముడు బహు దూరమునడచి తాలూకా కేంద్రస్థానమునకుపోయి అచ్చట పోస్టుకార్డులు కొనెను. తీర్థరాముడు తన జీవితములో భిన్నభిన్నప్రదేశములనుండి ధన్నా మల్లునకు వ్రాసిన సుమారు 1124 లేఖలలో ఇప్పుడు వ్రాసినదే మొట్ట మొదటి లేఖ. ఈ ఉత్తరప్రత్యుత్తరములలో కొన్ని మిక్కిలి విలువైనవి. చాల లేఖలు సామాన్యవిషయములతో కూడినవి. గోసాయివంశీయులు వీని

నన్నిటిని భద్రపఱిచిరి. ఈ లేఖలు రామతీర్థుని మేనల్లుడగు వ్రజలాలునొద్ద 1942 వ సం॥ వరకు ఉన్నవి.

రామతీర్థునకు ధన్నామల్లు ఆధ్యాత్మికవిషయములలో మార్గదర్శకుడగుటయేకాక, ఆతనికి ధనసాహాయ్యము కూడా చేయుచుండెడివాడు. రామతీర్థునకు ధనసాహాయ్యము చేసినవారిలో హీరానందపండితుని బావమరదియగు డాక్టరు రఘునాథమల్ ఒకడు. రఘునాథుని భార్యయు, రామతీర్థుని సవతితల్లియు అక్కచెల్లెండ్రు. రామతీర్థుడు 1888 లో మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తీర్ణుడయ్యెను. క్రైస్తవోన్నత పాఠశాలా ప్రధానోపాధ్యాయుడగు బి. సి. చటర్జీకి రామతీర్థుడన్నచో మిక్కిలి ఆదరము. రామతీర్థునకు పరీక్షలో 38 వ స్థానము లభించినది. అందుచే ఆతనికి ప్రథమశ్రేణియు, ఉపకారవేతనము లభించలేదు. ఇంతకంటె ఎక్కువస్థానము సంపాదించుకొని ఉండినచో, ఉన్నతవిద్యాభ్యాసము చేయవలయునన్న ఆతని చిరవాంఛితము సుకరముగా నెఱవేరియుండెడిది.

# 2. విశ్వవిద్యాలయములో....

తీర్థరామునకు ఎట్లయినను తన చదువు కొనసాగించుకొనవలయునని యున్నది. ఈ విషయమున హీరానందగోసాయికి రామతీర్థునకు భేదాభి ప్రాయము పొడసూపినది. ఆ రోజులలో మెట్రిక్యులేషను కృతార్థతాపత్ర మున్నచో ప్రభుత్వములో మంచిఉద్యోగము లభించెడిది. హీరానందునకు తన కుమారున కేదయిన మంచిఉద్యోగము లభించిన బాగుండునవియున్నది. అప్పుడు హీరానందుని పరిస్థితు లట్లున్నవి. కాని తీర్థరాముడును, డా. రఘు నాథమల్లును, ఐహాళః ధన్నామల్లును మరియొకరీతిగా తలంచుచుండిరి. తీర్థరాముడు తండ్రితో ఘర్షణపడి, ఆయన తలంపునకు విరుద్ధముగా, కళా శాలా విద్యకొఱకు లాహోరునకు పోయెనని నారాయణస్వామి వ్రాసెను. కాని ప్రజలాలగోసాయి, అది యథార్థముకాదనియు, హీరానందుడు తన కుమారునికోర్కె నంగీకరించెననియు, తనకు చేతనయిన ధనసాహాయ్యము కూడ చేయుచుండెడివాడనియు వ్రాసెను. తీర్థరామునకు విశ్వవిద్యాలయము నుండిగాని, ప్రభుత్వమునుండిగాని ధనసాహాయ్యము అందకపోయినచో, అతడు కళాశాలలో చదువుకొనుట కయ్యెడుఖర్చులు భరించుట కష్టమే అయ్యెడిది. నిజమునకు అతని అక్కరలుకూడ మిక్కిలి తక్కువఅయినను కొన్నికొన్ని తప్పనిసరి ఖర్చులకు కావలసినసొమ్ము పెక్కుచోట్లనుండి వచ్చియుండును. 1880 సం॥న మేనెలలో రామతీర్థుడు లాహోరులోని ఫార్మన్ క్రైస్తవకళాశాలలో చేరెను. కళాశాలలో చేరినపిమ్మట అతడు తాను 'ఎచ్చోవాలీ'లో ఒకగదిని నెలకు రూపాయి బాడుగకు కుదుర్చుకొంటి ననియు, ఇంటర్మీడియటు మొదటిసంవత్సరములో చేరిన తాను నెలకు నాలుగురూపాయలు విద్యార్థిరుసుము చెల్లింపవలసియున్నదనియు ధన్నా

మల్లునకు ఒకలేఖ వ్రాసెను. రామతీర్థుడు పొదుపుగా ఖర్చుపెట్టుటకు అలవాటుపడెను. ఈ పొదుపరితనము అతని స్వభావమునకు, పరిస్థితులకు తగినట్లే యున్నది. అతడు మూడురూపాయలకు ఒకజత ధోవతులు, ఎనిమిది అణాలకు ఒక చెప్పులజోడు కొనెను. ఒకసారి అతని మంచమునకు తిరిగి నవారు నేయించుట అవసరముకాగా దానికొఱకు అయిదు అణాలు మాత్రము వెచ్చించెను. నిరంతర పఠనశీలుడైన అతడు తనకువచ్చు వృత్తిలో ఎక్కువ భాగము పుస్తకములకు, నూనెకు ఖర్చు పెట్టెడివాడు. అతడు లాహోరులో పదినెలలు గడపినపిమ్మట ఒక చక్కని అవకాశము లభించెను. గుజరన్‌వాలా పురపాలకసంఘమువారు ఆ పట్టణమునుండి మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తముడుగా ఉత్తీర్ణులైన విద్యార్థులకు నెలకు ఎనిమిదిరూపాయలు విద్యార్థి వేతనము నిచ్చెడివారు. 1888 లో ఈ వేతనము జామిల్‌రాయ్ అను నతనికి లభించెను. అతడు కొన్నినెలలు అయినతరువాత చదువు మానివేయుటచే ఆ వేతనము పోయినది. ఇది తెలిసికొని రామతీర్థుడు తనకు మెట్రిక్యులేషను పరీక్షలో వచ్చిన ఫలితమునుబట్టి తానా వేతనము పొందుటకు అర్హుడననియు, అది తనకు ప్రత్యేకింపబడునట్లు చూడవలసినదనియు ధన్నామల్లునకు మరికొందరికి లేఖలు వ్రాసెను.

ఈ వేతనము అతనికి లభించినది. ఐనను రామతీర్థుడు అక్కడ చదువు కొనసాగించుటకు అనేకకష్టములు పడవలసివచ్చెను. అతడు అద్దెకు తీసుకొన్న గది ఒక పూరిగుడిసె. ధన్నామల్ ఆ గదినివదలి, మఱియొక శుభ్రమైన చోటికి బస మార్చుకొమ్మని బలవంతపెట్టెను. తీర్థరాముడు గదిని మార్చుటకు అవకాశములేదని జవాబు వ్రాసెను. ఇప్పుడున్నగదిలో లభించెడు ఏకాంతముగాని, స్వేచ్ఛగాని మరియొకచోట ఉండదని అతని తలంపు. రెండుసార్లు అతని ప్రక్కబట్టలు, గుడ్డలు, కొంతడబ్బును ఎవరో దొంగిలించిరి. ఒకసారి అతడు గదికివచ్చి తలుపుతీయగా లోపల ఒక పెద్దపాము

పండుకొనియుండెను. ఆ గదిలోనికి గాలిరాదు. వెలుతురురాదు. పైగా ఆ ప్రాంతములో మలేరియాజ్వరము లెక్కువ. ఇట్టిచోట బస పెట్టుకొనుటచే తఱుచుగా అతని ఆరోగ్యము చెడుచుండెడిది. అతడు పూటకూళ్ళ యింట తినెడు తిండికూడ ఏమియు బలవర్ధకమయినది కాదు. ఆ ఆహారము అతని శరీరతత్త్వమునకు సరిపడెడిది కాదు. ఇన్ని ఇబ్బందులు పడుచున్నను అతడు 1890 లో జరిగిన ఇంటర్మీడియటుపరీక్షలో ఉత్తీర్ణుడయ్యెను. ఆ పరీక్షలో అతడు ఫార్మన్ కళాశాలా విద్యార్థులలో మొదటివాడుగను, విశ్వవిద్యాలయమున ఇరువదియైదవవాడుగను వచ్చెను. ఈ పర్యాయము అతనికి విద్యార్థివేతనము లభించినది. అందుచే అతడు ఆ కళాశాలయందే తన చదువు కొనసాగింప నిశ్చయించుకొనెను.

ఇట్లుండగా, హీరానందుడు ఏదయిన ఉద్యోగము సంపాదించుకొమ్మని తీర్థరాముని మరల ఒత్తిడిచేయ నారంభించెను. కాని యిత డంగీకరింప లేదు. దీనితో తండ్రి కొడుకులనడుమ మరల కలతలు రేగెను. ఈసారి హీరానందుడు తీర్థరామునకు డబ్బుపంపుట మానివేసెను. పైగా అతని భార్యనుకూడ లాహోరుకు పంపివైచెను. ఈ ప్రతికూలపరిస్థితులకు తీర్థరాము డేమియు జంకలేదు. తనచేతిలో చిల్లిగవ్వ లేకున్నను అత డెట్లో కాలము వెళ్ళబుచ్చుచుండెను. ఒక్కొక్కప్పుడు ధన్నామల్లునకు లేఖ వ్రాయుటకు పోస్టుకార్డుకొనుటకు ఒక పైస అప్పు తీసుకొనవలసివచ్చెడిది. ఒకనెలలో ఇంటిఖర్చులకు, కళాశాల ఖర్చులకుపోను మిగిలినసొమ్ము లెక్క చూచుకొనగా తక్కినరోజులకు రోజునకు మూడుపైసలచొప్పున మిగిలినవి. వీనిలో రెండుపైసలు పగటిభోజనమునకు ఒకపైస రాత్రి భోజనమునకు వెచ్చించెను. ఒకనాడు యథాప్రకారము రాత్రిపూట పాలు త్రాగుటకై బజారునకుపోగా అతని కాలిచెప్పు ఒకటి ప్రక్కనున్న మురికికాల్వలో పడిపోయెను. అదృష్టవశమున కొద్దిదూరములో ఎవరో ఒకస్త్రీ పారవేసిన చిరిగిపోయిన ప్రాత చెప్పులజత కనబడెను.

మరునాడు ఆతుకులుపెట్టిన ప్రాతచెప్పులు తొడుగుకొని అతడు కళాశాలకు పోయెను. ధన్నామల్లు వేసవిసెలవులకు ఇంటికి వెళ్లుమని ఎన్నిసార్లు మందలించి వ్రాసినను తీర్థరాముడు 1890 లో ఒక్కపర్యాయముతప్ప మరియెప్పుడును ఇంటికి పోలేదు. అతడు కోరుకొను ఏకాంతము, వ్యవధి, పని-ఇవి గుజరన్‌వాలాలోగాని, మురళీవాలాలోగాని లభింపవని అతని భయము. చదువులో శ్రమపడి, శ్రద్ధగా కృషిచేసి ఒక విశిష్టతను సాధించుట తన ముఖ్యాశయమని అతడు ధన్నామల్లునకు లేఖ వ్రాసెను.

నిరంతరము గ్రంథములను చదువుచుండుటచే తీర్థరాముని కనుచూపు మందగించెను. కళాశాలా ప్రధానోపాధ్యాయుడు అతనిని నేత్రవైద్య నిపుణునియొద్దకు పంపెను. ఆయన ఇతనికొక కండ్లజోడును నిర్ణయించెను.

ఆయన నిర్ణయించిన కండ్లజోడు లాహోరులో దొరకలేదు. అట్టిది బొంబాయిలోమాత్రమే దొరకునని విని అయిదురూపాయలు పంపి అతడు ఆ కండ్లజోడును తెప్పించుకొనెను. కండ్లజోడు పెట్టుకొనినపిమ్మట తీర్థరామునకు తరగతిలోని నల్లబల్లమీది అక్షరములు, దూరముననున్న వస్తువులు చూచుట సాధ్యమయ్యెను.

ఆ రోజులలో అతడు ధన్నామల్లునకు వ్రాసిన లేఖలనుబట్టి అతనిశారీరక మానసికస్థితులనుగూర్చి మనకు కొంత తెలియవచ్చును. 1890 సం॥ డిసెంబరునెలలో అతనికి కళాశాల రుసుములోవచ్చు ముదరాలో సగమునకు సగము తగ్గింపబడినది. ఆనెల కళాశాలలో ఆఫీసుపని లేకపోవుటయే ఈ తగ్గింపునకు కారణము. (అతడు కొంత ఆఫీసుపనికూడ చూచుచుండుట వలన ముదరా ఇచ్చెడివారు.) కాని తరువాతనెలలో ప్రధానోపాధ్యాయుడు ఉపన్యాసపత్రములకు నకళ్లు తీయుపని అతనికి అప్పగించి తగ్గించిన ముదరాను మరల పూర్తిగా ఈయ నారంభించెను. తీర్థరాముని అనారోగ్యమును జూచి ప్రధానాధ్యాపకుడు అతని యోగక్షేమములయెడ ఎక్కువశ్రద్ధ తీసికొన

కొచ్చెను. ఆయన తీర్థరాముడు వ్యాయామముచేయకుండ కళాశాల వదలి ఇంటికిపోకుండ జూచుటకు ఒకవిద్యార్థిని నియమించెను. పాఠ్యప్రణాళిక మంది పారశీకభాషను తొలగించిరి. దీనికి తీర్థరాముడు చాల సంతో షించెను. కాని పంజాబు విశ్వవిద్యాలయమువారు గణితశాస్త్రపరీక్షకుగల మార్కులను 150 నుండి 130 కి తగ్గించి, తక్కినమార్కులను మిగిలిన పాఠ్యవిషయములకు కలుపదలచిరని విని మిక్కిలి విచారించెను. తీర్థ రాముని సహపాఠులు అతని నివాసమునుచూచి, ఆత డెట్టి అశుభ్రము, అనా రోగ్యకరమునగు ప్రదేశములో నివసించుచున్నాడో ప్రధానాధ్యాపకునితో చెప్పిరి. తత్ఫలితముగా ఆయన రామతీర్థునికి కళాశాలా వసతిగృహమునకు వచ్చియుండుమని చెప్పెను. అచట వసతికి భోజనమునకు కలిపి నెలకు మూడురూపాయలు తొమ్మిది అణాలు అగును. ఇంకను ఖర్చు తగ్గించుకొన వలెనన్నచో అతడు ఎక్కువరోజులు సెలవు వచ్చినప్పుడు వసతిగృహ మునువదలి వెళ్ళవచ్చును. ఆయన ఆ సదుపాయమునుకూడ కల్పించెను. ఇచ్చట ఉన్నచో పుస్తకములు కొన నక్కరలేదు. తోడివిద్యార్థులయొద్ద నుండి ఎరువు తెచ్చుకొనవచ్చును. ఇది మరియొకలాభము. కళాశాలలోని మిఠాయి అంగడిదారుడు 'జంధూమల్' అనునతడు తీర్థరామునియెడల అనురాగముకలిగి అతనిని ప్రతిదినము తనతో కలిసి భోజనము చేయుమని కోరెను. తీర్థరాముడు దీని కంగీకరించి వసతిగృహములో ఒకపూట భోజనముచేసి, రెండవపూట జంధూమల్ ఇంట భోజనము చేయసాగెను. జంధుమల్ ఇతరవిధములకూడ అతనికి సాయపడుచుండెను. తీర్థరాము డన్నచో ఉపాధ్యాయులందరకు మిక్కిలి వాత్సల్యము. ఒకనాడు ప్రధానో పాధ్యాయుడు తన కెవ్వరో ఏబదిరూపాయలు తెచ్చియిచ్చిరనియు, ఆ సొమ్మును తీర్థరామునికొరకు వినియోగింపవలసినదని వారు కోరిరనియు అతనితో చెప్పెను. ఈ నెపముతో ప్రధానాధ్యాపకుడే తనకు సొమ్ము ముట్ట

తెప్ప దలచెనని రామతీర్థుడు తలంచెను. అతడు తా నా సొమ్ములో సగము మాత్రము తీసికొని తక్కినది కళాశాలకు విరాళముగా ఇత్తుననె చెప్పెను. కాని ఆయన దాని కంగీకరింపలేదు. తీర్థరాము డా సొమ్మునుతీసికొని బి. ఏ. పరీక్ష ప్రవేశరుసుమునకు తక్కిన ఖర్చులకు వినియోగించుకొనెను. అతడు 1892 లో బి. ఏ. పరీక్షకువెళ్ళి మొత్తముమార్కులలో విశ్వవిద్యాలయమున కంతకు మొదటివాడుగా వచ్చెను. కాని కొద్దిమార్కులు తక్కువై ఆంగ్ల ములోమాత్రము తప్పెను. ఈ ఫలితమునకు అందరును విభ్రాంతపడిరి. తీర్థరామునకే అది ఆశ్చర్యకరమయ్యెను. పరీక్షానియమములను మార్పు చేయుటకు కొన్నియత్నములు జరిగెను. మార్పు ఆలస్యముగావచ్చుటచే అతడు మరల ఇంకొకసంవత్సరము బి ఏ. తరగతి చదువవలసివచ్చెను. రామతీర్థునికివచ్చిన ఈ కష్టమెంతటిదో మనము ఊహింపవచ్చును. పరీక్ష తప్పుటవలన అతని విద్యార్థివేతనము పోయినది. పైగా కుటుంబమును పోషించుకొనుభారము ఉండనే ఉన్నది.

తీర్థరామునకు అదృష్టమునెడ మిక్కిలి నమ్మకము. అతని మన స్థైర్యము కూడ గొప్పది. అతని ఉపాధ్యాయులలో ఒకరైన ప్రొఫెసరు గిల్బర్టుసన్ అతని కొకరోజున చిన్న కాగితపుసంచి ఇచ్చెను. కళాశాల మూసినతరువాత తీర్థరాముడు ఆ సంచిని విప్పిచూడగా అందులో ముప్పదిరూపాయలుండెను. అతడు మరల ఆ ఉపాధ్యాయునికడకుపోయి ఆ సొమ్ములో ఇరువదిరూపా యలు తిరిగి ఇచ్చివేయుదుననెను. కాని ఆయన ఒప్పుకొనలేదు. ఆ సొమ్ము నంతను అతనినే తీసికొమ్మనెను. తీర్థరాముడు ధన్నామల్‌నకు వెంటనే లాహోరువచ్చి ఆ సొమ్మునుతీసికొని అందులో కొంతభాగము తన పవతి తల్లికి ఇమ్మనికోరుచు ఒకలేఖ వ్రాసెను. అతడు కళాశాలరుసుము కట్టుటకు రెండునెలలకు పదిరూపాయలు చాలును. తక్కినఖర్చులను ఏదోవిధముగా తనకు ఇతరత్ర లభించుసొమ్ముతో గడపవచ్చునని తలంచెను. 1892 లో

పరీక్ష తప్పినపిమ్మట అతడు తన పాఠ్యవిషయమగు పారశీకభాషనువదలి సంస్కృతభాషను తీసికొనెను. అప్పటి కతనికి సంస్కృతములో ఒక్క ముక్కరాదు. కాని గొప్ప ఏకాగ్రతతో శ్రద్ధగా సంస్కృతమును అభ్యసించి తన పాఠ్యగ్రంథమగు కాళిదాసుని *రఘువంశము* నుండి పెక్కుభాగములను కంఠపాఠము చేసెను. పరీక్షఫలితములు తెలిసినవి. తీర్థరాముడు ప్రథమ శ్రేణిలో, విశ్వవిద్యాలయమున కంతకు మొదటివాడుగా ఉత్తీర్ణుడయ్యెను. అతడు ఆంగ్లములోకూడ బాగుగా ఉత్తీర్ణుడయ్యెను. గణితశాస్త్ర పరీక్ష పత్రములో 13 ప్రశ్నలు ఇచ్చిరి. అందులో ఏ 9 ప్రశ్నలకైన సరియగు సమాధానములు వ్రాసినచో పూర్తిమార్కులు ఇత్తురు. తీర్థరాముడు ప్రశ్న పత్రములోని మొత్తము 13 ప్రశ్నలకు సమాధానములు వ్రాసెను. ఆ సంవత్సరము ఇట్టిప్రతిభను చూపినందులకు అతనికి ముప్పదియైదురూపాయల విద్యార్థివేతనమును గణితపరీక్షలో ప్రథముడుగా వచ్చినందులకు ఇరువదియైదురూపాయలను లభించినవి. తన కిట్టిమేలు జరిగినదని అతడు తండ్రికి లేఖవ్రాసెను. ఇదియంతయు దైవకృపవలన కలిగినదని అత డా లేఖలో వ్రాసెను. ఆ యేడు స్నాతకోత్సవములో అతని కొక బంగారుపతకమును ఏబదిరూపాయలను బహుమానముగా లభించినవి.

1893 వ సం॥ జూలై 17 వ తేదీని ఒక చమత్కారము జరిగినది. ఆ రోజున అతడు రావీ నదీతీరమునగల లాహోరు ప్రభుత్వకళాశాలా ప్రధానాధ్యాపకుడగు 'బెల్' అనువారిని కలుసుకొనెను. అప్పుడు కొద్దిగా వర్షము కురియుచుండెను. తీర్థరామునిదగ్గర గొడుగులేదు. బెల్ అతనిని తన బండిలోనికి రమ్మనెను. వారిద్దరు బండిలోఎక్కి ఊరిలోనికి పోవుచుండగా తీర్థరాముడు ఆయనకు కొన్ని ఆంగ్లపద్యములు చదివి వినిపించెను. ఆయన ఈతని కుటుంబస్థితిగతులను అడిగి తెలిసికొనెను. తీర్థరాముడు తన జీవితమంతయు భగవత్సేవకొరకు అంకితముచేయుట, గణితశాస్త్రమును

బోధించుట - అను రెండు గాఢమయినకోరికలు తనకున్నట్లు ఆయనతో చెప్పెను. ఆయన ఇతని వ్యాయామాభిరుచినికూడ తెలిసికొని కళాశాలా వ్యాయామశాలకు తీసికొనిపోయెను. అచ్చట తీర్థరాముడు తనకు ఇష్టమైన ఒక వ్యాయామమును చేసిచూపెను. ఒక కఱ్ఱమంచము యొక్క రెండు కోళ్ళను రెండుచేతులతోపట్టుకొని పైకి ఎత్తుచు, దించుచు, ఇట్లు వంద పర్యాయములు చేసిచూపెను. ప్రభుత్వకళాశాలలోని విద్యార్థులు అట్లు ఇరువది పర్యాయములకంటె మించి చేయలేరు.

పరిస్థితులు కొంచెము చక్కబడి, తీర్థరాముని స్వయంకృషి ఫలించి, విశ్వవిద్యాలయములో చదువుకొనవలెనన్న అతనికోరిక సుకరమగు అవకాశములేర్పడెను. అతనికి నెలకు అరువదిరూపాయల విద్యార్థి వేతనము లభించెను. అతనికి గణితశాస్త్రములో ఎక్కువకృషి చేయవలయునను కోరిక గాఢముగా ఉండెను. అతనికి లభించుచున్న అరువదిరూపాయలు అతనికి, అతనిభార్యకు చాలవు. కాని అతడు లాహోరు కళాశాలలో చేర వచ్చిననాటికి, నాలుగేండ్ల తరువాత బి. ఏ. పరీక్ష తప్పిననాటికి ఉన్నస్థితి కంటె ఇప్పుడు కొంచెము మెఱుగుగానే యున్నది. అతడు ఎట్లయినను ఎమ్. ఏ. పరీక్షకు చదివి పట్టమును సంపాదించుటకు నిశ్చయించుకొనెను.

ఫార్మన్ క్రైస్తవకళాశాలలో ఎమ్. ఏ. తరగతి లేకపోవుటచే తీర్థరాముడు ప్రభుత్వకళాశాలలో చేరెను. అతనికి ధన్నామల్లునెడ భక్తి ఏమాత్రము తగ్గలేదు. ఇప్పటికిని అతనికి ఆయన ఒక దైవసమానుడే। తీర్థరాముని ఆధ్యాత్మికశక్తులు క్రమక్రమముగా వృద్ధి పొందుచున్నవి. భగవంతునియెడల అతని విశ్వాసము అంతకంతకు బలవత్తరమగుచుండెను. ప్రకృతియొక్క ఆవిష్కారములయం దతనికి కుతూహలము పెరుగుచుండెను. ప్రకృతిసౌందర్యము నాతడు పెక్కుమారులు చక్కగా వర్ణించెను. ధన్నామల్లునకు ఉర్దూభాషలోనే లేఖలు వ్రాయుచుండెను. ఆ భాషలో

చక్కనిరచనలు చేయగలనేర్పు ఆతనికి అలవడినది. 1893 వ సం॥ జూను నెలలో అతడు వ్రాసిన ఒకలేఖలో లాహోరులో కురిసిన వర్షములను చక్కగా వర్ణించెను. ఈ వర్ణనాకౌశలము ఆతనియందు జీవితాంతమువరకు ప్రకాశించుచునే యుండెను.

రామతీర్థునకు ఏదైన కళాశాలలో గణితశాస్త్రోపాధ్యాయుడుగా పని చేయవలయునను కోరిక మిక్కుటముగా ఉండెను. డి. ఏ. వి. కళాశాలలో గణితశాస్త్రోపాధ్యాయపదవి ఒకటి ఖాళీ అయ్యెను. దానికై అతడు ప్రయత్నించెను కాని అది లభింపలేదు. అతడు ఫార్మన్‌కళాశాలలో తన ఉపాధ్యాయుడొకడు అనారోగ్యమువలన సెలవుపెట్టిపోగా ఆయనస్థానములో కొన్నివారములు అధ్యాపకుడుగా పనిచేసెను. భారతప్రభుత్వము ప్రతి సంవత్సరము ఒక విద్యార్థికి విదేశములలో విద్యాభ్యాసముచేయుటకు విద్యార్థి వేతన మొసంగును. విశ్వవిద్యాలయపు రిజిస్ట్రారును, కళాశాలా ప్రధానాధ్యాపకుడును తీర్థరాముని పేరును సూచించిరి. కాని ఆ వేతనము ఆర్. పి. పరంజపే అనునతనికి లభించెను. అతడు కేంబ్రిడ్జిలో ఉత్తమవిద్యార్థిగా పేరొందెను. రామతీర్థునకు అది లభింపకపోవుట దైవసంకల్పమేమో! లేనిచో విదేశములలో ఆ వయస్సున చిరకాలము నివసించుట రామతీర్థుని దృష్టిని లౌకికవిషయములలో నెక్కువ మగ్నము చేసియుండెడిదేమో ఎవ రెరుగుదురు? తీర్థరామునకు తాను అధ్యాపకుడుగానో, తత్త్వబోధకుడుగానో జీవితము గడపవలయునను అభిలాషయే అధికముగా నుండెను.

1894 వ సం॥ ప్రారంభమున రాముని సోదరి తీర్థదేవి చనిపోయెను. ఆమె అతనికంటె ఒక ఏడాదిపెద్దది. ఆమె మరణమునకు తీర్థరాముడు మిక్కిలి దుఃఖపడెను. ఆమెకంటె తనకు ప్రేమపాత్రులైనవారు లోకములో ఎవరును లేరని అతడు ఒకలేఖలో వ్రాసెను. దీనితోపాటు సాంసారికమైన ఇబ్బందులుకూడ ఆతనిని క్రుంగదీయుచుండెను. విద్యార్థి వేతన

ముగా ఆతనికి కొంతసొమ్ము ముట్టుచున్నను అది అతనిఖర్చులకు ఏమాత్రము చాలెడిదికాదు. ఆతడు తనకు, తనభార్యకు అగు ఖర్చులకు పోగా మిగిలినసొమ్ములో కొంత తండ్రికి, కొంత ధన్నామల్లునకు పంపు చుండుటయేకాక, మరికొందరు పేదవిద్యార్థులకుకూడ ఇచ్చుచుండెడివాడు. ఇన్నిఖర్చులు భరించుచుండుటచే అతడు నిరంతరము డబ్బున కిబ్బంది పడుచునేయుండెను. అతనికి పుస్తకములుకొనుట ఒక పెద్ద వ్యసనమయ్యెను. ఈ వ్యసనమే ఆతనిని ఆర్థికముగా పెక్కుకష్టములకు పాల్పడజేసినదని అతని మేనల్లుడు ప్రజలాలునకు స్థిరమయిన అభిప్రాయమేర్పడెను. తీర్థ రాముడు అనేకగ్రంథములను చదువుటయే ముఖ్యాశయముగా పెట్టుకొని, ఒక్కొక్కప్పుడు అప్పులు చేసియైన పుస్తకములు కొనుటకు సందేహించెడి వాడుకాడు తనకు నెలనెలకువచ్చు ఆ కొద్ది ఆదాయములోనుండియే ఈ అప్పులను తీర్చుకొనుచుండెడివాడు. ప్రతినెలకు కొంతకొంత మిగుల్చుకొని ఆ కూడబెట్టినసొమ్ముతో పరీక్షరుసుము కట్టవలెనని అతనితండ్రి తలంపు. కాని తీర్థరాము డట్లు చేసెడివాడు కాదు. సరిగా పరీక్షరుసుము కట్టవలసిన నాటికి రాముని యొద్ద డబ్బులేకపోగా అతని మేనమామ డా. రఘునాథ మల్ సొమ్ము సర్దుబాటుచేసి గట్టెక్కించెను.

1894 వ సం॥ ఫిబ్రవరి 9 వ తేదీని వ్రాసినలేఖలో రాముడు తాను ప్రభుత్వకళాశాలలో విద్యాభ్యాసము చేయునప్పటి తన దినచర్యావిశేషము లన్నిటిని విపులముగా వర్ణించెను. ఆరోజులలో అతడు ఉదయము 5 గంట లకులేచి రెండుగంటలసేపు గ్రంథములు చదువుకొనెడివాడు. పిమ్మట కొంత వ్యాయామముచేసి, స్నానము ముగించుకొని, బెల్ మహాశయుని ఇంటికి పోయెడివాడు. దారిలో పోవునపుడుకూడ ఏదియో పుస్తకమును చదువుచునే యుండెడివాడు. బెల్ మహాశయుని ఇంట భోజనముచేసి ఆయనతోబాటు బండిలో కళాశాలకు పోయెడివాడు. కళాశాలనుండి ఇంటికి

తిరిగివచ్చునపుడు కొంచెము పాలు తీసికొనుట అతనికి అలవాటు. ఇంటికి వచ్చి కొద్దిసేపు విశ్రాంతితీసికొని రావీ నదీతీరమునకు వాహ్యాళి వెళ్లను. అచ్చటికి చేరుటకు తన యింటినుండి వేగముగా నడచినచో ఒక గంట పట్టెడిది. మరల దారిలోనున్న తోటలలోనుండి ఇంటికివచ్చి సందెచీకటి పడువఱకు దాబామీద గడపును. అపిమ్మట కొద్దిసేపు చదువుకొని భోజనము చేసెడివాడు. భోజనానంతరము తన విద్యార్థితో కొంత వ్యాసంగముచేసి, పిమ్మట రాత్రి పదిగంటలకు తాను పరుండువేళవఱకు గ్రంథపఠనము చేయును. అతని ఆరోగ్యము బి. ఏ. చదువుచున్నప్పటికంటె ఈ రోజులలో బాగుగా ఉండెను. దారి నడచుచున్నప్పుడుకూడ చదువుచున్నను అతని ఆరోగ్యము చెడలేదు. జీర్ణశక్తి చక్కగా ఉండుటయే ఆరోగ్యరహస్యమని అతడు గ్రహించెను. "నేను ఆహారము కొంచెమే తిందును. దానిని బాగుగా నమలి తిందును" అని అత డొక లేఖలో వ్రాసెను. గణితశాస్త్రము అతనికి ప్రియమైనది. ఆ శాస్త్రముకొఱకు అతడు తన శక్తినంతను ధారపోసెను. 1891 లో అతడు ధన్నామల్లునకు వ్రాసినలేఖలో తాను ఒక లెక్కచేయుటకు పూర్తిగా ఇరువదినాలుగుగంటలు వినియోగించితినని వ్రాసెను. పురాణసింగు ఈ సందర్భమున ఒక చమత్కారమగు సన్నివేశమును ఉట్టంకించెను. ఆ కథ అతనికి రామతీర్థస్వామియే చెప్పెనట. ఒకనాడు తీర్థరాముడు ఉన్నత గణితశాస్త్రమున కొన్ని కఠినమైనప్రశ్నలను తీసికొని వానిని సూర్యోదయముకాకముందు సాధించెదనని ప్రతిజ్ఞపట్టి కూర్చుండెను. అవి సాధింపలేకపోయినచో తానాత్మహత్య చేసికొనుటకు నిశ్చయించుకొనెను. అందుకు వీలుగా ఒక కత్తిని తన బల్లక్రింద పెట్టెను. అర్ధరాత్రమగునరికి నాలుగులెక్కలలో మూడులెక్కలకు జవాబులు సాధించెను. నాలుగవప్రశ్న ఎంత తల బద్దలు కొట్టుకొన్నను లొంగినదికాదు. తెల్లవారినది. ప్రశ్న సాధ్యము కాలేదు. తనప్రతిజ్ఞ ప్రకారము అతడు ఇంటి పై భాగమునకుపోయి

పదునైన కత్తిమొన తన కంఠమున కాన్పుకొనెను. అంతట కంఠమునుండి కొంత నెత్తురువచ్చి అతనికి తల తిరిగినట్లయ్యెను. అంతలో హఠాత్తుగా ఆకాశమున ధగధగలాడుచున్న అక్షరములరూపములో ఆ ప్రశ్నకు సమాధానము కానవచ్చినది. అతడు వెంటనే క్రిందికి పరుగెత్తి తాను చూచిన అక్షరములను ఒక కాగితముపై వ్రాసికొనెను. పిమ్మట ఆ కాగితమును కళాశాలలోని తన ఆచార్యునకు చూపగా ఆయన తీర్థరాముని ప్రతిభకు అమితాశ్చర్యము పొందెనట. బహుశః ఆ సమాధానము అంతకుపూర్వము ఆయనకుకూడ సాధ్యము కాలేదేమో!

తీర్థరాముని గణితశాస్త్రాభినివేశమున కవధులు లేకుండెను. అతడు క్లిష్టములయిన గణితసమస్యలను ముందువేసికొని గంటలతరబడి కూర్చుండి వానికి సమాధానములు కనుగొనుటలో కాలము గడుపుచుండెడివాడు. ఈ గణితశాస్త్రాభినివేశము అతనికి చిరకాలముండెను. కొన్ని సంవత్సరముల తరువాత అతడు అమెరికా సంయుక్తరాష్ట్రములకుపోయి ఉపన్యాసము లిచ్చినపుడు అచ్చటి సభాసదులకు, ఒక గణితప్రశ్నను కాగితముపై వ్రాయుటకు ఎంతకాలము పట్టునో అంతేకాలములో ఆ ప్రశ్నకు సమాధానమును సాధించెడివాడనని తెలిపియున్నాడు. అతడట్లు చేయగలుగుటకు కారణమునుకూడ వివరించెను. గణితశాస్త్ర నిబంధనలన్నియు అతనికి జిహ్వాగ్రమున ఉండెడివట! కంప్యూటర్లులేని ఆ కాలములో తన మనస్సే ఒక కంప్యూటరుగా ఉండెడిదట. ఉదాహరణకు:- 18 స్థానములుగల ఒక అంకెను 17 స్థానములు కల ఒక అంకెతో ఒక్కసారి గుణించి ఒకే ఒక పంక్తిలో ఆ మొత్తముసంఖ్యను వ్రాసెడువాడట. ఇది కేవలము అభ్యాసమువల్లనే సాధ్యపడినదని ఆయన తెలిపెను. ఫోర్మన్ కళాశాలలో తాను విద్యార్థిగా ఉన్నపుడు తన ఆచార్యుడగు గిల్‌బర్ట్‌సన్ అనారోగ్యమువలన సెలవు పెట్టుటచే ఆయనస్థానములో రోజున కొక గంటచొప్పున ఈతడు అధ్యాపకుడుగా

పనిచేసెను. ఆ ఉపాధ్యాయుడు అనారోగ్యము కుదుటబడక సెలవుపెట్టి మరల అమెరికాకు పోయినప్పుడు ఎమ్. ఏ. తరగతి చదువుచున్న తీర్థ రాముడు ఆ స్థానములో ఉపాధ్యాయుడుగా పనిచేసెను. ఇట్లు అధ్యాపకుడుగా పనిచేయుదినములలో తీర్థరాముడు ఎన్నడును ఆ ఆచార్యుడు కూర్చుండు కుర్చీలో కూర్చుండక విద్యార్థులకు నిలుచుండియే పాఠము చెప్పెడివాడు. ఆచార్య గిల్‌బర్ట్‌సన్ తిరిగివచ్చినపుడు ఇతనికి ఒక బంగారపుగడియారము తెచ్చి కానుకగా ఇచ్చెను. తీర్థరాముడు వయస్సుచేతను మనస్సుచేతను పెరిగినను, ధన్నామల్లును తన గురువుగనే భావించుచు గౌరవింపసాగెను. తన జీవితములోని ప్రతి స్వల్పసంఘటనమును ఆతని కెఱిగించుచు, తాను చేయు ప్రతి ముఖ్యమైనపనికి తొలుత ఆయన ఆమోదమును పొందు చుండెను. తాను కాలము నెట్లు వినియోగించుచున్నదియు, డబ్బును ఎట్లు ఖర్చుపెట్టుచున్నదియు, వివరముగా ఎప్పటికప్పుడు ధన్నామల్లునకు లేఖల మూలమున తెలియపఱుచుచునే యుండెను. ఎప్పుడైన ధన్నామల్లు రాము నితో ఘర్షణపడి నిందాపూర్వకముగను, పరుషవాక్యములతోను లేఖలు వ్రాసినను, అతడు అవన్నియు సహించి ఆయనపట్ల తనకు లేశమాత్రము కూడ దుర్భావము లేదని జవాబులు వ్రాయుచుండెడివాడు. ఒకసారి ఆయ నకే ఈతడు సలహాచెప్పెను. ధన్నామల్లు చీటికిమాటికి కోపపరవశుడగు చుండుటకు కారణము ఆయనకు జీర్ణశక్తి లోపించుటయేయని తెలిపి, తన్నివా రణమునకు ఒక ఔషధమును సూచించుచు ఒకలేఖ వ్రాసెను. ఒకలేఖలో అతడు 'సత్పురుష సహవాసము, ఉత్తమగ్రంథములు, భగవద్ధ్యానములు- ఇవి ఒక వ్యక్తిని మూడులోకములకు అధిపతిని చేయును' అని వ్రాసెను. ధన్నామల్లునకు కోపావేశము మరియు మిన్నంటెను. అతని చిఱచిఱలు మరియు అధికమయ్యెను. తీర్థరాముడు 'ఎక్కువగా ఏకాంతవాసము చేయుచు, మితముగా భోజనముచేయువ్యక్తితో భగవంతుడు సహవాసము

చేయును' అని మరల లేఖ వ్రాసెను. మరియొకసలహా ఏమనగా 'మనకు శాంతి కావలయునన్నచో మన శరీరముపై మమకారము పనికిరాదు. అది భగవంతునిదే యని భావించుచు అతనిసేవయందే నిమగ్నుడవై కాలము గడపవలయును' అని-ఒకసారి ధన్నామల్లు తన బంధువులతో తగవులాడి ఆ సంగతి లేఖలో వ్రాయగా, తీర్థరాముడు 'భగవంతుడు కఠినహృదయుడు కాడు ఆయన లీలావినోది - ఒక్కొక్కప్పుడు మనబాధలు ఆయన లీలా వినోదఫలితములే' అని వ్రాసి అతనిని ఊరడించెను.

ఇతరుల కిట్లు సలహాలు చెప్పుచున్నాడనుటచే తీర్థరామునకు జీవితములో ఎదుర్కొనవలసిన కష్టములు లేవని కాదు. అతనికి విద్యార్థివేతనముగా కొంతసొమ్మును విద్యార్థులకు పాఠములు చెప్పుటచే కొద్దిసొమ్ము వచ్చుచున్నను, అతడు దబ్బున కిబ్బంది పడుచునే యుండెను. ఒక్కొక్కప్పుడు ధన్నామల్లునకు లేఖ వ్రాయుటకు పోస్టుకార్డు కొనుటకుకూడ అతనియొద్ద పైస ఉండెడిదికాదు. తనకు దైవమే సాయపడునన్న నమ్మకము అతనికి గాఢముగా ఉండెను. అతడు ఎం. ఏ. పరీక్షకు ప్రవేశరుసుము కట్టుటకై సొమ్మునకు తడవుకొనుచుండగా అతని మేనమామ డా॥ రఘునాథమల్ నుండి కావలసినసొమ్ము తలవనితలంపుగా అందినది. పరీక్షాఫలితములు తెలిసినవి. అందులో అతడు ఘనవిజయము సాధించెను. ఈ గెలుపు అతడు బి. ఏ. పరీక్షలో సాధించినంత గొప్పది కాకపోయినను, తక్కువది కాదు. అతడీ శుభవార్త తన మేనమామకు తెలుపుచు వ్రాసినలేఖలో 'పరీక్ష చాల కష్టముగా ఉండెను. ఇంత కఠినమైన ప్రశ్నపత్రములు భారతీయ విశ్వ విద్యాలయములలో ఎన్నడును ఈయబడలేదు' అని వ్రాసెను. ఆ రోజులలో ఎమ్. ఎ. పరీక్షకు కూర్చుండు విద్యార్థులే చాల అరుదుగా ఉండెడివారు. 1895 లో తీర్థరాముడు పరీక్షకు వెళ్ళినపుడు అత డొక్కడే అభ్యర్థియై యుండవచ్చును. లేదా పరీక్షలో అత డొక్కడే నెగ్గియుండును. 1891 లో

ఒక్క విద్యార్థిమాత్రమే ఉత్తీర్ణుడయ్యెను. దీనినిబట్టి రాముడు సాధించిన ఈ విజయము అతనికి, అతని స్నేహితులకు, బంధువులకు ఎంత ఆనంద మొసగూర్చియుండునో మన మూహింపవచ్చును. ఈ విజయము భగవదాశీర్వచన ఫలితమని రాముడు భావించెను.

ఇప్పుడిక ఏదైన ఉద్యోగము సంపాదించుకొనవలెను. తీర్థరామున కిది ఒక సమస్య అయినది. అతని తండ్రి, బంధువులు, గురువైన ధన్నామల్, అతని ఉన్నతవిద్యకు తగినది, విద్యకుతగిన ధనమును సంపాదించుట వీలయినదియునగు ఉద్యోగము నాతడు సంపాదింపవలెనని కోరుచుండిరి. అతని పోషకులు, మిత్రులు చాలమంది అతనికి విద్యాశాఖలోగాని మరి యే ఇతరశాఖలోగాని సులువుగా సంపాదించిపెట్టెడివారు కలరు. ప్రభుత్వ కళాశాలా ప్రధానాధ్యాపకుడగు బెల్ మహాశయుడు అతనికి రాష్ట్రపరిపాలన శాఖలో ఒక ఉద్యోగమును ఎన్నిక చేసెను. రాముడు దానికి అంగీకరింపలేదు. తాను ఇంతకాలము శ్రమపడి కృషిచేసినది తనపంటను నలుగురకు పంచుటకేగాని అమ్ముకొనుటకు కాదని అత డాయనకు బదులు చెప్పెనట. పరిపాలనాసంబంధమైన పదవులకంటె, ఉపాధ్యాయపదవికే తా నెక్కువ ప్రాముఖ్యమిత్తునని ఖండితముగా చెప్పెను. సంయుక్తరాష్ట్రములలోని మీరట్, బెల్లీలలో ఉపాధ్యాయపదవులు ఖాళీగా ఉన్నవికాని తీర్థరాముని స్నేహితులు అతడు పంజాబు వదలివెళ్లుటకు ఇష్టపడలేదు. పెషావరులో ఒక ఉన్నతపాఠశాలా ప్రధానోపాధ్యాయపదవి ఖాళీగా ఉండెను. అత డా పదవిని చేపట్టుటకు బెల్ మహాశయు డంగీకరింపలేదు. రాము డొకసారి రాష్ట్రవిద్యాశాఖాధికారికి విద్యాశాఖలో ఒక ఉద్యోగముకొఱకు దరఖాస్తు పెట్టగా ఫలితము శూన్యమయ్యెను. చివరకు ప్రధానాధ్యాపకుని సలహాపై రాము డొక ప్రకటన చేసెను. తాను ఇంటర్మీడియేటు, బి. ఏ. విద్యార్థులకు గణితశాస్త్రములో ప్రయివేటుగా పాఠములు చెప్పెదనని ప్రకటన చేసెను.

ఇంటర్మీడియేటు విద్యార్థులకు నెలకు పదిరూపాయలు. బి. ఏ. విద్యార్థులకు నెలకు పదునైదురూపాయలు రుసుము. తరగతికి పదిమంది తక్కువ కాకుండ విద్యార్థు లుండవలెను. ఈ ప్రకటనఫలితముగా ఒక్క విద్యార్థి మాత్రమే చదువుకొందునని వచ్చెను. ఈ ఇబ్బందులకుతోడు, అతడు వేసవిలో ఎక్కువకృషి చేయుటవలన ఆరోగ్యము పాడయ్యెను. అందుచే అతడు తనగ్రామమునకుపోయి కొన్నివారములు గడపుట తప్పనిసరి అయ్యెను. అతడా పల్లెపట్టున ఉండుట చాల మేలయ్యెను. జూలై నెలలో మరల ఉద్యోగప్రయత్నములుచేయుటకై అతడు లాహోరునకు తిరిగి వచ్చెను.

# 3. రాముని ఉపాధ్యాయపదవులు

తీర్థరాముడు లాహోరునకు తిరిగివచ్చినపిదప సనాతనధర్మసభయొక్క విద్యాసంఘములో సభ్యుడుగా ఎన్నుకొనబడెను. సభ నిర్వహించుచున్న పాఠశాలలో శాస్త్రగణితశాఖలను నడపుభారము నాతనికి అప్పగించిరి. అతడు తీసికొనిన శ్రద్ధవలన ఆ పాఠశాల కొక నూత్న చైతన్యమువచ్చెను. రాము డా రోజులలో కాలక్షేపమునకై డి. ఏ. వి. ఉన్నతపాఠశాలలో కొన్ని వారములపాటు చిత్రలేఖనము నేర్చుకొనెను. 1895 వ సం॥ సెప్టెంబరులో తీర్థరాముడు సెయిల్‌కోటలోని క్రైస్తవోన్నతపాఠశాలలో నెలకు ఎనుబది రూపాయల జీతముమీద రెండవ ఉపాధ్యాయుడుగా చేరెను. ఎప్పటివలెనే అతడు తనజీతములో కొంతభాగమును పేద విద్యార్థులకిచ్చి సాయపడుచుండెను. సమర్థుడయిన గణితశాస్త్రోపాధ్యాయుడుగా పేరుపడుటచే అతని మూలమున పాఠశాలలోని విద్యార్థులసంఖ్య అధికము కాజొచ్చెను. ఒకసారి ఒక పరిచితునియొద్దనుండి తీర్థరాముడు పదిరూపాయలు అప్పు తీసికొనెను. అతడు ఆ పాఠశాలలో పనిచేసినంతకాలము నెలకు పదిరూపాయల చొప్పున ఆ పరిచితునికి ఇచ్చుచుండెడివాడట! ఇది తగదని ఆత డెంత మొఱపెట్టినను తీర్థరాముడు వినలేదు. పాఠశాలలో పని ముగించుకొనిన పిమ్మట రాముడు పట్టణములోని సనాతనధర్మసభకు సేవ చేయుటయందే ఎక్కువకాలము గడపుచుండెను. అప్పుడప్పుడు ఉపన్యాసములుకూడ ఇచ్చుచుండెను. ఆ ఉపన్యాసములకు చాలమంది పురప్రముఖులతోబాటు, అసంఖ్యాకముగా జనులు వచ్చుచుండెడివారు. అతడు పనిచేయుచున్న పాఠశాలలోని వసతిగృహమునకు ఒక మహమ్మదీయోపాధ్యాయుడు పర్యవేక్షకుడుగా ఉండెను. అత డొకనాడు వసతిగృహమున గొడ్డుమాంసము వండుటకు

అనుమతించెను. దీనిపై వసతిగృహములోని విద్యార్థులు అతనిపై ఫిర్యాదు చేయగా అధికారు లాతనిని ఆ పదవినుండి తొలగించి, ఆ స్థానమున తీర్థ రాముని నియమించిరి. అతని కచ్చట ప్రత్యేకింపబడిన బస విశాలముగను ప్రశాంతముగను ఉండుటచే నతడు మిక్కిలి సంతోషించెను. విరామము చిక్కినప్పుడెల్ల రాముడు ఉపన్యాసము లిచ్చుటయందు, చుట్టుప్రక్కల పట్టణ ములను చూచివచ్చుటయందు గడపుచుండెను. అతడు సెయిల్‌కోటలో ఉన్నరోజులలో అతని మామగారును, సవతితల్లియు చనిపోయిరి. ఈ సమ యముననే అతడు పంజాబు విశ్వవిద్యాలయపు మెట్రిక్యులేషను పరీక్షకు గణితశాస్త్రములో ఉప పరీక్షకుడుగా నియమింపబడెను. ఆ సంవత్సరము అతడు సుమారు రెండువేల సమాధానపత్రములు చూడవలసివచ్చెను. తరువాత అతడు లాహోరులో ఉన్నప్పుడుకూడ ఇంటర్మీడియటు, బి. ఏ. పరీక్షలకు ఉప పరీక్షకుడుగా పనిచేసెను.

తీర్థరామునకు సెయిల్‌కోట వాతావరణము సరిపడలేదు అతడు నిత్యము శరీరవ్యాయామము చేయుచున్నను, ప్రతిదినము స్నానమునకై నదివరకు నడచిపోవుచున్నను, అతడు క్రమముగా నీరసపడజొచ్చెను. డిసెంబరు 3 వ తేదీని అతడు పాఠశాలనుండి తిరిగివచ్చుచు దారిలో స్పృహతప్పి పడి పోయెను. అతని కంటిబాధ, జీర్ణకోశపు బాధ-అట్లే యుండెను. ఒకసారి ఒక వారమురోజులు అతడు పాలుమాత్రమే తీసికొని గడిపెను. ఇట్లుం డగా అతనికి లాహోరులో తాను చదువుకొనిన ఫార్మన్ క్రైస్తవకళా శాలలో గణితశాస్త్రోపాధ్యాయ పదవి లభించెను. అతడు బ్రహ్మానందపడెను. పూర్వము రామునిపై అపరివాత్సల్యములు చూపిన ఆచార్య గిల్బర్ట్‌సన్ పదవీవిరమణము చేయుటవలన ఆ పదవిలో ఈతనిని నియమించిరి. 1895 డిసెంబరు చివరిరోజులలో ఇది లభించినది. తీర్థరాముడు 1896 మార్చి నెలలో తాను పనిచేయుచున్న పాఠశాలను వదలిపెట్టెను. సెయిల్‌కోటను

వదలివచ్చునప్పుడు అతనిని సాగనంపుటకు పాఠశాలోపాధ్యాయులు, విద్యార్థులు, సనాతనధర్మ సభాసభ్యులు, పెక్కుమంది పురప్రముఖులు రైలు స్టేషనుకు వచ్చిరి. అపిమ్మట ఆ పాఠశాలాప్రధానోపాధ్యాయుడు (అమెరికా దేశీయుడు) తానెప్పుడు లాహోరువెళ్ళినను రామతీర్థునిక్షంటనే దన చేసెడివాడు.

తీర్థరాముడు 1896 సం॥ ఏప్రిలు నెలలో తన పదవియందు చేరెను. కొద్ది నెలలయినపిమ్మట అతనికి అంతకంటె పై స్థానమిచ్చిరి. ఆ రోజులలో ఆతడు వ్రాసిన లేఖలనుబట్టి, అతనికి పరిశోధనచేసి డి. ఎస్. సి. పట్టం పొందవలెననుకోరిక యుండెడిదనియు కాని అది నెరవేరలేదనియు తెలియుచున్నది. ఏమయినను అతడు కళాశాలోపాధ్యాయుడుగా పనిచేయుట అతని జీవితమున ఒక నూతనాధ్యాయమునకు నాంది అయ్యెనని చెప్పవచ్చును. లాహోరునకు వచ్చినపిమ్మట అతనికి ప్రాపంచికవిషయములకంటె మతముపై ఆసక్తి అధికము కాజొచ్చెను. ధనమునుకాని, ఇతర లౌకిక భోగవస్తువులనుగాని కూడబెట్టుటయన్న రామునకు ఇష్టముండెడిది కాదు. తనకు వేతనముగాను, ఇతర పారితోషికముల మూలమునను వచ్చు ధనమును అతడు పేదలకు పంచిపెట్టుచు, కొలదిదినములకు వారివలె తానును డబ్బునకు ఇబ్బందిపడుచుండెడివాడు. ఒకసారి పంజాబు విశ్వవిద్యాలయమువారు పరీక్షకుడుగా పనిచేసినందుల కొసంగిన పారితోషికము మూడువందల యేబదిరూపాయలను రెండురోజులలో ఖర్చుపెట్టెను. మూడవరోజున అతనిచేతిలో ఒకరూపాయ మిగిలెను. ఇట్టి లౌకికవిషయములలో అతని మనోవైఖరి ఎట్లుండెనో అతడు 1896 సం॥ జూను 6 వ తేదిని ధన్నామల్లునకు వ్రాసిన లేఖనుబట్టి స్పష్టమగును. ఆ లేఖలో అతడు తనభార్యకు నగలు చేయించుటయందుగాని, విలువైన సామగ్రిని కొనియుంచుటయందుగాని తన కెట్టి యానందము కలుగదని వ్రాసెను. "నాకు ఉండుటకు చెట్టుపీట,

కట్టుకొనుటకు చింకిపాతలు, పరుండుటకు కటికనేల, తినుటకు ఎవరైన దయదలచి ఇచ్చిన ఒక రొట్టె చాలును'' అనియు అత దా లేఖలో వ్రాసెను. 'నాకు కళాశాలవారు ఇచ్చు జీతమును దాచిపెట్టెదను; అది మీ యిష్టము వచ్చినట్లు ఖర్చుపెట్టు'డనియు అతడు ధన్నామల్లునకు ఒకలేఖలో వ్రాసెను. మరియొక లేఖలో 'చక్కగా కృషిచేసి నా హృదయమున దేవునికి ఒక చిన్న దేవాలయమును నిర్మించుటయే నా కర్తవ్యము' అని వ్రాసెను. గణితశాస్త్రమన్న ప్రాణము పెట్టెడివాడగుటచే ఆ శాస్త్రమునకు అధికప్రచారము తెచ్చుట ఎట్లాయని నిరంతరము ఆలోచించుచుండెడివాడు. అతడు చాల రోజులనుండి, గణితశాస్త్ర ప్రాముఖ్యమునుగూర్చి పరంపరగా ఉపన్యాసము లీయవలెనని తలపోయుచుండెను. ఆ ఉపన్యాసములలో చెప్పదలచిన విషయములనన్నిటిని వ్రాసిపెట్టి, తరువాత కొన్నాళ్ళకు వానిని తన స్వంత ఖర్చుమీద ఒక చిన్నపుస్తకముగా ప్రకటించెను. దానిని ప్రచురించుటకు నూటయిరువదియైదు రూపాయలయ్యెను. అచ్చయిన పుస్తకములలో చాలభాగము ఉచితముగా పంచిపెట్టుటకే సరిపోయెను. గణితశాస్త్రాభిమానులైన విమర్శకులనుండి ఆ గ్రంథముపై ప్రశంసాపూర్వకమగు సమీక్షలు వచ్చినవి. ఆ ఉపన్యాసములలో రెండింటిని, తరువాత అతని సమగ్రగ్రంథ సంపుటములలో చేర్చిరి. అందులో ఒక ఉపన్యాసమును 'విజ్ఞానముకొఱకే విజ్ఞానమును సంపాదింపవలెనని గ్రహింపుము' అను హితబోధతో ఆరంభించెను. గ్రీకు పురాణకథలలో ఒకరకము దేవతలు పైకి క్రూరముగను దుస్సహముగను ఉండి ఆంతర్యమున పరమసుందరులుగా ఉందురని వర్ణింపబడినదట. రామతీర్థుడు గణితశాస్త్రమును సముద్రముతోను, ఆ గ్రీకు దేవతలతోను పోల్చుచుండెడివాడు. 'సూర్యకాంతివలె గణితశాస్త్రము ఆలోచనాపరులు కానివారికి వర్ణరహితముగా నుండును కాని నిజమున కది చిత్రవర్ణసుందరమగు ఇంద్రధనుస్సు వంటిది.' 'గణిత

శాస్త్రము మనలను పరిమితత్వమునుండి అపరిమితత్వమునకు నడిపించును.' 'గణితశాస్త్ర హిమాలయములందలి కీర్త్యానందములనెడి పార్వతీదేవిని కనుగొనుటకు మహాదేవుని తృతీయలోచనమువంటి లోచనము కావలయును.' ఇది మొదటి ఉపన్యాససారాంశము.

రెండవ ఉపన్యాసమున గణితశాస్త్రమున నిష్ణాతుడగుటకు పలయు సూచనలు చేయబడెను. అలవాట్లలో మితముగా ఉండుట, నిరాడంబరమగు కొద్ది ఆహారము, తగినంత శరీరవ్యాయామము ముఖ్యములని అతడు తెలిపెను. మానసికమగు ఎట్టి తొందరపాటు, ఆందోళనము లేకుండ నిర్మలముగానుండి క్రమాభివృద్ధిగ ఈ శాస్త్రమును సాధింపవలెను. గణితశాస్త్రవిద్యార్థి ఎల్లప్పుడు సరళహృదయుడై, నమ్రస్వభావుడై యుండవలెను. అన్నిటికంటె ముఖ్యమయినది మనము మన గొప్పదనముకంటె భగవంతుని ఘనతకే ఎక్కువ ప్రాధాన్యమీయవలెను.

తీర్థరాముడు నిదానముగా ఆత్మజ్ఞానాభిముఖముగ పయనించుచుండెను. అతడు దివ్యత్వమును పొందుటకు మూడుమార్గము లున్నవనెను. ఒకటి - కర్మపథము లేక కర్మయోగము. ఇది చురుకుదనముగలవారికి మంచిది. 2. ప్రేమపథము లేక భక్తియోగము. ఇది రసావేశపరులకు తగినది. 3. జ్ఞానపథము లేక జ్ఞానయోగము. ఇది ధ్యానాసక్తులకు యోగ్యమైనది. రాముడు భక్తిపథమును ఎన్నుకొనెను. ఇది అతనియందు నిరంతరము భగవద్గీత చదువుచు, శ్రీకృష్ణునిపై ఒకవిధమగు మధురభక్తిని పెంపొందించుకొనుటవలన చక్కగా స్థిరపడెను. ఎచ్చటనైన మురళీస్వనము వినబడినచో అతడు పరిసరములను మఱచి పరవశుడగుచుండెను. ఒక్కొక్కప్పుడు శ్రీకృష్ణునిపేరు ఉచ్చరించినంతమాత్రముననే పరవశించిపోయెడివాడు. తాను కలలు కనుచున్న ఆ దేవుని దర్శనముకొఱకు పెక్కుమార్లు రావీనదీతీరమున ఒంటరిగా తిరుగసాగెను. అతడీ భక్తియోగసాధన

చేయురోజులలో ఒకనాడు ఆకాశమునకున్న నీలిమబ్బును శ్రీ కృష్ణదేవునిగా భావించుచు భక్త్యావేశముచే మూర్ఛాపరవశుడగుట ఒకస్నేహితుడు చూచెను. మరియొకసారి ఒకపండితుడు తులసీదాసుని రామాయణము చదువుచుండగా తీర్థరాము డానందపారవశ్యమున ఏడువ నారంభించెను. అతడా మూర్ఛ నుండి ఎంతసేపటికిని తేరుకొనకపోవుటచే నాటికి కథాపఠనము ఆపుచేయ వలసివచ్చెను. ఈ దినములలో అతని భక్త్యావేశము ఆనందబాష్పముల రూపమునను, కృష్ణసంకీర్తనరూపమునను ఆవిష్కృతమగుచు గాఢపార వశ్యముగా పరిణమించుచుండెను. భగవద్గీత యెడను, శ్రీ కృష్ణునియెడను అతనిభక్తి యుత్కృటమై, అతడు 1896 సం॥ ఆగష్టునెలలో శ్రీ కృష్ణ దేవుని జీవితసన్నివేశములకు సంబంధించియున్న మధుర, బృందావనము మున్నగు ప్రదేశములకు యాత్రలు చేసెను. ఈ ప్రదేశములన్నియు అతడు దీనదయాళు పండితునితో కలిసి పర్యటించెను. దీనదయాళు పండితుడు సనాతనధర్మసభలో ప్రధానవక్త. ఈ పర్యటనలో తీర్థరాముడు శ్రీ కృష్ణసంకీర్తనములలో ఎక్కువగా పాల్గొనెను. ఒకసందర్భమున అతడు ధ్యానము చేయుచున్నపుడు తాను భగవత్సాక్షాత్కారము పొందితినని తెలిపెను అతడు లాహోరు తిరిగివచ్చినపిమ్మట భక్తియోగము నుగూర్చి ఉపన్యాసము లిచ్చుట కారంభించెను. అతడు అశుధారగా, అనర్గళముగా ఉపన్యసించుచుండగా, అతని వాగ్ధారకు సభాసదులు నిశ్చేష్టులగుచుండెడివారు. పరంపరగా ఈ యుపన్యాసము లిచ్చుచున్నరోజులలో ఆర్. ఎస్. నారాయణ అమృతసర ములో అతని ఉపన్యాసము వినుట తటస్థించెను. ఈ నారాయణ ఆర్య సమాజ సిద్ధాంతములయందు విశ్వాసము కలవాడు. ఇతడు తీర్థరాముని ఉప న్యాసమును విని కదలిపోయి అతనికి ముఖ్యశిష్యుడయ్యెను. ఇతనినే తరు వాత నారాయణస్వామి అనెడివారు. రామతీర్థుని జీవితచరిత్ర వ్రాసినవారిలో ఇతడే మొదటివాడు.

తీర్థరాముని ఆధ్యాత్మిక సాధనలు క్రొత్తపుంతలు త్రొక్కసాగెను. అతని భక్తియోగసాధన అంతకంతకు ప్రగాఢమై వృద్ధిపొందియున్నచో అతనికి ఉన్మాదము కలిగియుండెడిది. ఇట్టి స్థితిలో ద్వారకా పీఠాధిపతులు జగద్గురు శ్రీ మాధవతీర్థ శంకరాచార్యులవారు లాహోరు విచ్చేసిరి. సనాతన ధర్మ సభాకార్యదర్శిగా తీర్థరాముడు ఆయనకు సన్నిహితుడయ్యెను. శ్రీ శంకరాచార్యులవారు నగరములో ధర్మోపన్యాసములు చేయుటయేకాక తీర్థ రామునికి అద్వైత సిద్ధాంతములను ప్రత్యేక శ్రద్ధవహించి బోధించిరి. దీనితో తీర్థరాముని శ్రీ కృష్ణదర్శనాభిలాష ఆత్మసాక్షాత్కార వాంఛగా మారెను. ఏకాంతమునసుండి ధ్యానము చేయుటయందు ఎక్కువ కాల మాతడు వినియోగింపసాగెను. మధుర బృందావనములకంటె ప్రశస్తతర మనిపించుకొన్న ఉత్తరఖండమును దర్శించుకొనెను. ఆంగ్లభాషలో వ్రాయ బడిన వేదాంత గ్రంథములనుదెచ్చి అదేపనిగ చదువసాగెను. అమెరికాదేశ రచయితలగు ఎమర్సను, థోరియో, వాల్ట్ విట్మన్ అనువారు అతని అభిమాన రచయితలైరి. ఈ రచయితలు భారతీయ తత్త్వశాస్త్ర సిద్ధాంత ములచే మిక్కిలి ప్రభావితులైనవారు.

తీర్థరాముడు హృదయపూర్వకముగా అద్వైత వేదాంత సాధనయందు నిమగ్నుడయ్యెను. కళాశాలపని ముగించుకొనినపిమ్మట అత డెక్కువ కాలము ఆత్మధ్యాన ప్రార్థనలయందు గడుపసాగెను. నాటినుండి 'ప్రపంచ ములో సత్యమనునది ఉన్నచో అది వేదాంతమునందే కలదు' అన్నది అతని సిద్ధాంతమయ్యెను. ఒకసారి ఒకరు రాముని 'ఇపుడు సమయ మెంతైనది?' అని అడుగగా 'ప్రాతర్మధ్యాహ్నసాయంసమయములం దెప్పు డైనను రాముని గడియారము ఒకే సమయమును చూపును' అని యతడు బదులు పలికెను. కాలము గడచుచున్నకొలది రామునకు వేదాంత మతముతో అవినాభావసంబంధ మెక్కుడగుచుండెను. 'నేను భయరహితుడనైతిని'

అవి అత డొకసారి ప్రకటించెను. అది ఎట్లు సాధ్యమయ్యెను ?-అతడు దంద రకు ఇట్లు బోధింపసాగెను : 'ప్రపంచమును మాయను పరిత్యజింపుము. అవి నీకు దాస్యమొనర్చును' సర్వసంగపరిత్యాగపథమున అతడు వడి వడిగా సాగుచుండెను. అతని బంధువులందరు అతడు తమకు కాకుండ పోవుచున్నాడని భయపడసాగిరి. అక్టోబరునెల 25 వ తేదీని తీర్థరాముని యొద్దనుండి వచ్చినలేఖను చూచుకొనగానే అతనితండ్రికి సందేహము తీరి పోయినది. అతడు భయపడుచున్నట్లే జరిగినది. ఆ లేఖలో రాము డిట్లు వ్రాసెను.

'మీ కుమారుడగు తీర్థరాముని శరీరము భగవంతునికి అమ్ముడుపోయినది. ఇకమీద ఆ శరీరము అతనిది కాదు. ఈ రోజు దీపావళి. శరీరమును జూదములో ఒడ్డి భగవంతుని గెలుచుకొంటిని. నేను మిమ్ములను అభినందించుచున్నాను. మీకు ఏమి కావలసినను నా గురువును అడుగుడు. ఆయన మీకు కావలసినదంతయు ఇచ్చును. లేదా నాచేత నిప్పించును. గడచిన 19-20 ఏండ్లనుండి అతడే నా బరువు బాధ్యతలు, విధులు, అప్పులు తనపై వేసికొనెను. అట్టి ఆ భగవంతుడు మీపట్లకూడ అట్లే ఎందుల కుండడు ?' ఈ లేఖ చూచుకొని హీరానందపండితుడు కొయ్యబారిపోయెను. అత డా లేఖను ధన్నామల్లునకు పంపుచు, 'రామతీర్థు డిట్లయ్యెను. నీవే ఈ పుణ్యము కట్టుకొంటివి. నీవు బుద్ధిమంతుడవనుకొని పిల్లవానిని నీకు అప్పజెప్పితిని' అని వ్రాసెను. ధన్నామల్లుకూడ హీరానందునివలెనే తలపోసియుండును. ఈ నడుమ అతడు తీర్థరామునిపై మిక్కిలి ఆధారపడుచుండెను.

తీర్థరాముడు శంకరాచార్యులవారు వచ్చినప్పుడు ఎట్టి కార్యనిర్వహణ భారము వహించెనో అట్టి బాధ్యతయే 1897 సం॥ నవంబరులో వివేకానంద స్వామి లాహోరు వచ్చినప్పుడు వహింపవలసివచ్చెను. వివేకానందస్వామి, ఆయన అమెరికా శిష్యులు, ఇతర పరివారము - రాజా ధ్యానసింగుగారి

భవనమున బస చేసిరి. ఆ భవనమునకు ముందు విశాలమైన ప్రదేశమున్నది కాని, అది వివేకానందుని ఉపన్యాసములు వినుటకువచ్చు అసంఖ్యాక ప్రజా సమూహములకు చాలలేదు. అందుచేత మరునాడు ఆ ఊరిలో అప్పుడున్న ఒక సర్కసు కంపెనీవారి ఆవరణలో ఉపన్యాసమును ఏర్పాటు చేసిరి. రాముడు వివేకానందస్వామికి, ఆయన పరివారమునకు ఒకరాత్రి విందు చేసెను. స్వామి తీర్థరాముని పుస్తకభాండాగారమునుండి ఒక గ్రంథమును తీసికొనివెళ్లెను.

వివేకానందస్వామి ఉపన్యాసములవలన, సభాజనులమాట యెట్లున్నను, తీర్థరాముడు మిక్కిలి ప్రభావితుడయ్యెను. వివేకానందుని మహా గంగా ప్రవాహ సదృశమయిన వాగ్ధాటికి రాముడు ఆశ్చర్యచకితుడయ్యెను. తాను కూడ వివేకానందునివలె సన్యసించి ప్రజలకు వేదాంతబోధ చేయవలెనని ఆత దువ్విళ్లూరసాగెను. అతడు తనలో వికసింపజేసికొనుచున్న సర్వ విస్తృతమయిన అద్వైతవేదాంతమునకు వివేకానందుడు మార్గదర్శకుడు గను వ్యాఖ్యాతగను అతనికి కన్పడసాగెను. రామతీర్థ వివేకానందులలో - వివేకానందుడు అనర్గళవాగ్ధాటి, సద్యస్ఫురణ, సునిశితహాస్యము, సౌంద ర్యము కలవాడనియు; రామతీర్థుడు-నిత్యసంతోషము, ప్రసన్నత, లజ్జా మధురము స్త్రీజనోచితమునగు సౌకుమార్యము, భక్తి మొదలగువాని సమ్మే ళన భూమియనియు, ఈ గుణములచే నాత దెప్పుడును పారవశ్యస్థితిలో ఉండెడివాడనియు పురాణసింగు ఒకచోట వ్రాసెను. ఆత్మసాధనయందు నిమగ్నుడైన తీర్థరామునిలో చిలుమార్పులు రా సాగినవి. వానిలో మొదటిది అతడు ధన్నామల్లునకు మునుపటివలెకాక చాల అరుదుగా లేఖలు వ్రాయుట- ఒకసారి ధన్నామల్లు తనకు అతనియొద్దనుండి లేఖవచ్చి చాలకాలమైనదని వ్రాయగా తీర్థరాముడు తన తప్పును ఒప్పుకొనుచు ఇట్లు వ్రాసెను: 'నీవు నాలో ఐక్యమయితివి. కావున నే నిప్పు డెవరికి వ్రాయవలయును? ప్రతి

వ్యక్తియందును రామతీర్థుడుండును. అట్లే భగవంతునితోకూడ నుండును. నాయంతట నేనేమియు చేయను. ఏమయినను. తరుణమువచ్చినప్పుడు పనులన్నియు తమంతట జరుగును. ఏమియు శ్రమపడకుండ మహారాజా నకు కోరినపనులెల్ల జరుగుచుండగా ఆయన కూలివానివలె ఏల కాయకష్టము చేయవలెను? నాకిప్పుడు జ్వరమువచ్చి పండుకొంటిని. ఈ జ్వరముకూడ నాకు ఆనందకరముగనే ఉన్నది.'

1898 సం॥ ఫిబ్రవరినెలలో తీర్థరాముడు 'అద్వైతామృతవర్షిణీసభ'ను స్థాపించెను. వేదాంతప్రచారము ఈ సభ ముఖ్యాశయము. ఈ సభ అతని యింట ప్రతి గురువారము సమావేశమై అద్వైతవేదాంతచర్చలు సాగించుచుండెడిది. ఇందు ఎక్కువగా సాధువులు పాల్గొనెడివారు. కొన్ని నెలల పిమ్మట రాముడు సమావేశములలో ప్రసంగించుట మానివేసి సభా కార్యక్రమములను దగ్గరుండి నడపించుచుండెడివాడు. అత డీదినములలో గొప్ప ఏకాగ్రతను సాధించెను. అతని మనోనైశ్చల్యమును. ఎట్టి విక్షేపములును భంగపఱుప జాలెడివికావు. అత డొకసారి ధన్నామల్లనకు వ్రాసినలేఖలో తనయింటి చుట్టుప్రక్కల హోలీపండుగ కోలాహలము జరుగుచున్నను తన ఏకాగ్రతకు భంగముకలుగుటకాని, తన హృదయము కలతపడుటగాని జరుగ లేదని తెలిపెను. ఈ ఏకాగ్రతతోను. ఆత్మసంయమనముతోను. అతడు కళాశాలపనియు. ఆధ్యాత్మికసాధనయును మిక్కిలి సక్రమముగా నిర్వహించెడివాడు. ఆ సంవత్సరము అతడు బోధించిన విద్యార్థుల పరీక్షాఫలితములు అద్భుతముగా నుండెను. ఆ యేడు అతని కళాశాలనుండియే విద్యార్థులు అధికసంఖ్యలో ఉత్తీర్ణులగుటయేకాక. ఇద్దరువిద్యార్థులు విశ్వవిద్యాలయమున ప్రథమ తృతీయస్థానములు కైవసము చేసికొనిరి.

1898 సం॥ వైశాఖి పండుగనాడు తీర్థరాముడు ఝులామ్ జిల్లాలోని చక్వాల్ తాలూకాలోనున్న కటస్రాజ్ అను పుణ్యక్షేత్రమును సందర్శించెను.

ఈ పుణ్యక్షేత్రము పూర్వము అరణ్యవాసముచేయుచున్న ధర్మరాజును యక్షుడు ప్రశ్నలువేసిన స్థలమని చెప్పుదురు. ఈ యాత్రచేసి రాముడు మిక్కిలి విరాళపడినట్లు తోచును. ఏమనగా యాత్రనుండి తిరిగివచ్చి అతడు 'యథార్థమగు ఆనందము ఏకాంతమునందే లభించును' అని వ్రాసెను. మరియు 'ఆ ప్రదేశము కంటికిదగ్గర, కాళ్ళకు బహుదూరము' అని పలికెను. అనగా ఆధ్యాత్మిక సాధనమార్గము పయనించుటకు సుకరముగాఉన్నట్లు కనబడినను యథార్థమున కది చాల క్లిష్టమగు మార్గమని అతని భావము కాబోలు.

ఆ యేడు వేసవిసెలవులలో రాముడు హరిద్వారము, హృషీకేశము మున్నగు పుణ్యక్షేత్రములను దర్శించెను. కాని యిట్లు వింతలు విశేషములు చూచుచు తిరుగుట అతనికి రుచింపలేదు. గంగానదిలో స్నానము చేసి నప్పుడుమాత్రము అతనికి గొప్ప మనస్తృప్తి ఏర్పడెను. అత డా మహా నదిలో మునిగినపుడు కాలమునే మఱచిపోయెను. హృషీకేశములో నున్న ప్పుడు అతడు తనయొద్ద ధనమును ఒక్కపైసయైన మిగులకుండ అచ్చటి సాధువులకు పంచిపెట్టెను. హృషీకేశమునకు ఆరుమైళ్ళలోఉన్న తపోవన మునకు పోవునప్పుడు అతనియొద్ద పట్టుగుడ్డలుతప్ప వేరు వస్త్రముకాని, ఒక్క పైసకాని లేవు. ఆ తపోవనములో అతడు తాను ఆత్మదర్శనము పొందవలెను లేనిచో ఆత్మహత్య చేసికొనవలెను అని తీవ్రముగా నిశ్చ యించుకొనెను. తనవాంఛ నెరవేరకపోవుటచే ఆత్మహత్యకు నిర్ణ యించుకొని వరదలలోఉన్న గంగానదిలో దూకెను. కాని ఏదో ఒక అదృశ్యశక్తి అతనిని ఒక బండరాతిపైకి చేర్చెను. అతడా బండపై కూర్చుండియుండగా అతనికి ఆత్మదర్శనమయ్యెను. ఇట్లు వాంఛాసిద్ధి కలిగినంతనే అతడు సుదీర్ఘమైన ఒక మహానందపారవశ్యములో మునిగెను. ఈ యాత్రలో తనకు కలిగిన అనుభవములనుగూర్చి తీర్థ

రాముడు ఉర్దూభాషలో వ్రాసిన 'జాల్యా-ఈ-కోషర్' అను వ్యాసములో విపులముగా వర్ణించెను. ఈ వ్యాసము అతని సమగ్రగ్రంథ సంపుటములలో ఉన్నది. ఇది గద్యపద్యమయముగా ఉండును. అతడు పర్వతములు, వనములు, నదులు మున్నగు ప్రకృతిదృశ్యములను చూచినప్పుడు తనకు కలిగిన రసభావములను వ్యక్తపఱుచుచు ఉర్దూభాషలో కవిత్వము చెప్పును. నరసంచారములేని మారుమూలచోట్ల ఉన్నను అత డెప్పుడు ఒంటరితనమును అనుభవింపలేదు. అతడు అట్టిచోట్ల వర్షము, చల్లనిగాలి తనకుతోడుగా ఉండెననియు, అచ్చటి జంతువుల వింతవింతధ్వనులు వినుచుండెడివాడననియు తెలిపెను. అతనిదగ్గర డబ్బులేదు. 'తీర్థరాముడు తన కెంతవ్యాధి వచ్చినను భయపడడు. పెక్కువ్యాధులు అతనిపై తమబలమును చూపవచ్చి, విఫలమైపోయినవి' అనియు నతడు చెప్పెడివాడు. అతడు వేదాంతనిష్ఠుడగుచున్న కొలది బాహ్యప్రపంచముతో అతనిసంబంధము క్రమక్రమముగా తగ్గిపోజొచ్చెను. అతనికి ఏకాంతముగానుండుటయే తృప్తినిచ్చెడిది. వేదాంతచర్చలతోడను, ధ్యానమునందును గడపినకాలమే సద్వినియోగమైనదని అతడు తలంపసాగెను. కళాశాలలో ఆరుగంటలకాలము గడుపుట కూడ అతనికి దుస్సహముగా నుండెను. తీర్థరాముడు పరమసమర్థుడగు అధ్యాపకుడగుటచే అతని తరగతులకు విద్యార్థులు తండోపతండములుగా వచ్చెడివారు. అతడు తరగతిలో ఉపన్యాసము లిచ్చునపుడు ప్రసంగవశమున ఆంగ్లము, ఉర్దూ, పంజాబీ భాషాకవుల (బుల్లేషాకవి) రచనలను ఉదాహరించుచు, మతమునుగూర్చి తన యభిప్రాయములను వెల్లడించుచుండెడివాడు. ఇది విద్యార్థులకు మరియు ఉత్సాహకరముగా ఉండెడిది. దీనిఫలితముగా క్రైస్తవమతమును స్వీకరించుటకు చాల కొద్దిమంది విద్యార్థులే ముందుకు రాసాగిరి. విద్యార్థులు తమ మతమునందే ఎక్కువ గుణమున్నట్లు గ్రహింపజొచ్చిరి. ఇట్టి పరిణామము ఆ పాఠశాలను నిర్వహించు

చున్న అధికారులకు నచ్చలేదు. కావున వారు 'అమెరికానుండి క్రొత్తగా ఒక ఉపాధ్యాయుడు వచ్చుచున్నాడు. కావున మీరు మరియొకచోట ఉద్యోగమును చూచుకొనుడు' అని తీర్థరామునకు అధికారపూర్వకముగా తెలియజేసిరి. 1899 సం॥ జనవరిలో తీర్థరాముడు తన ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చెను. కాని పాఠశాలాధికారులు ఏప్రిలునెలలో జరుగబోవు విశ్వవిద్యాలయపరీక్షలు ముగియువరకు నాల్గవసంవత్సరపు బి. ఏ. విద్యార్థులకు మాత్రము పాఠములు చెప్పుచుండుడని కోరిరి. రాముడు అందుల కంగీకరించెను. ఇట్లుండగా అచ్చటి ప్రాచ్యకళాశాలలో తలవనితలంపుగా ఒక అధ్యాపకపదవి ఖాళీపడెను. అది తీర్థరామునకు లభించెను. అచ్చట రోజునకు రెండుగంటలుమాత్రమే పని. నెలకు డెబ్బదియైదురూపాయలు జీతము. ఇప్పు డతనికి చాల తీరికచిక్కెను. ఎక్కువకాలము తీరుబడియుండుటచే అతనికి ధ్యానము. గ్రంథపఠనము చేసికొనుటకు ఎక్కువ వీలయ్యెను. అతని ఆదాయము తగ్గిపోయినమాట నిజమేకాని. చేత చిల్లిగవ్వ లేకున్నను నిశ్చింతగా ఉండుటకు అలవాటుపడిన అతనికి ఈ పరిస్థితులు క్లేశము కల్గింపలేదు. అతి ముఖ్యమయినవానికే పొదుపుగా ఖర్చుపెట్టుచు. తక్కినసొమ్ము అతడు తనవారికి పంపుచుండెను. రామతీర్థుని కుటుంబములో మొత్తము ఎనమండుగురు ఉన్నారు. వారిలో కొందరు అతనికి చాల దగ్గరచుట్టములు.

1899 సం॥ ఫిబ్రవరి 25 వ తేదీని తీర్థరామునిభార్య శివదేవి మురళీవాలాలో మగపిల్లవానిని కనెను. ఈ బిడ్డ వారి రెండవసంతానము. పిల్లవానికి 'బ్రహ్మానందుడు' అని పేరుపెట్టిరి. ఈ సంఘటననుగూర్చి రాముడెట్లు భావించెనో అతడు ధన్నామల్లునకు వ్రాసిన ఒక లేఖనుబట్టి తెలియుచున్నది. ఆ లేఖలో అత డిట్లు వ్రాసెను. 'ఒక నదివచ్చి కలిసినచో సముద్రము వరదలై పొంగదు. నది కలియకపోయినచో క్షీణించిపోదు.

సూర్యుడు ప్రకాశించుచుండగా మన మొక దీపమును వెలిగించినను వెలిగింపకపోయినను ఒకటే' —

1899 సం॥ వేసవిసెలవులు తీర్థరాముడు కాశ్మీర్ దేశములో గడపెను. అతడు శ్రీనగరములో కొద్దిరోజులుండి పిమ్మట పవిత్రమైన అమరనాథ గుహకు వెడలెను. ఈ మజిలీలో విశేషమేమనగా - అది మంచు ఎక్కువగా కురియు ప్రదేశమైనను తీర్థరాముడు ఒక ధోవతిమాత్రము ధరించి ఒక దుప్పటి కప్పుకొని తిరిగెను. ఎప్పటివలెనే తన పర్యటనవివరములను తన యనుభవములనుగూర్చి వివరముగా వ్రాసియుంచెను.

# 4. పర్వతములలో సంచారము-సన్న్యాసము

తీర్థరాముడు కాశ్మీరమునుండి తిరిగి వచ్చెను. అతడు పవిత్రుడు, సంతృప్తుడు, మతాభివివేశము కలవాడు - అను కీర్తి లాహోరులో బాగుగా వ్యాపించెను. అతడు ఏర్పాటుచేసిన సత్సంగములకు పెక్కురు ఆసక్తితో హాజరగుచుండిరి. ఆ రోజులలో లాహోరులో ఉన్న నారాయణుడు ఆ మహాను భావుని చూడవలెనని తన స్నేహితునితో చెప్పెను. నారాయణునకు వాదము అన్నచో ఇష్టము. అందుచే ఆ స్నేహితుడు అతనికోర్కె నంగీకరింప లేదు. కాని అమృతసరములో తీర్థరాముని ఉపన్యాసము విన్ననాటినుండి తా నాయనపై భక్తిభావముతో నుంటినని నారాయణుడు చెప్పగా ఆ స్నేహితుడు అతనిని రాముని కడకు తీసికొనిపోవుట కంగీకరించెను. వారు బయలు దేరునపుడు, రామునియొద్ద నున్నంతసేపు నారాయణుడు మౌనముగా ఉండవలెననియు, ఆయనతో ఎట్టివాదమునకు దిగరాదనియు ఆ స్నేహితుడు ఒక షరతుపెట్టి తీసికొనిపోయెను. ఈ షరతు పెట్టుట మేలే అయ్యెను. నారాయణుడు రాముని సన్నిధానమున కూర్చుండినంతనే ఆయన మహానుభావమునకు వశుడయ్యెను. ఆరోజు మొదలు నారాయణుడు నిత్యము రాముని దర్శనము చేసికొనుట కారంభించెను. తీర్థరాముడు నారాయణుని సందేహములనన్నిటిని తీర్చుచూ, అతనిచే ఉపనిషత్తులు, వేదాంతగ్రంథములు దగ్గరుండి చదివించెను. దీనితో నారాయణునకు చక్కని ఆధ్యాత్మిక విద్యా పరిజ్ఞాన మేర్పడెను. అతడు రామతీర్థున కంకితమైపోయెను. 1899 వ సం॥ చివరిరోజులలో తీర్థరామునకు చాల జబ్బుచేసెను. ఎడతెగని జ్వరము, పొత్తికడుపులో నొప్పి ఆయనను మంచమెక్కించెను. ఒకనాటిరాత్రి బాధ అధికమై ఆయన స్పృహ కోల్పోయెను. ఆయనయొద్దనున్న పరిచారకుడు ఆయన బ్రదికియుండెనా లేదాయని భయపడసాగెను. తీర్థరామునకు తిరిగి

తెలివివచ్చునప్పటికి ఆయనకు జ్వరమును లేదు, నొప్పియు లేదు. రాముడు క్రమముగా కోలుకొనెను. తాను పునర్జీవితుడగుట, తన భావములను తన దేశప్రజలలో వ్యాప్తమొనరించుటకు భగవంతుడు సంకల్పించుటయేయని ఆయన తన స్నేహితులతో చెప్పెను. ఈపని తాను చేయలేకపోయినచో తాను మరల జబ్బుపడుదుననియు అప్పుడు తాను మరణింపవచ్చుననియు కూడ వారికి చెప్పెను. కాబట్టి ఒకపత్రికను నెలకొల్పి ప్రకటించుచుండుటకు వెంటనే ఏర్పాట్లు జరిగెను. తీర్థరాముడా పత్రికకు 'అలీఫ్' అని పేరు పెట్టెను. 'అలీఫ్' అనునది పారశీకభాషావర్ణసమామ్నాయములో మొదటి అక్షరము. ఆ సంచిక ముఖపత్రముపై నట్టనడుమ 'అలీఫ్' చిహ్నమును, పైభాగమున వేదములోని ఒక మంత్రమును, దిగువభాగమున పారశీకభాషలోని ఒక ద్విపదయు ముద్రింపబడెను. మొదటిసంచికలో ఆనందమును గూర్చి వ్రాయబడినది. ఆ సంచికను చదువుటకు అసంఖ్యాకముగా పాఠకులు ఎగబడసాగిరి. అందుచే మొదటి రెండుసంచికలు రెండుమారులు పునర్ముద్రింపబడెను. పత్రికను, ముద్రణాలయమును నారాయణుడు నిర్వహించుచుండెను. రాముని చిత్తవృత్తులు ఒక్కొక్కప్పుడు హఠాత్సంభవములుగా ఉండెడివి. ఆయనకొకసారి ఉన్నట్లుండి సముద్రతీరమునకు పోవలెననిపించెను. వెంటనే ప్రయాణమయ్యెను. ఒకనాటిసాయంకాలము చేతిలో డబ్బుగాని, సామానుగాని ఏమియులేకుండ లాహోరునుండి బయలుదేరిపోయెను. దైవమునెడల అచంచలవిశ్వాసము కలవాడగుటచే రాము డెట్టి మనఃక్లేశమును పొందలేదు. ఆయన విశ్వాసము ఎంత గాఢమైనదనగా - ఆయన పోయినచోట్లనెల్ల పూర్వపరిచయము లేనివారుకూడ ఆయననుచూచి తమ నివాసములకు తీసుకొనిపోయి మిక్కిలి గౌరవించి ఆతిథ్యమిచ్చిరి. సుక్కూరును దర్శించి, *దారిలో* పెక్కుపట్టణములను చూచుకొనుచుపోయి

తీర్థరాముడు కరాచీ చేరెను. అచ్చట మొట్టమొదటిసారిగా సముద్రమును చూచెను. సముద్రదర్శనము ఆయనకు పరమానందదాయకమయ్యెను.

రామతీర్థుడు తన ఉద్యోగమును మానివేసి పూర్తిగా బంధవిముక్తుడు కావలయునని తీవ్రముగా తలపోయుచుండెను. ఈ విషయమై ఆయన ఒక స్నేహితునితో చర్చించిన వివరమంతయు నారాయణస్వామి తన గ్రంథములో విపులముగా వ్రాసెను. ఆ స్నేహితుడు ఉద్యోగమును వదలిపెట్టినచో కుటుంబమునకు గడచుట ఎట్లనియు, ఇట్టిపనిచేయుట గృహస్థుడుగా అతడు తన బాధ్యతలను విస్మరించుటకాదా? యనియు ప్రశ్నింపగా - తీర్థరాముడు 'నేను సేవకుడనుకాను - యజమానిని కాను. ఇతరులకు సేవచేయుట బానిసతనము' అని బదులుపలికెను. 'నేనే నా సంరక్షణము. ఇది ఇతరులపై ఆధారపడదు. నన్ను తిండి తినవద్దనియు, దుస్తులు వేసికొనవద్దనియు సంపాదింపవద్దనియు, ఏపనియు చేయవద్దనియు చెప్పుటలేదు. నిజముగా చేయవలసినపని నన్ను నీవు తెలిసికొనుటయే; దీనితో తక్కినపనులన్నియు తమంతట తామే జరిగిపోవును' అనియు చెప్పెను.

కాలము గడచుచున్నకొలది, ఆత్మవిద్యాసాధనయందు క్రమక్రమాభివృద్ధి సాధించుచున్నకొలది, తీర్థరామునకు తాను గడపుచున్న జీవితము ఒక బంధముగా తోచసాగెను. ఉద్యోగము, భక్తికై దేవులాడుట, కుటుంబమును, ఇతరాశ్రితులను పోషించుట మొదలగు పెక్కుబంధములలో అతడు చిక్కుకొని ఉండెను. ఇట్టి బంధనములలో ఇంకను తగుల్కొనియుండవలెనని తన్నుతానే ప్రశ్నించుకొనెను. అతని తాత్త్వికబోధము అతడు విశ్వాత్మ అనియు, ఈ నాటకమున తాను నటకుడుగా కాక దర్శకుడుగా ఉండవలెనని తెలియజెప్పినట్లయ్యెను. అందుచే అతడు సర్వసంగపరిత్యాగము చేయుటకు తుదినిర్ణయము గైకొనెను. అతడు ప్రాచ్యకళాశాలలో తన ఉద్యోగమును వదలిపెట్టెను. ఉత్తరఖండములోని అరణ్యములకుపోయి

వివాసముండుటకు నిశ్చయించి అందులకు తగిన ప్రణాళిక వేసికొనెను. ఈ 'పరిశోధన యాత్ర'లో అతనివెంట అతనిభార్య. పిల్లలు. నారాయణుడు మున్నగు మరికొందరు పోవుటకు నిశ్చయింపబడెను. వారుకూడ అతని వలెనే క్రమముగా సన్న్యసింపుటకు నిశ్చయించుకొనిరి.

రాముడు లాహోరునుండి నిర్గమించినదృశ్యము చూచినవారికి హృదయములు ద్రవించెను. అతడు రైలులో హరిద్వారమునకు బయలుదేరుకోజున వేలకొలదిజనులు గుంపులుగుంపులుగా అతని యింటిముందు చేరిరి. తీర్థ రాముడు ఇంటిలోనుండి వెలుపలికిరాగానే జనులు ఒక్కపెట్టున జయజయ ధ్వానములు చేసిరి. రైలుస్టేషనువఱకు ప్రజాసమూహము ఒక పెద్ద ఉత్సవముగా సాగెను. చాలమంది భజనలు చేసిరి. రాముడు తమ్ము వదలివెళ్లు చున్నాడని కొందరు కన్నీళ్లు పెట్టుకొనసాగిరి. ఆయన స్నేహితులు. విద్యార్థులు. అనుయాయులు విషాదసాగరములో మునిగిరని చెప్పనక్కరలేదు. కాని తీర్థరాముడు ప్రసన్నగంభీరుడుగా ఉండెను. వీరు రైలుస్టేషను చేరునప్పటికి అక్కడకూడ జనము గుంపులుగుంపులుగా చేరియుండిరి. అచ్చట చేరిన జనసందోహములు రైలు ప్లాటుఫారము వదలిపెట్టువరకు రామునికి జయజయధ్వానములు చేయుచునే ఉండెను.

తీర్థరాముని నిర్గమనమునుగూర్చి కొందరు ఒక కథను ప్రచారము చేయసాగిరి. అది ఏమనగా - 'తీర్థరాముడును. అతనిభార్యయు తాము బయలుదేర బోవునాటి ముందురాత్రి తమకున్న ఆస్తినంతను ప్రజలకు పంచిపెట్టిరి. ఆ రాత్రియంతయు వారు తమసామానులు బయట పారవేయుచునే గడపిరి. రాముడు తనబిడ్డలను తననుండి దూరముగా పంపించివేసెను. రాముడు తనభార్యను ఆమెయొద్ద ఏమియు ఉంచుకొనవలదనియు. తనతో ఉత్తర ఖండమునకు వచ్చుటకు అట్లుండవలెననియు శాసించెను' అని - ఈ కథ వట్టి కట్టుకథ అనియు. పచ్చి అబద్ధమనియు ప్రజలాలుగోసాయి తెలిపెను.

తన వస్తువులను అన్నిటిని పరిహరింపదలచినచో, రాముడు పగటిపూటనే ఆపని చేయవచ్చునుగదా! నిజమునకు జరిగినదేమనగా - తీర్థరాముడు తన పుస్తక భాండాగారమును మాత్రము ఒక స్నేహితునకు అప్పగించి, అది ప్రజలకు ఉపయోగపడునట్లు చూడగోరెను. ప్రజలాలు చెప్పినదానినిబట్టి రాముని కోరికను ఆ స్నేహితుడు నెరవేర్పలేదనియు ఆ పుస్తకములను వచ్చినకాడికి అమ్ముకొనెననియు తెలియుచున్నది. మిగిలినవస్తువులు మురళీవాలాకు చేర్పబడెను. అవి అచ్చట 1907 సం॥ జూన్ నెలలో తీర్థరాముని భార్య చనిపోవువరకు ఉండెను. పిమ్మట వానిలో కొన్ని తీర్థరాముని పెద్ద కుమారుడగు మదనమోహనుడు తీసికొనిపోయెను. తక్కినవి హీరానంద పండితునియొద్దనే యుండెను.

హరిద్వారము చేరినపిమ్మట తీర్థరాముడు, అతనిబృందము అచ్చట మూడు రోజులుండిరి. నాలుగవరోజున పర్వతములకు బయలుదేరిరి. ఈ బృందమునకు నారాయణుడు నాయకుడు. ఆ బృందములోని వారిదగ్గరనున్న సొమ్మంతయు ప్రోగుచేసి నారాయణునికడ నుంచిరి. అతడు ఈ సొమ్మును వారిఖర్చులకు ఉపయోగించుచుండెను. వారు హరిద్వారమునుండి గంగోత్రికి పోయిరి. అచ్చటనే గంగానది ఉద్భవించెను. దారిలో వారు కొన్నిరోజులు 'తేహరీ'లో ఉండిరి. అచ్చట నదీతీరమున ఒక ధర్మాత్ముడు సాధువుల ఉపయోగార్థము కట్టించిన ఒక ఇంటిలో వారు బస చేసిరి.

బృందము గంగోత్రిచేరిన మరునాడు తీర్థరాముడు నారాయణునుపిలిచి అతనియొద్దనున్న ధనమునంతను గంగానదిలో పారవేయుమని చెప్పెను. 'మనము దైవసంకల్పమునకే బద్ధులమై, దైవము మనల నెట్లు నడిపించునో అట్లే జీవింతము. మరియు మనకు చెందినవన్నియు ఈ గంగానది అనుగ్రహించినవే - కావున వానిని ఆ తల్లికే తిరిగి ఇచ్చివేయుట ఉచితము' అనెను. బృందములోని ప్రతిసభ్యునకు ఏకాంతముగా ఉండు

కొంతప్రదేశము ప్రత్యేకముగా ఏర్పాటుచేయబడెను. అచ్చట ఆ సభ్యుడు ధ్యానము చేసికొనవలెను. సమస్తమునువదలి భగవంతునిమీదనే ఆధార పడుట అభ్యసింపవలెను. 'భగవంతుడు మనము జీవించియుండవలెనని కోరినచో అతడే మనలను పోషించును. అట్లుకానిచో మనలను మృత్యువు కబళించును. భగవంతునియందు విశ్వాసములేని బ్రదుకుబ బ్రదుకుటకంటె మరణమే మేలు' అని రాముడు వారికి బోధించెను. తీర్థరాముని ఈ అచం చలవిశ్వాసమునకు ఫలితము వెంటనే కనబడెను. తీర్థరాముడు తన బృంద మున కట్లు బోధించిన కొద్దిగంటలలోనే హృషీకేశములోని 'కాళీ కంబళి' క్షేత్రవాసియగు బాబా రామనాథుడు అచ్చటికి వచ్చెను. అతడు తాను కట్టిం చిన గృహములను తనిఖీచేయుటకై బయలుదేరి గంగోత్రిపోవుచు తేహరీలో తీర్థరాముని బృందమునుగూర్చి వినెను. అతనివెంట ఒక దుకాణ దారు డుండెను. రామనాథుడు ఆ బృందమునకు నెలకు పదియాపాయల విలువగల సంభారములను పంపుచుండుమని ఆ దుకాణదారుని కాదేశించెను. ఆ సంభారములు వెంటనే వచ్చినవి. నారాయణునికి ఇట్లు దానమును గ్రహిం చుటకు మనస్కరింపలేదు. కాని ఈ పరిణామముతో ఆ బృందములోనివారికి దేవునిపై విశ్వాసము మరింత బలపడినది. కొన్నిరోజులైనపిమ్మట తీర్థ రామునికి గాఢమైన ఆధ్యాత్మికానందము కలుగుటయు ఆయన దానిని ఉర్దూ భాషలో కవితారూపమున వ్యక్తీకరించుటయు జరిగెను. ఆ కవితారచన సారాంశ మిది : 'రాముఁ డికనుండి మృత్యువునకు భయపడడు. అతని శరీరమునకు కలిగిన బాధగాని, ఆనందముగాని, సుఖముగాని అతడు పట్టించు కొనడు ;

పూర్వమొకసారి తీర్థరాముడు సముద్రమునుచూడగోరి హఠాత్తుగా కరాచీకి బయలుదేరిపోయినట్లే, అతడు గంగోత్రిలోనున్నప్పుడు ఒకనాటి రాత్రి తనబృందమువారందరు నిద్రించుచుండగా, అచ్చటికి ఏబదిమైళ్ళ

దూరముననున్న ఉత్తరకాశికి తానొక్కడు బయలుదేరిపోయెను. ఆ కొండ ఎక్కుట చాల ప్రమాదకరమే కాని అతనికి మిక్కిలి ఉత్సాహముగా ఉండెను. ఆ వివరములన్నియు అతడు తరువాత వర్ణించిచెప్పెను. అచ్చటికి పోయినపుడు అతనిఒడలిపై కౌపీనముతప్ప ఏమియులేదు. పదిమైళ్ళవరకు ఒక సన్నవిదారి - దాని కొకప్రక్క ఎత్తైన పర్వతపంక్తులు, మరియొకప్రక్క గంగానది ఉండెను. అపుడు రెండుగంటలయినది. ఆకాశమునింద కాలు మేఘములు క్రమ్ముకొనెను. మేఘములనుండి మెఱుపులు మెఱయుచున్నవి. ఝుంఝూమారుతమునకు చెట్లును, గుండ్రాళ్లును దారికడ్డముగా వచ్చి పడుచుండెను. రామునిదగ్గర గొడుగుకాని, కట్టకాని లేదు. కాళ్ళకు చెప్పులైన లేకుండ అతడు నడచిపోవుచుండెను. ఒకచోటికి వచ్చుసరికి మార్గనిరోధమయ్యెను. అతనికి ఆ చరియలపై ప్రాకిపోవుటతప్ప గత్యంతరము లేదయ్యెను. గొఱ్ఱెలుకూడ ఆ చరియలవెంట పోలేవు. అట్లు ప్రాకిపోవుట చాల ప్రమాదకరము. భయమన్నమాటయే మఱచిపోయిన తీర్థరాముడు ఈ పరిస్థితిని లెక్కచేయలేదు. పైగా కొండపైకి ఆవిధముగా ఎక్కుట అతనికి చాల ఉత్సాహముగా ఉండెను. నడుమ నడుమ సూర్యకిరణములు పడి మంచు మిలమిలలాడి పోవుచుండెను. అతడు ఉత్తరకాశిలో కొన్ని రోజులుండి తిరిగి గంగోత్రికి వెడలిపోయెను.

రామతీర్థు డిట్లు అదృశ్యుడగుట - ఆయన బృందమువారికి ఏర్పరచిన కఠిననియమములు - వీనివలన ఆయనభార్య ఆరోగ్యము చెడిపోయెను. అందుచే ఆమెను, ఆమె చిన్నకుమారుడు బ్రహ్మానందుని, మురళీవాలాకు పంపివైచిరి. పెద్దపిల్లవాడు మదనమోహనుడు తేహరీలోని ప్రభుత్వ పాఠశాలలో చేరెను. ఈ సంగతులు నారాయణస్వామి వ్రాసెను. ప్రజలాలు గోసాయి అభిప్రాయముమాత్రము మరియొకరీతిగా ఉండెను. అతడు తన మేనత్తకు ఆరోగ్యమేమియు భంగముకాలేదనియు తీర్థరాముదే సన్న్యా

సము తీసికొనగోరి ఆమెను ఇంటికి పంపించెననియు వ్రాసెను. తన లక్ష్య మును సాధించుటకు అచ్చట ఆమెయునికి ప్రతిబంధకముగా ఉండునని రామునకు తలపోసియుండును. ఒకవేళ ఆరోగ్యము చెడినచో హిందూస్త్రీ తన భర్త సన్నిధానమున ఉండగోరును కాని భర్తనువిడిచి ఉండుట కంగీకరింపదుకదా। ఇది వ్రజలాలు గోసాయి అభిప్రాయము.

ఏమయినను. తీర్థరాముని భార్య మురళీవాలాకు చేరిన రెండువారములకు పిమ్మట తీర్థరాముడు యథావిధిగా సన్న్యసించుటకు నిశ్చయించుకొనెను. ఒక మంగలివచ్చి అతనికి శిరోముండనము చేసెను. నారాయణుకును, మరి యొకడును తీర్థరాముని వస్త్రములకు కావిరంగు పట్టించిరి. తీర్థరాముడు స్నానముచేయుటకు గంగానదిలో దిగెను. తన యజ్ఞోపవీతమునుతీసి నదిలో వదలిపెట్టెను. స్నానము ముగించుకొని వచ్చి కాషాయవస్త్రములనుధరించి కొంతసేపు ధ్యానము చేసెను. ఈ ఉత్సవములో పాల్గొనుటకు ఉత్తరకాశి నుండి చాలమంది సాధువులు వచ్చిరి. వారందరికి అచ్చట భోజనము లేర్పాటు చేయబడెను. తీర్థరాముడు తనపేరును రామతీర్థుడని మార్చి కొనెను. ఆయనపేరు నిట్లు మార్చుటకు రెండుకారణములు చెప్పెను. మొదటిది :-ఇప్పటివరకు బహిర్ముఖముగానున్న తన జీవితగమనము ఇప్పటి నుండి అంతర్ముఖమయినది. రెండవది :-తాను ద్వారకాపీఠాధిపతులైన శ్రీ మాధవతీర్థులకు శిష్యుడు. ఆ స్వాములవారు సన్న్యాసులలో తీర్థసంప్రదాయ మునకు చెందినవారు. రాముని కుమారుడు మదనమోహనుడు కాషాయవస్త్ర ములు ధరించియున్న తన తండ్రిని తొలిసారిగా చూచినపుడు బిగ్గరగా ఏడువ సాగెనట. రామతీర్థు డిప్పుడు తన దినచర్యను క్రమబద్ధము చేసెను. ఆయన నారాయణుకు మున్నగువారికి కొన్ని నిర్ణీతసమయములందే దర్శనమిచ్చు చుండెను. కొన్ని వారములు గడచినతరువాత ఆయన నారాయణుని సహాయ

పంపెను. తాను ఆరునెలలుగా వ్రాసియుంచిన వ్యాసములతో 'అలీఫ్' పత్రికను ఒక సంచికగా ముద్రించుటకు అతనిని లాహోరు పంపెను.

రామతీర్థునికీర్తి నలుమూలలకు వ్యాపింపజొచ్చెను. యాత్రికులు, ముఖ్యముగా సాధువులు, ఆయనదర్శనము చేసికొనుటకు వచ్చుచుండిరి. ఒకనాడు రామతీర్థునియొద్దకు తేహరీ రాజవంశీయుడనని చెప్పుకొనుచు ఒకవ్యక్తి వచ్చెను. అతడు దేవుని చూపింపుమని ఆయనను కోరెను. రామతీర్థుడు తన వివేకమును, సూక్ష్మబుద్ధిని, సహనమును పరీక్షింపగోరు ఇట్టి యత్నములకు ఎప్పుడును సిద్దపడియే యుండును. రామతీర్థుడు ఆ వ్యక్తిని 'నీ వెవ్వరు? నీ వేమి చేయుచుందువు?' అని ప్రశ్నించెను. దాని కాతడు తాను ఫలానా అనియు ఫలానావారి కుమారుడననియు చెప్పెను. రామతీర్థుడు ఆ సమాచారము సరియైనది కాదనెను. ఆ వ్యక్తి తన దేహమునకు సంబంధించిన గుర్తులే చెప్పినట్లయ్యెను. రామతీర్థుడు 'శరీరము నీవయినచో నీవు శరీరము కాదన్నమాట' అనెను. దీనికి ఆ రాజవంశీయుడు తాను 'శరీరము కాను, మనస్సును' అనెను. అంత స్వామి 'అతడు మనశ్శరీరములకు అతీతుడవు' అనెను. ఆయన మరియొకప్రశ్న వేసెను. 'ఈ రోజున నీవేమిచేసితివి?' అని. అతడు భోజనముచేయుట, వ్రాయుట మొదలగు కొన్నిపనులు చేసితినని చెప్పగా, అవికాక మరియు అనేకక్రియలు కలవనియు, వానిలో కొన్ని బుద్ధిపూర్వకముగ, స్వచ్ఛందముగా చేయునట్టివి, కొన్ని మనకు తెలియకుండ మన యిష్టానిష్టములతో ప్రమేయములేకుండ జరిగెడు ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములు, శరీరము పెరుగుట మున్నగునవి కలవని తెలిపెను. ఆ యువకునికి రామతీర్థస్వామి ఇట్లు వివరించెను. 'నేను అనంతమగు శక్తిని. నాకు నిద్రలేదు. మార్పులేదు. శరీరము, మనస్సు మార్పు పొందుచుండును. నే నెల్లప్పుడు ఒకేవిధముగా ఉందును. జంతువులు, వృక్షములు పెరుగుటకు, నదులు ప్రవహించుటకు, నక్షత్రములు కదలు

టకు ఏశక్తి హేతువో ఆశక్తియే నా శిరోజములు పెరుగుటకు నాలో రక్తము ప్రవహించుటకు హేతువు.'

రామతీర్థుని దర్శించుటకు ప్రజలు అసంఖ్యాకముగా రాసాగిరి. అందుచే ఆయన ఏకాంతమునకు భంగము కలుగుచుండెడిది. ఇదిచూచి, ఆయన తా నప్పుడున్న మురళీధరుని తోటను వదలి 1901 సం॥ జూనునెల మధ్యలో తేహరీకి ఆరుమైళ్ళదూరమున గంగానది ఒడ్డుననున్న ఒక గుహలో నివాస మేర్పఱుచుకొనెను. ఈ మార్పు జరిగిన సంగతి వారికి తెలియదు. కొన్ని వారము లకుపిమ్మట నారాయణుడు లాహోరునుండి తిరిగివచ్చి స్వామినివాసమునకై వెదకసాగెను. స్వామియున్న ప్రదేశమును ఎట్లో కనుగొని యితడు అచ్చటకు వెళ్ళుసరికి ఆయన నదీతీరమున సుషుప్తియందుండెను. ఇది ఒక ఆధ్యాత్మిక పారవశ్యస్థితి ననుసరించి వచ్చినది. ఈస్థితిలో ఆయన కొన్నిపద్యములు, పాటలు కూర్చెను నారాయణుడు వానిని తీసి భద్రపఱిచెను.

తరువాత రామతీర్థుడు ధ్యానమునందును, పర్వతప్రాంతములకు యాత్రలు చేయుటయందును కొన్నినెలలు గడపెను. 1901 వ సం॥ ఆగస్టు నెల మధ్యలో నారాయణుని, మరియొకనిని వెంటబెట్టుకొని స్వామి యమునా నదీ జన్మస్థానమగు యమునోత్రికి పోయెను. ఈ యాత్ర చేయుటకు మూడు వారములు పట్టినది. వారు అచ్చటికిచేరి ఒక దేవాలయములో పదునైదు రోజు లుండిరి. అచ్చటనుండి సుమేరుపర్వతమునకు పోయిరి. రామతీర్థుని కది కాశ్మీరముకంటె అందముగా కన్పించినది ఆయన అచ్చట ప్రకృతిలో లీనమై తిరిగెను. 'నేను సర్వసౌందర్య పరిష్వంగమునం దున్నాను' అని ఆయన పలికెను. ఆయన అడవిజంతువులకు భయపడలేదు. ఒకసారి ఐదు ఎలుగుగొడ్లు ఆయనకడకు వచ్చినవి. అవి స్వామికి ఏమియు అపకారము చేయలేదు. కొన్నిసార్లు ఒక తోడేలు, ఒక పెద్దపులి ఎదురుపడగా ఆయన గ్రుడ్లురిమి తీక్ష్ణముగా చూచినంతనే అవి వెనుదిరిగిపోయినవి. గంగోత్రికి

తిరిగిపోవునపుడు ఆయన మిక్కిలి దుష్కరమైనమార్గమును పట్టెను. ఈ మార్గమున పోవునప్పుడు రెండురోజులపాటు మంచుపై నడచిపోవలెను. ఈ పర్యాయము రాముడు గంగోత్రిలో ఒక నెలరోజులుండెను. చుట్టును పచ్చికబయళ్లతో చూచుట కందముగానుండి, నదికిదగ్గరగానున్న ప్రదేశమున ఆయన నివసింపసాగెను. అచ్చట నది విశాలముగా ఉండును. ప్రవాహము వేగముగా ఉండును. పెక్కుతడవలు స్వామి అచ్చట నదిని దాటెను. రామ తీర్థుడు ఆహారము తక్కువ తీసికొనుచుండెను. ఒక్కొక్కప్పు డది ఆయన శరీరతత్త్వమునకు సరిపడెడిది కాదు. అందుచే ఒకసారి ఆయన జీర్ణకోశము మిక్కిలి చెడిపోయి మరల సర్దుకొనుటకు నాలుగురోజులు పట్టెను. ఆయన సుమేరుపర్వతమునకు మరల పోవలయునని నిశ్చయించుకొనెను. ఒక్క కౌపీనముమాత్రము ధరించి, తలపై ఆచ్ఛాదనము ఏమియు లేకుండ, కాళ్ళకు చెప్పులులేకుండ, ఆయాత్రకు బయలుదేరిపోయెను. ఆయన వెంట ఐదుగురు బలిష్ఠులగు కొండజాతివా రుండిరి. వాండ్రు తాము మామూలుగా ధరించుదుస్తులను ధరించియుండిరి. కొండ ఎక్కుట మిక్కిలి కష్టముగా ఉండెను. నడుమనడుమ అంతరాయములు బహు దుస్తరములై, ఆయన సహచరులు నీరసపడిపోయిరి. ఒక్కొక్కడే దారిప్రక్కన చదికిలపడ సాగెను. రామతీర్థుడొక్కడే గమ్యమును చేరుకొనగలిగెను. ఆ ప్రదేశము పరమరమణీయముగానుండి భగవంతుని నివాసపర్వతమా అనునట్లుండెను. పర్వతారోహణమందు పరమానక్తుడైన రామతీర్థస్వామి అచ్చటనుండి కేదారనాథము, బదరీనాథములకు పోయెను. ఆయన 1901 సం॥ నవంబరు 3 వ తేదీని బదరీనాథము చేరెను. అప్పటికి దీపావళి ఒకవారమురోజు లున్నది. ఆయన దీపావళివఱకు అచ్చటనే ఉండెను. అనాడు సూర్యగ్రహణము.

అప్పటికే శీతకాలము ప్రవేశించినది. రామతీర్థుడు పర్వతప్రాంతములు వదలి మైదానములకు పోవుట మంచిదని తలంచెను. ఇంతలో క్రిస్మస్

దినములలో జరుగబోవు మత సమావేశములకు అధ్యక్షత వహింపవలసిన దని కోరుచు ఆయనకు మధురనుండి ఆహ్వానము వచ్చెను. రామతీర్థుడు ఆ సమావేశములలో పాల్గొనుట ఆయనవిషయమునందేగాక, ఆ సమావేశములకుకూడ ఒక నూతనశకారంభమయ్యెను. ఆ సమయమున వార్తాపత్రికలలో వచ్చిన నివేదికను చూచినచో ఆయన ఆ సమావేశములకుచేసిన దోహద మెట్టిదో తెలియగలదు. లాహోరునుండి వెలువడు 'ఫ్రీ థింకర్' (*Free thinker*) అనుపత్రిక ఆయననుగూర్చి ఇట్లు వ్రాసెను: 'పలురకములుగా ఉన్న సభాసదులందరు ప్రసన్నుడు, నిరహంకారి, సరళస్వభావుడు అగు ఆ యువకునిజూచి ఆశ్చర్యపడిరి. ఆయన ప్రాచీన, అధునాతన తత్త్వశాస్త్రములయందును, ఆధునికశాస్త్రవిజ్ఞానమునందును నిష్ణాతుడు, ఉత్తమ విశ్వాసములుకల మహాపురుషుల అంతస్సారము అంతయు ముద్దకట్టి ఆయన రూపమున ఉన్నదా అన్నట్లుండెను. అతడు సరళస్వభావుడుగను, లక్ష్యభూతుడుగను, ప్రవర్తనయందు చిన్నపిల్లవానివలె అమాయికుడుగను కన్పట్టుచున్నను, లోన మేరుపర్వతధీరుడు. ఇతరుల అభిప్రాయములపట్ల సముచితగౌరమునుచూపుచు ఆయన తన అభిప్రాయములను నిర్భయముగా నిష్కర్షగా చెప్పును.'

పూర్ణసింగుకూడ రాముడా సమావేశములలో సభాసదులపై ఎట్టి ప్రభావమునుచూపెనో తెలుపుచు ఇట్లు వ్రాసెను: 'ఆ సమావేశములలో ఆయన ఉనికియే మహాద్భుతముగా ఉండెను. ఆయన ఆనందమునకు మేరలేదు. ఆయన భావపరంపరకూడ అట్లే ఉండెను. అన్నిటిని మించినది ఆయన చేసిన ఓంకారోచ్చారణము. అచ్చటనున్న ప్రతివ్యక్తియు ఓంకారము నుచ్చరింపసాగెను. ఆయననుచూచిన ప్రతివ్యక్తికి తనజీవితమే క్రొత్తగా కన్పింపసాగెను. మనస్సునందున్న అల్పత్వము, నైచ్యము రూపుమాసిపోయి ప్రతివ్యక్తియు తానెంతో ఉన్నతముగా ఎదిగినట్లు భావించుకొన

తొచ్చెను. రామతీర్థుని నేత్రములనుండి జీవితముపట్ల స్ఫటికస్వచ్ఛమగు దృక్పథము వెలువడి అచటనున్న ఎల్లర కన్నులయందు తొచ్చుకొని పోయెను.'

మే నెలలో రామతీర్థుడు తేహరీకి సమీపముననున్న కొండలలోనికి పోయెను. దారిలో ఒక పర్వతాగ్రముపైనున్న ఒక పాతకోటలో కొన్నాళ్లుండెను. అచ్చట కాకతాళీయముగా ఒక సంఘటన జరిగెను. అత డచ్చట నున్నపుడు అప్పటి తేహరీ మహారాజగు 'కీర్తిషా' దెహరాడూను పోవుచు ఆ దారిని వెళ్లుట తటస్థించెను. ఆయన దివాను రామతీర్థుని కలిసికొని మహారాజును చూచుటకు రమ్మనికోరెను. రామతీర్థు డంగీకరించివెళ్లగా మహారాజు ఆయనకు హృదయపూర్వకముగా స్వాగతమిచ్చెను. వారిరువురును మతసంబంధమగు పెక్కువిషయములనుగూర్చి చర్చించుకొనిరి. కొన్ని దినములు తనతో వచ్చియుండవలసినదని మహారాజు రామతీర్థస్వామిని కోరెను. పిమ్మట వారు ఆ రాష్ట్రపు వేసవిరాజధానియగు ప్రతాపనగరమునకు పోయిరి. అచట ఒకరి అభిప్రాయము లొకరికి తెలుపుకొనుచు గడపిరి. ఇట్లుండగా 1902 వ సం॥ జూలై నెలలో ఒకనాటి సాయంకాలము మహారాజు రామతీర్థునకు నాటి వార్తాపత్రికలోని ఒక సమాచారమునుగూర్చి తెలిపెను. జపానులో మత మహాసభలు జరుగబోవుచున్నవి-అని ఆ వార్త. ఆ సమావేశములలో భారతీయమతములకుకూడ ప్రాతినిధ్యముండునుకనుక రామతీర్థు డా సభలలో పాల్గొని హిందూమతమునుగూర్చి ప్రసంగింపవలెనని మహారాజు కోరెను. రామతీర్థు డంగీకరించెను. కలకత్తానుండి బయలుదేరు ఓడలో ఒక గదిని రామతీర్థునికి, నారాయణకు ప్రత్యేకించిరి. కాని నారాయణుని ఆధ్యాత్మికసాధనకు అంతరాయముకలుగునని ఆతడు తనవెంట రా రాదని రామతీర్థుడు తలంచెను. అందుచే ఆయన ఒక్కడే దెహరాడూనులో కలకత్తాకుపోవు రైలుబండి ఎక్కెను. నారాయణుడు తేహరీకి

తిరిగి వెళ్ళిపోయెను. కాని కొందరుస్నేహితులు, ముఖ్యముగా తేహరీ మహారాజు, రామతీర్థునకు ఆ ప్రయాణములో నారాయణుడు సహచరుడుగా ఉండుట చాల అవశ్యకమని బలవంత పెట్టుటచే స్వామి అంగీకరించి, నారాయణుడు కలకత్తావచ్చి తన్ను కలిసికొనుటకు ఏర్పాటుచేసెను. అతడు తన్ను కలిసికొనుటకు ఆయన ఒకతేది నిర్ణయించెను. నారాయణుడు ఆయన నిర్ణయించినతేదికి ఒకరోజు ముందుగా, అనగా ఆగష్టు 19 వ తేదినాటికి కలకత్తా చేరుకొనెను. కాని తలవనితలంపుగా ఓడ బయలుదేరుట 28 వ తేదికి వాయిదా పడెను. అందుచే ఈ యాత్రికులిద్దరు ఓడ బయలుదేరునాటి వఱకు చక్కగా విశ్రాంతి తీసికొనుటకు అవకాశము చిక్కెను.

# 5. జపానులో పదునైదురోజులు

తలవనితలంపుగా తేహరీ మహారాజాతోడి పరిచయము రామతీర్థుని క్రియా కలాపములను మరియొకమార్గమునకు మరలించుటయేగాక, ఆయన ఉన్న వాతావరణమునకూడ పెద్దమార్పు తెచ్చెను. చిరకాలమునుండి రామతీర్థుడు పర్వతములన్నను, అవి కల్పించు ఏకాంతమన్నను మిక్కిలి యిష్టపడు చుండెను. ఆయనకు ఆనందము కలిగించిన తక్కిన ప్రకృతిదృశ్యము లన్నిటికంటె పర్వతములన్ననే ఆయనకు మక్కువ ఎక్కువ. కాని ఇప్పుడు ఆయన పారిశ్రామికత్వమునుండి ఉద్భవించిన నాగరకతతో కొంత పని పెట్టుకొనెను. అట్టి నాగరకతతో పెరిగిన సంఘమునకు వేదాంతసందేశ మును తీసికొనిపోదలచెను. ఇది ఉభయతారకమైనది. రామతీర్థుని జపాను ప్రయాణము-ఆయన అచ్చట కొన్నాళ్ళు గడపుట-వీనినిగూర్చిన విశేషము లను స్నేహితుల ఉదంతముపై రామతీర్థునికి సహచరుడుగా వెళ్ళిన నారా యణస్వామి వివరముగా తెలిపెను. వీరిద్దరు ఎక్కిన ఓడ తొలుత హాంగ్ కాంగ్ చేరెను. అచ్చట వీరు ఒక సింధువర్తకునికి అతిథులుగా ఒకవారము రోజు లుండిరి. దారిలో పెక్కుతీర పట్టణములందున్న భారతీయులు వీరికి హృదయపూర్వక స్వాగతము లిచ్చిరి. పంజాబునుండి వెళ్ళిన సిక్కులు హాంగ్‌కాంగ్‌లో ఒక అద్భుతమైన గురుద్వారమును నిర్మించుకొనియుండిరి. వారి భక్త్యావేశమునుచూచి రామతీర్థుడు మిక్కిలి సంతోషపడి వారికి గురు భక్తినిగూర్చి ఉపన్యసించెను. వీరి తరువాతిమజిలీ 'యోకహామా' అచట నుండి వీరిరువురు 'నాగసాకి' వెళ్ళిరి. ఈ రెండుచోట్ల జపానీయుల దేవా లయములను దర్శించిరి. రామతీర్థుడు జపానీయుల ఆచారములను పాటిం చెను. ఆయన జపానుదేశీయులు ఎంత శ్రమజీవులో, వీరెంత సోల్లాస వంతులో, నాగరికులో అప్పటికే గుర్తించెను. తరువాత వారు పెక్కు

పట్టణములను దర్శించినప్పుడు ఆ యభిప్రాయము మరింత దృఢ పడెను.

రామతీర్థుడు, నారాయణుడు 'యోకహామా' లో నుండగా, అసలు జపానులో మతసమావేశములు జరుపు ప్రతిపాదనయే లేదని తెలిసినది. వారు చాల ఆశ్చర్యపడిరి. ఇట్టి సమావేశము జరిపిన బాగుండునని ఎవరో చేసిన సూచనను గోరంతలు కొండంతలు చేసి 'ఒకారుగా' అను నాయన హిందూ దేశమునకు వచ్చినప్పుడు చెప్పెనట; ఇదిగో పులి అనగా అదిగో తోక!- మన యాత్రికులిద్దరు తాము టోకియో వెళ్ళనిమ్మటగాని యధార్థము తెలియ దనుకొనిరి. వారు జపానుదేశపు రాజధానియగు టోకియోవెళ్ళి పూర్ణ సింగును అతనియింట కలుసుకొనిరి. తన మాతృదేశమునుండి వచ్చిన వీ రిద్దరినిచూచి అతడు బ్రహ్మానందభరితు డయ్యెను. వారు మత సమావేశ ములనుగూర్చి అడుగగా అతడు అట్టిదేదియు లేదనియు, ఎవరో తమాషా కొరకు అట్లు ప్రచారము చేసియుందురనియు చెప్పెను. అతడు వెంటనే భారతదేశమునకు ఒక తంతివార్త పంపి మతసమావేశవిషయము నిజము కాదని తెలియజేసెను. ఈసంగతి తెలుపకపోయినచో భారతీయులు మత సమావేశములు జరుగుచుండెనను భ్రాంతిలో ఉందురు. కావున అత డట్లు తంతియిచ్చుట మంచిదని తలంచెను. పూర్ణసింగు అచ్చటి 'ఇండో జప నీస్ క్లబ్బు'నకు కార్యదర్శి. అచ్చట అతడును మరికొందరు సన్న్యాసులును ఉందురు. పూర్ణసింగు ఆ క్లబ్బులో, తాను మొట్టమొదట రామతీర్థుని కలిసికొన్నప్పటి యుదంతమునుగూర్చి ఉపన్యసించెను. వారు రామతీర్థుని 'మీది ఏ దేశము?' అని ప్రశ్నింపగా ఆయన 'ప్రపంచమే నా దేశము'అని పలికి 'సత్కార్యాచరణము నా మతము' అనియు జవాబిచ్చెను. ఆ రోజున పూర్ణసింగు అచ్చటి బౌద్ధవిశ్వవిద్యాలయములో ప్రసంగింపవలసియుండెను. అతడు రామతీర్థునికూడ అచ్చటకువచ్చి ఉపన్యసింపుమని కోరెను. ఆయన

అంగీకరించెను. వారిరువురు ఒక ట్రాముబండిలో అచ్చటికి పోయిరి. అచ్చట పూర్ణసింగు ప్రసంగించినపిమ్మట రామతీర్థుడు ఉపన్యసించెను. వారు తిరిగివచ్చునపుడు, పూర్ణసింగు విశ్వవిద్యాలయమునకు పోవుచు. ప్రశాంతముగా, ఎట్టి కోలాహలములేకుండ తన ఉపన్యాసమును తయారు చేసికొనినతీరును స్వామి మిక్కిలి కొనియాడెను. అతడప్పుడు చూపిన ఏకాగ్రత ఒక వేదాంతియొక్క ఏకాగ్రతవలె నున్నదని ఆయన ప్రశంసించెను. రామతీర్థస్వామి యంతటివాడు తన్నట్లు మెచ్చుకొనుచున్నాడని పూర్ణసింగు ఉబ్బి తబ్బిబ్బయ్యెను. మరునాడు పూర్ణసింగు 1893 వ సం॥లో షికాగోనగరమున జరిగిన సర్వమతసమావేశమును గూర్చి వ్రాయబడిన రెండు గ్రంథములను కొని రామతీర్థునకు బహూకరించెను. రామతీర్థు డా కానుకనుచూచి అమితానందపడి, తా నీ గ్రంథములకొఱకు చిరకాలమునుండి ప్రయత్నించుచుంటినని చెప్పెను. వారి ప్రసంగము మరల టోకియోలో జరుగుననుకొన్న మతసభలపై మరలెను. పూర్ణసింగు కొంచెము వరి హాసముగా రామతీర్థుడు జపానువచ్చుటకు దారితీసిన పరిస్థితులనుగూర్చి మాట్లాడెను. అంతట రామతీర్థుడు జపానులో అట్టిసభలు జరుగు ఏర్పాట్లు ఇంతకుముందు లేకపోయినచో, ఇప్పుడు తానే అట్టిసభలను ఏర్పాటు చేయుదుననెను.

మరునాడు పూనా నివాసియగు 'ఛత్రే' టోకియోలో మొదటి సర్కసు ప్రదర్శనము ఇచ్చెను. నగరములోని భారతీయులతో కలిసి రామతీర్థుడు ఆ ప్రదర్శనము చూచుటకు పోయెను. ఆ ప్రదర్శనసమయమున టోకియో విశ్వవిద్యాలయమున సంస్కృతభాషాచార్యుడును, గొప్ప ప్రాచ్యభాషా విద్వాంసుడును అగు 'టాకా-కుసూ' మహాశయుడు రామతీర్థుని కలిసి కొనెను. ఆ విద్వాంసుడు రామతీర్థునిగూర్చి ఇట్లు చెప్పెను : 'నేను ఇంగ్లాండులో ఆచార్య మాక్సిముల్లరు ఇంటను, తదితరస్థలములందును అనేక

పండితులను తత్త్వవేత్తలను చూచియుంటిని. కాని రామతీర్థస్వామివంటి మహాపురుషుని ఇంతకుపూర్వము చూడలేదు. ఆయన వేదాంతము మూర్తీభ వించినవ్యక్తి. ఆయనలో వేదాంతము. బౌద్ధము సమ్మేళనము పొంది యున్నవి. ఆ మహనీయుడు మహమ్మార్తుల కవి-తత్త్వవేత్త.

ఆ సర్కసు ప్రదర్శనములో రామతీర్థుడును ఆయన సహచరులును రెండవవరుసలో కూర్చుండిరి. మొదటివరుసలో తమ జాతీయపద్ధతిలో వేష ధారణమొనర్చుకొనిన జపానుమహిళలు కూర్చుండిరి. ఆ దృశ్యము పూర్ణ సింగునకు నేత్రానందకరముగా ఉండెను. అతని అభిప్రాయమునే రామ తీర్థుడు పైకి చెప్పినట్లు ఇట్లనెను: ఈ మొదలవరుస పీలికొండలనుండి ఒయ్యారములు పోవుచు సాగుచున్న గంగాలహరికల ధవళాంశు మాలికల వలె నున్నది.'

రామతీర్థస్వామి టోకియోలో ఉండగా ఒకసారి పూర్ణసింగు ఆయనను 'బారన్ - నైట్ - కాందో' గారి ఇంటికి తీసికొని వెళ్లెను. బారన్ రామ తీర్థునితో మాట్లాడుచు హఠాత్తుగా లేచివెళ్లి తన భార్యను బిడ్డలను తీసికొని వచ్చెను. తన కుటుంబముకూడ రామతీర్థుని సన్నిధిలో కూర్చుండి తనతో బాటు ఆనందింపవలయునని కోరి తాను వారిని తీసికొని వచ్చితనని తెలిపెను. రామతీర్థుని టోకియోలోని వాణిజ్యకళాశాలా విద్యార్థుల సభలో ఉపన్యసింపు మని కోరిరి. ఆయన 'విజయరహస్యము' అను విషయముపై ఉపన్య సించెను. ఆ ఉపన్యాసపు పూర్తిపాఠము పూర్ణసింగు రచించిన 'రామునికథ' (*The Story of Rama*) అను గ్రంథములో కలదు. రాముడు జపాను మహిళలసౌందర్యము నెట్లు మెచ్చుకొనెనో అట్లే జపానుమహిళలుకూడ అద్భుతమైన స్వామి తేజస్సును మిక్కిలి ప్రశంసించిరి. పూర్ణసింగు ఒక సారి ఒక చేతికఱ్ఱను కొనుటకై రామతీర్థస్వామిని బజారునకు తీసికొని వెళ్ళెను. ఆ చేతికఱ్ఱను వలసినచో ముక్కాలిపీటవలెను. గొడుగువలెను

కూడ ఉపయోగించుకొనవచ్చునట। వారు బజారులో పోవుచుండగా అచ్చట దుకాణములలోనున్న యువతులు రామతీర్థునివెంబడి ఒక ప్రవాహమువలె పొంగివచ్చి, ఆయన కాషాయవస్త్రమును తాకి చూచువారును, ఆయనవంక అనిమిషదృష్టులతో చూచువారునై రని పూర్ణసింగు వ్రాసెను. జపానుదేశపు నాగరకతయన్నను, జపానుదేశీయులన్నను రామతీర్థస్వామికి మిక్కిలి ప్రీతి ఏర్పడెను. ఆయన తన ఉపన్యాసములలో ఒకసారి బుద్ధుని అనుయాయులు జపానుదేశమున వ్యాప్తిచేసిన మతము 'తన మతము'తో సర్వదా సమానముగా ఉన్నదని చెప్పెను. కాని స్వల్పభేద మేమనగా, తాను శాస్త్రవిజ్ఞాన తత్త్వశాస్త్రము లాధారముగా ప్రస్తుత యుగమునకు అనువైనపద్ధతిలో మతమునకు వ్యాఖ్యానము చేయుచుంటిననియు తెలిపెను. జపానుదేశీయులు కూడ రామతీర్థుని తమ దేశీయునిగానే భావించిరి. అప్పుడు టోకియోలో విద్యార్థిగానున్న డా॥ మహేశచరణ్ సిన్హా ఇట్లు తెలిపెను. "జపాను మహిళలు - 'తావిలేని పూవులకు రామతీర్థస్వామి పరిమళము కూర్చెనని' ఆయనను శ్లాఘించుచుండగా నేను వింటిని. ఇట్టిపని చేయగలవాడు మానవాతీతుడు, దేవాంశసంభూతుడునై యుండవలెను.' జపానీయులు భారతీయవిద్యార్థులను తమ ఆప్తవర్గములోనివారుగ భావించుచున్నారనిపించినది. నాటినుండి యువకుడైన సిన్హా ఆ దేశములో సుఖముగా కాలము గడపసాగెను. ఆతడు 'జపానుప్రజలనుండి పెక్కుసాయములు, గౌరవమును పొందగలిగితివి. దీనికంతకు కారణము వారిపై ప్రసరించిన రామతీర్థస్వామి ప్రభావమే' అనెను. రామతీర్థుడు పశ్చిమదేశములకు వెడలిపోయినపిమ్మట జపానులోని ఒక వృద్ధబౌద్ధుడు ఇట్లు పలికెను: 'నేను ఇప్పటికిని ఆ మహనీయుని చిఱునవ్వులను గాలిలో తూగుచున్న రేగుపూల చూడగల్గుచున్నాను.'

రామతీర్థుడు జపానుదేశమును వదలివెళ్ళుటకు కొద్ది రోజులముందు నారాయణునికి, తామిరువురు వేదాంతప్రచారము కొఱకు ఒకే ప్రదేశమునకు

పోవుట మంచిదికాదనియు, తాను అమెరికా సంయుక్తరాష్ట్రములకు పోదు ననియు, అతడు మతప్రచారమునకై బర్మా, సింహళము, ఆఫ్రికా, యూరపు దేశములకు పోవుట మేలనియు సూచించెను. నారాయణుడు ఆవిధముగనే చేయుట కొప్పుకొని హాంగ్‌కాంగ్ తిరిగివచ్చి అచ్చటనుండి సింగపూరు, నేటి ఇండోనేషియా, బర్మా, సింహళములకు పోయెను. పిమ్మట అతడు ప్రాచ్యదేశములకు మధ్యఆఫ్రికాకు పోయెను. అచ్చటినుండి 1909 వ సం॥ చివరిరోజులలో లండను చేరుకొనెను. అచ్చట అతని ఆరోగ్యము పాడయ్యెను. అందుచే అతడు భారతదేశమునకు తిరిగివచ్చెను.

రామతీర్థస్వామి 'ఛాత్రే' తో కలిసి జపానుదేశమునుండి ఓడలో బయలు దేరెను. 'ఛాత్రే' తన సర్కసును తరలించుకొనిపోవుటకు ఆ ఓడను కుదుర్చుకొనెను. వేదాంతప్రచారముకొఱకు బయలుదేరి దేశదేశములు పర్యటించుచున్న రామతీర్థునియొద్దగాని, నారాయణునియొద్దగాని ఒక చిల్లిగవ్వ కూడ లేదన్నవిషయము మన మీ సందర్భమున మఱచిపోరాదు.

# 6. అమెరికా సంయుక్తరాష్ట్రములలో రామతీర్థస్వామి

రామతీర్థుడు శాన్‌ఫ్రాన్సిస్కో చేరగనే అమెరికాదేశస్థులకు విచిత్రముగా తోచిన ఒక చమత్కారపద్ధతిలో తన్ను తాను పరిచయము చేసికొనెను. ఆయన ప్రయాణము చేయుచున్న నౌక రేవుపట్టణము చేరినది. ప్రయాణికులు అందరు ఓడ దిగుటకు సిద్ధపడుచుండిరి. నౌక పైభాగమున రామతీర్థుడు ఆనందపారవశ్యములోనుండి ఇటు నటు నడయాడుచుండెను. ఆయనను ఒక అమెరికాదేశీయుడు చూచెను. అతడు కుతూహలపడి చరచర ఆయనదగ్గరకు పోయెను. వారిద్దరకు ఇట్లు సంభాషణ జరిగెను:

అతడు:- మీ సామాను ఎక్కడ?

స్వామి:- నా సామాను నేనే.

అతడు:- మీ డబ్బు ఎచ్చట దాచుకొందురు?

స్వామి:- నా దగ్గర డబ్బులేదు.

అతడు:- అయినచో మీకు ఇచ్చట గడచుట ఎట్లు?

స్వామి:- నేను ప్రతివ్యక్తిని ప్రేమించుచు గడపుదును. నాకు దప్పిక అయినచో నీరు త్రావుదును. ఆకలియైనచో ఒక్క రొట్టెముక్క నాకు చాలును.

అతడు:- మీకు అమెరికాలో ఎవరైన స్నేహితులున్నారా?

స్వామి:- ఉన్నాడు. ఒకవ్యక్తి ఉన్నాడు.

స్వామి యిట్లు చెప్పుచు ఆ పృచ్ఛకుని భుజములను పట్టుకొనెను. ఈ ప్రసంగముతో ఆ వ్యక్తి ఒక పృచ్ఛకుడగుట పోయి స్వామికి భక్తుడయ్యెను. అతడు రాముని సన్నిధియే జీవితమున క్రొత్తబాటలు తీర్చునని విశ్వసించుకొనెను. శాన్‌ఫ్రాన్సిస్కో చేరినపిమ్మట రామతీర్థుడును యాత్రేయును విడివడిరి. స్వామి తనదారిని తానుండెను. కొద్దిదినములలో అతడు

ఆ దేశస్థులకు మాననీయుడైన అతిథి అయ్యెను. అతడు సంయుక్తరాష్ట్రములలో రెండుసంవత్సరముల పైచిలుకు గడపెను. అందులో పదునెనిమిది మాసములు శాన్‌ఫ్రాన్సిస్కోలో డా. ఆల్బర్ట్ హిల్లరుతో ఉండెను. అతడెప్పటికివెళ్ళినను ప్రజలు ఆయన ఉపన్యాసములు వినుటకు తండోపతండములుగా రాసాగిరి. స్వామి ఒక్కొక్కప్పుడు భిన్నభిన్నసభలలో రెండు మూడుగంటలు విరామములేకుండ ప్రసంగింపవలసి వచ్చెడిది. శ్రీమతి పౌలిన్ విట్‌మను అను ఒక భక్తురాలు కాలిఫోర్నియాలో స్వామికి సంక్షిప్తలేఖకురాలుగా పనిచేసెను. అమెరికాలో రామతీర్థుని కార్యక్రమములను గూర్చి ఎక్కువవివరములు మనకు తెలియరాలేదు. ఆయన ఆ దేశస్థులను ఎట్లు ప్రభావితులనుచేసెనో తెలిసికొనుటకు కొన్ని వార్తాపత్రికలలోని విలేకరులు, కొన్ని లేఖలుతప్ప ఇతరాధారము లేవియు లేవు. పూర్ణసింగు నారాయణస్వామి వ్రాసిన చరిత్రలలో కొన్ని ఉజ్జ్వలమైన సంఘటనలు ఉట్టంకింపబడినవి. వానిలో చాలభాగము రామతీర్థునికి తమ స్వంతగోడు చెప్పుకొనిన స్త్రీలనుగూర్చియే వివరింపబడినవి. వీరిలో కొందరినిగూర్చి వ్రాయుచు అతడు వారందరు ఒక క్రొత్తముఖమును చూచుటకును, ఒక క్రొత్తభాష వినుటకును వచ్చినవారే అని చెప్పెను. ఆ వచ్చినవారిలో స్వామికి ఇద్దరుమాత్రమే నిజముగా ఆధ్యాత్మికదృక్పథము కలవారుగా కనబడిరి. ఒకనాడు రామతీర్థుడు కనులుమూసికొని ధ్యాననిమగ్నుడై యుండగా, ఒక వృద్ధురాలు ఆయనకడకు వచ్చెను. ఆమె ఉన్నట్లుండి ఏడువనారంభించెను. అయినను స్వామినుండి ఆమె కేమియు సమాధానము రాలేదు. ఆమెకు ఒడలు మండిపోయి, ఆయన గర్వి, మొండివాడు అని నిందింపసాగెను. ఇంతలో స్వామి ఓంకారోచ్చారణము చేసెను. ఒక్కలిప్తలో ఆ వృద్ధురాలి యందు మార్పువచ్చెను. ఆమె ఇట్లు పలికెను: 'నన్ను భూమినుండి పైకి ఎవరో లేపినట్లయ్యెను. ఒక తేజోమూర్తినై గాలిలో ఈదులాడితిని. ఈ

ప్రపంచమునకంతకు నేనే తల్లిని అను భావము కలిగెను. ఈ దేశము లన్నియు నావి. ఈ జాతులన్నియు నా సంతానము అనిపించినది'. కొన్నాళ్ల తరువాత ఆమె భారతదేశమునకువచ్చి తన్ను కలిసికొన్నవారి కెల్లరకు ఇట్లు చెప్పసాగెను: 'నాటి ఓంకారనాదము నా అస్థులకుపట్టి ఇంకను వినిపించు చునేయున్నది - ప్రతిధ్వనించుచునేయున్నది - రామతీర్థస్వామి ప్రభావమున నాలో అమృతఝురులు పెల్లుబికినవి. నాకు శాపవిమోచనమైనది. నేను పవిత్రురాలనై తిని.'

కాలిఫోర్నియాలోని లాస్ ఏంజిల్సు నివాసినియగు శ్రీమతి వెల్‌మన్ అను నామెకూడ ఇట్లే స్వామిని దర్శించి ఆధ్యాత్మికశాంతి పడసినది. ఆమె పూర్ణసింగునకు వ్రాసినలేఖలో ఇట్లు తెలిపెను: 'నేను మొదట స్వామి ఉపన్యాసము వినుటకు కొంత అనిష్టముగానే వెళ్ళితిని. కాని ఆయన చేసిన ఓంకారోచ్చారణముతో నా మనస్సు ఏవియో ఉన్నతపథములు కెగసినది. అంతకుముం దెన్నడును ఎఱుగని ఒక ఆనందముతో ఊగిపోయితిని. నాలో ఒక దేవతాసంబంధమగు పరమశాంతి ఒక గొప్ప తేజస్సును చిమ్మినది. అప్పటినుండి ఆయన మన జీవితములకు ఉచితముగా ప్రసాదించుచున్న ఈ ఆధ్యాత్మికభక్తిని నే నెన్నడును వదలుకొనలేదు.' - మరియొకస్త్రీ తన ఏకపుత్రుడు చనిపోగా మనశ్శాంతికొఱకు రామతీర్థుని ఆశ్రయించెను. తన దుఃఖమును తొలగించినచో స్వామి కోరినంత ధనమును ఆయన కిత్తునన్నది. అంతట రామతీర్థుడు తాను కోరెడుధనము ఆమె అనుకొనుచున్న ధనము కాదనియు, తాను కోరబోవునది మిక్కిలి కష్టసాధ్యమైనదనియు పలికెను. ఆమె స్వామి యేదికోరిన అదియే ఇత్తునన్నది. అంతట రామతీర్థుడు అచ్చటనున్న ఒక నీగ్రోపిల్లవానినిచూపి, 'ఈ పిల్లవానిని తీసికొనిపోయి ప్రేమతో నీ బిడ్డవలె చూచుకొని పెంచుకొనుము' అని పలికెను. అందుల కామె అంగీకరింపక 'అది అసంభవము' అని చెప్పగా, స్వామి 'అది

అసంభవమైనచో, మనశ్శాంతికలిగి నీవు సుఖముగానుండుటయు అసంభవమే' అని బదులు పలికెను. చివరకామె ఒప్పుకొని స్వామి చెప్పినట్లే చేసెను.

ఒకసారి నాస్తికురాలైన ఒకస్త్రీ రామతీర్థుని చూడవచ్చెను. ఆమెకు స్వామిని నాస్తికునిగా చేయవలయునని పట్టుదల. ఆమె వచ్చుసరికి స్వామి సమాధినిష్ఠుడై యుండెను. కొంతసేపటికి ఆయన కనులు తెఱచి ఆమెవంక చూచెను. ఆమె దిగ్భ్రాంతురాలై వెంటనే ఇట్లు అనెను: 'నేను నాస్తికురాలను కాను. మిమ్ము ఒక్కసారిమాచిన చూపే నన్ను మార్చివేసినది. 1903 సం॥ మేనెల 20 వ తేదీని రామతీర్థుడు అమెరికా అధ్యక్షుడగు రూజ్‌వెల్టును శాన్‌ఫ్రాన్సిస్కోలో కలుసుకొనుట తటస్థించెను. ఆయన అమెరికా అధ్యక్షునికి తాను భారతదేశ ప్రజలపక్షమున అమెరికాప్రజలకు చేసిన విజ్ఞాపనముయొక్క ప్రతిని సమర్పించి ఆయవకాశమును చక్కగా వినియోగించుకొనెను. రైలు కదలుచుండగా రూజ్‌వెల్టు చేయి ఊపుచు స్వామికి వీడ్కోలు చెప్పెను.

రామతీర్థుని సన్నిధిలో నున్నప్పుడు ప్రతివ్యక్తియు తాను ఉన్నతస్థితికి ఎదిగినట్లు భావించుకొనెడివాడు. ఇట్టివ్యక్తులలో ఇరువురుస్త్రీలు వ్రాసిన లేఖలు ఇందు పొందుపఱుపబడినవి. ఈ లేఖలు స్వామి నిర్యాణానంతరము వ్రాయబడినవి. 'కొలరేడో'లోని కుమారి ఫ్లారెన్సు అను నామె ఇట్లు వ్రాసెను: 'మూడు సంవత్సరములకుపూర్వము ఆ మహాత్ముని కలిసికొంటిని. అట్టి మహావ్యక్తి పూర్వమెప్పుడు నేను చూచియుండలేదు. ఆయన సన్నిధి నన్ను భగవత్సామీప్యము పొందించినది. ఆయన పలుకులు మిక్కిలి సరళములయ్యు గాఢమగు ఆయన ఆత్మవిశ్వాసమును ప్రతిబింబించుచుండెడివి. నిజమునకు, ఆయనతో పరిచయము కలవారికెల్లరకు సమగ్రజ్ఞానము, సమ్యగవగాహనము అలవడినదన్నచో దానికి కారణము ఆయన మాటలు కావు.

ఆయన వ్యక్తిత్వమును కాదు. మరేమనగా ఆయనయందు మేము దర్శించిన భగవంతుడే హేతువు.'

శ్రీమతి ఆసీ. ఎఫ్. హేస్టింగ్సు ఇట్లు వ్రాసెను: 'స్వామి-వివేకము, మధురోదాత్తమైన నడవడిక, సరళము, సర్వసులభమునగు తన పద్ధతులు, పరిసరములకు పరిస్థితులకు అనుగుణముగా సర్దుకొనిపోగలిగిన ప్రకృతి-వీనిచేతనే ప్రజానీకమును అమితముగా ఆకర్షించెనేగాని ఆయన పాండిత్యముచేతను ఆధ్యాత్మికవిజ్ఞానముచేతను కాదు. ఆయన కఠిననియమములు కల కులవ్యవస్థగల దేశమునుండి వచ్చియు, తాను అగ్రజాతికిచెందిన బ్రాహ్మణుడయ్యును పైవిధముగా నడచుకొనగలిగెను. ఆయన నిర్ణీత సమయమున భారతీయసంప్రదాయము ప్రకారము ధ్యాననిమగ్నుడయ్యెడి వాడు. ఒక్కొక్కప్పుడు తత్త్వశాస్త్రమునుగూర్చి అద్భుతముగా ప్రసంగించెడివాడు. ఒక్కొక్కసారి తన్ను చూడవచ్చినవారితో పరాచికములాడుచు నవ్వుచుండెడివాడు. ఒక్కొక్కమారు యువకుల బంతియాటలో పాల్గొనెడివాడు. ఇట్లు ఆ యా సందర్భములకు తగినట్లు ప్రవర్తించెడివాడు. రామతీర్థుడు డా. ఆల్బర్టు హిల్లరుఇంట నివసించినప్పుడు ఇంటివారికొఱకు, దగ్గరనున్న కొండకుపోయి వంటచెఱకుకొట్టి తెచ్చెడివాడు. అమెరికావంటి దేశములో తనవంతు కాయకష్టముచేయకుండ గడపుట తన కిష్టములేదని ఆయన చెప్పుచుండెడివాడు. ఒకసారి ఆ దేశస్థులు కొందరు ఒక కొండ ఎక్కుచుండగా స్వామి వారితో పోటీపడి తానును ఎక్కనారంభించెను. ఆ కొండశిఖరముపేరు 'శాస్ట్' శిఖరము. దాని ఎత్తు 14,444 అడుగులు. ఆ శిఖరముపైకి అందరికంటె స్వామియే చేరుకొనెను. ఇందుకు వారు బహుమానము ఈయబోగా ఆయన దానిని స్వీకరింపలేదు. మరియొకసారి ఇంకొక పరుగుపందెములో పాల్గొనెను. (క్రాస్ కంట్రీ రేస్) అచ్చటకు గమ్యము ముప్పదిమైళ్ళదూరమున నున్నది. స్వామి తక్కినవారినందరను ఓడించి

మొట్టమొదటివాడుగా గమ్యమును చేరెను. ఆయన ఎల్లప్పుడు ఉల్లాసముగా, చలాకీగా ఉండెడివాడు. ఒకసారి ఒక రైలురోడ్డు కంపెనీ అధికారి ఒకా యన స్వామి ఉపయోగార్థము ఒక 'పుల్‌మన్' కారును ఒసంగుచు 'ఆయన చిఱునవ్వులు అత్యంత సాంక్రామికములు' అనెనట.

శ్రీమతి విట్‌మన్, శాన్‌ఫ్రాన్సిస్కోలో రామతీర్థుడున్నపుడు కొన్ని మాసములు ఆయన దినచర్య ఎట్లుండెడిదో విపులముగా ఇట్లు వర్ణించెను: 'ఆయన పశ్చిమపార్శ్వమున ఒక గుడారములో నివసించెడివాడు. అచ్చటి గోష్ఠమున ఆహారము తీసికొనెడివాడు. ఆ ప్రదేశమంతయు ఇరువైపుల పర్వతములతోను, పచ్చని చెట్లతోను, దట్టముగా అల్లుకొనిన నికుంజములతోను చాల అందముగా ఉండెడివి. ఆ లోయకు దిగువ 'సాక్రమెంటో' నది ప్రవహించుచుండెడిది. ఇచ్చట నున్నప్పుడే రామతీర్థు డనేకగ్రంథములు చదివెను. ఉదాత్త కవితారచనలు చేసెను. గంటలకొలది ధ్యానము చేసెను. నదీప్రవాహము మహావేగముగా నున్నచోట ఒక పెద్ద బండరాయిపై ఆయన రోజులకు రోజులు వారములకు వారములు గడపెడివాడు. స్వామి భోజన వేళకుమాత్రమే ఇంటికి వచ్చెడివాడు. అప్పుడు చక్కని ప్రసంగములు చేసెడివాడు. తన్ను చూచుటకువచ్చు అసంఖ్యాకప్రజలను ఎంతో సంతోషముతో ఆహ్వానించెడివాడు. ఈవిధముగా ఆయన విరామమునెఱుగక, సరళము, ఉల్లాసపూరితమునగు జీవితమును గడపెను. నదీతీరమునుండి స్వేచ్ఛగా, నిరాటంకముగా వెడలిన ఆయన నవ్వులు ఇంటివఱకు స్పష్టముగా వినవచ్చుచుండెడివి. ఆయన చిన్నపిల్లవానివలెను పరమయోగివలెను ఉండెడివాడు. స్వామి రోజులకొలది దివ్యానుభవస్థితియందుండెడివాడు.

భారతదేశముపట్ల అచంచలమగు ఆయనభక్తి చీకటిలో చిక్కిన సోదర దేశీయుల నుద్ధరింపవలెనను ప్రగాఢవాంఛ, ఆయన పరిపూర్ణత్యాగబుద్ధికి

నిదర్శనములు. ప్రతివ్యక్తియందు రామతీర్థుడు దైవమునే చూచెడివాడు. ఆయన ప్రతవ్యక్తిని 'పవిత్రాత్ముడా!' అనియే సంబోధించుచుండెడివాడు.

రామతీర్థుడు అమెరికాలో ఉన్నప్పుడు ఆ దేశమంతయు తిరిగెను. పెక్కు విశ్వవిద్యాలయములలో ఉపన్యాసము లిచ్చెను. పెక్కుగోష్ఠులు నిర్వహించెను. ఆయన ఉపన్యాసములు విన్నవారును, ఆయనతో పరిచయము ఏర్పడినవారును, ఆయనపట్ల అవ్యాజమగు గౌరవభావమును పెంపొందించుకొనిరి. శ్రీమతి విట్‌మన్ రామతీర్థుని ప్రసంగములను ఉపన్యాసములను గూర్చి వార్తాపత్రికలలోవచ్చిన వివేదికలను సేకరించి భద్రపఱచెను. వీని వలన పెక్కురు పాఠకులకు స్వామి వ్యక్తిత్వము చక్కగా ఎఱుకపడెను. అటుపిమ్మట లక్నోలోని రామతీర్థ గ్రంథప్రకటనసంఘము ఆ ఉపన్యాసము లన్నిటిని ఎనిమిది సంపుటములుగా ప్రకటించెను. ఒక్కొక్కసంపుటమున 400 పుటలు కలవు. ఈ సంపుటములకు '*ఆత్మదర్శనారణ్యములలో....*' అని పేరు.

రామతీర్థుని భాషనుగూర్చియు, ఆయన స్వభావమునుగూర్చియు అమెరికాలో ఒకభక్తుడు ఇట్లు తెలిపెను : 'స్వామిభాష మధురమైనది. అమాయకుడగు చిన్నపిల్లవాని పలుకులవంటిది - పక్షులకు, పువ్వులకు, పరుగులిడు సెలయేటికి, గాలికి తూగుచెట్లకు, సూర్యునకు, చంద్రునకు, తారకలకు-ఒక భాష ఉన్నచో అది ఎట్లుండునో అట్టిభాష రామతీర్థునిది. మనుజుల భావనల లోనికి స్వప్నములలోనికి చొచ్చుకొనిపోగల భాష అది. ఇక ఆయన స్వభావమన్ననో-అది సరళము, - బాలజనోచితము - స్వచ్ఛము - ఉదాత్తము - ఋజువు - నిరాడంబరము అయినది. ప్రతి ఉపన్యాసము ముగిసినపిమ్మట సభ్యులు కొన్నిప్రశ్నలు అడిగెడివారు. ఆ ప్రశ్నలన్నింటికి స్వామి స్పష్టముగా, సంక్షిప్తముగా, మధురముగా సమాధానము లొసంగెడివాడు.

స్వామి అమెరికాలోనున్నప్పుడు ఎక్కువకాలము పల్లెపట్టులలో గడపెను. ఆయన వచ్చినట్లు కనుగొన్న వార్తాపత్రికలు స్వామి ఉపన్యాసములను ప్రకటించెడివి. ఆయన పర్యటనవిశేషములను జిల్లా వార్తాసంస్థ సేకరించి ప్రచురించెడిది. 1904 వ సం॥ జనవరినెలలో 'డెనివరు'నుండి ప్రచురింపబడు 'రాకీ మౌంటెన్ న్యూస్' అనుపత్రిక ఇట్లు ప్రకటించెను: 'రామతీర్థస్వామి అను భారతీయాచార్యుడు నిన్నమధ్యాహ్నము యూనివర్సిటీచర్చిలో తన తత్త్వసిద్ధాంతములనుగూర్చి ఉపన్యసించెను. ఆయన ఇప్పుడు 'డెనివరు'లో ఉన్నారు. ఆయన తన ఉపన్యాసమున ఇట్లు నుడివెను: 'నేటి జీవితవిధానమును క్రమబద్ధముచేయుటయే ఈ తత్త్వశాస్త్రలక్ష్యము. ఇది నేటి బహువిషయములకు సంబంధించినది. శక్తివ్యయమును తగ్గించుకొనుట - మన శరీరముల విశుద్ధత్వమును వివారించుట - అసూయాద్వేషగర్వాదులనుండి తొలగియుండుట - మానసికమందాగ్నికి చికిత్సచేయుట - వివేకదారిద్ర్యమును నివారించుట - ఆధ్యాత్మిక పరాధీనతను తొలగించుట - కృషిలో విజయమునుసాధించు రహస్యములు గ్రహించుట - ప్రేమమూలమున భగవంతుని పొందుట - జ్ఞానసముపార్జనమార్గముల సమ్యగవగాహనము - శాంతిసామరస్యములను కాపాడుట - ఇట్టివిషయములే నేను బోధించునవి.

'హిందూమతము - ఇస్లాము - క్రైస్తవము - అందు కేథలిక్కుమతము - ప్రొటెస్టెంటుమతము - వీనిలో ఏదియును నా మతము కాదు - నా మతము వీనిలో దేనికిని ప్రతికూలమయినది కాదు. సూర్యకాంతి, నక్షత్రములకాంతి, నదీజలాసేచనము, మనఃప్రసారము - ప్రసరించు ప్రదేశములన్నియు నా మతమునకు రంగభూములే. పువ్వులలో ప్రెస్బిటేరియను పుష్పములవి, అవనీప్రదేశములలో మెథడిస్టు ప్రదేశములని ఉన్నవా? లేవు. అట్లే నాకు కుల, వర్ణమతభేదములు లేవు. సూర్యకిరణములు, నక్షత్రకాంతులు - చెట్లు

చేపలు - గద్దిగాదములు - ఇసుకతిన్నెలు - పెద్దపులులు - ఏనుగులు - మేకలు - చీమలు - పురుషులు - స్త్రీలు - పిల్లలు - అందరు నాకు సమానులే. నా మతమునకు పేరులేదు. అది ప్రకృతిప్రసాదితమతము. కావున దానిని 'సర్వమానవమతము' అందును. దాని సారాంశము ఈ క్రింది గేయములో వివరింపబడుచున్నది.

'మంచున తడిపిన కన్నులతో
ఇటునటు తూగెడు సుమబాలా!
ఇటుచూడు! ఇటుచూడు!
నాతో నిజమును చెప్పెదవా?
తోడెవ్వరు లేకుండగ
ఒంటరిగా ఉన్నావేలా?'

ఆ చిన్ని సుమబాల నెమ్మదిగా నిట్టూర్చి ఇట్లన్నది :-

నిజముగ ఒంటరినై యున్నప్పుడు
నే నెవరో తెలుపుట కే మున్నది?
ఆకసమందున, అవనీతలమున
అన్నలు, తమ్ములు, అక్కలు, చెల్లెళ్ళు
అందరు నను బోలినవారై
ఎందరెందరో నా చుట్టును ఉండిరి.'

శాన్‌ఫ్రాన్సిస్కోనుండి వెలువడు ఒకపత్రిక ఇట్లు ప్రకటించినది :

'ఉత్తరభారతదేశ వనభూములనుండి, ఆశ్చర్యకరమగు వివేకసంపద కలవాడు - మతప్రవక్త - తత్త్వవేత్త - శాస్త్రజ్ఞుడు - మతాచార్యుడు - అగు ఒక మహనీయుడువచ్చె. 'డాలరు' (అమెరికా నాణెము) దేవతను ఆరాధించు వారికి నిస్స్వార్థపూరితము, ఆధ్యాత్మిక శక్తియుతమునగు మానవసిద్ధాంత

మును బోధించుచున్నారు. హిమాలయపర్వతశ్రేణులనుండి దిగివచ్చిన ఈ మహర్షి సుకుమారుడు - జ్ఞానము రూపుగొన్నట్లున్న యువకుడు - యోగవిద్యను కరగించి మూసను బోసినట్లున్న మతాచార్యుడు - ఉన్నత బ్రాహ్మణ సహజమగు వర్చస్సుకలవాడు - అతని ఫాలము విశాలమై ఉన్నతముగా ఉన్నది; శిరస్సు పెద్దదిగా స్పృహణీయముగా ఉన్నది; ముక్కు స్త్రీనాసిక వలె సుకుమార మనోజ్ఞమైనది; చుబుకము ఆయన దృఢసంకల్పమునకు సూచకముగా విరాజిల్లుచున్నది. ఆయన చిఱునవ్వులు నవ్వినపుడు వదనమున చిమ్ముకొనుచున్న ధవళ దంతకాంతులకు పరిసరములన్నియు వెన్నెలలు విరిసినట్లై, సమీపమున నున్నవారి హృదయములలో అప్పటికప్పుడు ఎనలేని భక్తిగౌరవములు ఆయనయెడల ఇనుమడించెడివి.

"విన్న ఆయన ఇట్లు నుడివెను:- 'నే నెట్లు జీవించుచున్నాను?' - దీనికి సమాధానము చెప్పుట చాల సులభము. నేను దేనికొఱకు యత్నింపను. విశ్వాసమే నా రక్ష. సర్వమానవులను ప్రేమించుట నా ఆత్మకు అలవడినది. అందుచే అందరు నన్ను ప్రేమింతురు. ప్రేమ ఉన్నచోట కోర్కెలు లేవు - బాధలు లేవు - ఈ మనస్స్థితియే నాకు సమస్తమును. నేను కోరనక్కఱలేకయే సమకూర్చుచున్నది. నే నాకలితో నున్నప్పుడు నాకు తిండి పెట్టెడివారున్నారు. ధనముకొఱకుగాని, ఇతరవస్తువులకొఱకుగాని నే నెవ్వరిని యాచింపను. అయినను నాకు అన్నియు ఉన్నవి. చాల కొద్దిమందికి మాత్రమే సాధ్యమగు దివ్యప్రపంచమున నే నెక్కువగా గడపుచుందును."

రామతీర్థుడు ఒకనెల పోర్టులాండులోను, ఒకమాసము డెన్వరులోను, రెండువారములు షికాగోలోను సుమారు పదునైదురోజులు మినియాపోలిస్‌లోను గడపెను. ఈ ప్రదేశములలో ఆయన వేదాంతసంఘములను ఏర్పాటు చేసెను. మినియాపోలిస్‌నుండి బఫాలో (న్యూయార్కు) బోస్టను, న్యూయార్కు, ఫిలడెల్ఫియా, వాషింగ్టన్ నగరములకు వెళ్ళెను. రామ

తీర్థుని అమెరికాయాత్ర రెండువిషయముల నుద్దేశించియున్నదని తెలుపుచు ఒక వార్తాపత్రిక ఇట్లు వ్రాసెను. 'మొదటిది : తనదేశములోనున్న అమెరికా దేశస్థులను భారతయువకులకు విద్యారంగమున సాయమొనర్చుటకు సుము ఖులుగా నొనర్చుట-ఆ యువకులను అమెరికాదేశమున కళాశాలలకురప్పించి. అచ్చట వారు అమెరికావారి విద్యాసంపదతోబాటు కార్యశూరతను, స్వేచ్ఛా స్వాతంత్ర్యములను అలవరుచుకొని తమ దేశమునకు తిరిగివెళ్ళినపిమ్మట తమ ప్రజలకు తాము నేర్చినదంతయు బోధించునట్లు చేయుట—రెండవది : తన తత్త్వసిద్ధాంతములను ప్రచారముచేయుట - సత్యవస్తువుతో మానవు నకు గల ఐక్యభావమే ఆతని తత్త్వసిద్ధాంతము.'

ఈ రెండులక్ష్యములను సాధించుటయం దాయన కృతకృత్యులయ్యె ననియే చెప్పవచ్చును. ఆయన భారతీయవిద్యార్థులకు అమెరికా విశ్వవిద్యా లయములలో విద్యార్థివేతనము లిప్పించెను. అమెరికాదేశస్థులకు వేదాంత శాస్త్రముపై అభిరుచి కల్గించెను. ఆయన పర్యటించిన ప్రతి ప్రదేశమున ఆయనకు పెక్కుమంది శిష్యులైరి.

## సంక్షిప్త తత్త్వశాస్త్రము

పోర్టులాండునుండి శ్రీమతి ఇ. పి. కాంప్‌బెల్‌కు వ్రాసినలేఖలో మనకు వినుగును కలిగించి మనశ్శాంతిలేకుండ జేయు కారణములను ఎనిమిదింటిని స్వామి ఇట్లు పేర్కొనెను :

1. ప్రతివ్యక్తి మానసికముగా తన్ను ఇతరులతో పోల్చిచూచికొని శేద పడుట.

2. ఈ తరతమభావశృంఖలములలో తాను చిక్కుపడుచు ఇతరులను చిక్కుపఱచుట.

3. వర్తమానమును భూతకాలముతో పోల్చిచూచుచు, పూర్వము చేసిన పొరపాట్లనుగూర్చి చింతపడుచుండుట.

4. భవిష్యత్తుపై ఆశలన్నియు పెట్టుకొని, రాగల కాల మెట్లుండునోయని భయవిహ్వలు లగుట.

5. భగవంతునియందుతప్ప తక్కిన అన్నివిషయములయందు మన మ్సను లగ్నముచేయుట.

6. పై పై మెఱుగులకై ఎక్కువ ప్రాముఖ్యమిచ్చి ఆంతరసామరస్యము నెరు విశ్వాసములేక ఉండుట.

7. పై పై మాటలకు, జనుల బహిఃప్రవర్తనకు లోగి నిర్ణయములు చేసికొనుట.

8. వాగాడంబరముమాత్రమే ప్రధానముగా చేసికొని సరియగుమార్గము నకు తొలగి దూరమగుట.

మానవుడిట్టి పొరపాట్లు చేయకుండ తప్పించుకొనుమార్గములనుకూడ రామతీర్థస్వామి ఆ లేఖలో ఇట్లు సూచించెను :

1. వ్యాధి, మరణము, ఆకలి, ఈతిబాధలలో నేవి సంభవించినను తొణకక - నిత్యసంతోషముగా ఉండుటకు యత్నింపుము. నీలోని దివ్యత్వ మునే అంటిపెట్టుకొని శాంతిసంతోషములతో ఉండుము.

2. నీ ఆత్మప్రాభవమును నిలుపుకొనుము. ఈ ప్రపంచమున సర్వము- నీ బంధువులు-తదితరములు-అన్నియు అశాశ్వతములు. నీ ఆత్మ సర్వ వాంఛాతీతమయినది. అందుచే నీయందు కోరికఅనునది ఉండరాదు.

3. ఈ వేదాంతసూత్రములను నీవు తప్పక పాటించినచో, నీలో నత్య పరిమళమాధురి లుప్పతిల్లును.

4. నరుండటోవునప్పుడు, నేనొక మూర్తీభవించిన వేదాంతస్వరూపు డనై తిరిగి మేల్కాంచు నను దృఢసంకల్పమును చేసికొనుము. ఉదయ మున మేల్కాంచినపిమ్మట ఆ సంకల్పమునే జ్ఞప్తియం దుంచుకొనుము.

5. నీలునదినప్పుడెల్ల ఓంకారోచ్చారణ మొనర్చుచుండుము.

అమెరికా సంయుక్తరాష్ట్రములలో రామతీర్థస్వామి సాధించిన విజయమునుగూర్చి 1911 సం॥ జూలై నెలలో, కలకత్తానుండి వెలువడు 'మోడరన్ రివ్యూ' అను పత్రికలో పంజాబురాష్ట్రమునుండి మేధావియు, విప్లవకారుడునగు లాలా హరదయాళ్ అనువాయన వ్రాసిన వ్యాసములోని ఈ క్రిందిభాగమువలన తెలిసికొనవచ్చును.

అమెరికాదేశములోని ఈ ప్రాంతములలో రామతీర్థస్వామి ప్రేమానురాగములను చూఱగొనినప్రజలు ఆయన నెన్నటికిని మఱవజాలరు. కాలిఫోర్నియాలోని పర్వతప్రాంతములయందలి గ్రామీణుల హృదయఫలకములపై ఆయన ఎట్లు సుస్థిరుడై యుండెనో, ఆయన ఎట్లు మహాయోగిజీవితము నచ్చట గడపెనో, తన ఉపన్యాసములనుగూర్చి పత్రికలలో వెలువడిన స్తుతిప్రశంసలయెడల ఆయన ఎంత నిర్లిప్తుడై యుండెనో - ఆ ప్రజలు కథలు కథలుగా చెప్పుదురు. అమెరికాకువచ్చిన హిందువులందఱిలో ఆయన అగ్రగణ్యుడు. నిజమైన యోగి - ఋషి - హిందువుల ఆధ్యాత్మికవిద్యకు ఆయన జీవితమొక దర్పణము. ఆయనకు విశ్వాత్మికమగు ప్రేమయన్నచో పరమగౌరవము.

# 7. స్వదేశాగమనము

అమెరికా సంయుక్తరాష్ట్రములనుండి తిరిగివచ్చుచు రామతీర్థస్వామి కొన్ని రోజులు ఈజిప్టులో గడపెను. ఆయన చక్కని పారశీకభాషాపరిజ్ఞానము కలవారు. ఒక మసీదులో మహమ్మదీయులసభయందు ఒకనాడు పారశీక భాషలో ఉపన్యసించెను. ఆయన ఉపన్యాసము అల్ వాహబ్ అను పత్రికలో ప్రకటింపబడెను. ఆ ఉపన్యాసమును అచ్చటి ప్రజలందరు మెచ్చుకొనిరి. ఈజిప్టు ప్రజలు స్వామిని తమలో ఒకనిగా భావించుకొనదొడ్గిరి. ఒకవిధముగా రామతీర్థుడు ప్రపంచపౌరు డయ్యెను. జపానులో నేమి-అమెరికాలో నేమి-ఈజిప్టులో నేమి-ప్రజలెల్లరు ఆయనను తనువానిగనే పరిగణించిరి. కాని పరదేశీయునిగా తలంపలేదు.

రామతీర్థుడు సుమారు రెండున్నర సంవత్సరములు కృషిచేసి తన ఆత్మదర్శనసాధనను మరింత పటిష్ఠ మొనర్చుకొనెను. ఇప్పు డాయన తా నొక మహారాజుననుకొనుచు తన పేరునకు 'పాదుషా' అను పదమును చేర్చి వాడుకొనదొడ్గెను. 1904 వ సం॥ డిసెంబరు 8-వ తేదీని ఆయన బొంబాయి చేరినప్పుడు ఆయన అనుయాయులు, భక్తులు ఆయనకు ఘనస్వాగతమిచ్చిరి. వారిలో స్వామికి పూర్వసహచరుడగు శివగుణాచార్యుడు స్వామిని తనతోకూడా మధురకువచ్చి కొన్నిదినము లుండుడని కోరెను. స్వామి అంగీకరించెను. స్వామి మధురకుపోవుచు దారిలో నాసిక్, హోషంగాబాదులలో ఆగి, అచ్చట తన సహజధోరణిలో వేదాంతోపన్యాసములు చేసెను. మధురలోని ప్రజలు ఆయనకు హృదయపూర్వక స్వాగతమిచ్చిరి. ఆయన మధురనుండి వెడలిపోవునప్పుడుకూడ అట్లే గొప్ప వీడ్కోలొసంగిరి. ఇంతకుపూర్వ మొకసారి ఆయన మధురను దర్శించెను. ఆనాటి తమ అను

భవమును ప్రజలు ఇప్పటికిని మఱచిపోలేదు. ఒకనాడు స్వామి యమునా నదీతీరమున చలి కాచుకొనుచుండగా ఒక పడవలోనుండి కొంతమంది భారతక్రైస్తవులు దిగిరి. ఆ సమయమున పూర్ణసింగు స్వామియొద్దనే యుండెను. స్వామిసూచనపై అతడు వారిని చేసన్నచేసి పిలిచెను. వారు రామతీర్థునికడకు వచ్చిరి. స్వామి వారికి క్రిస్మసుదినమును సంతోషదాయకములగుగాతమని పలికెను. వారి మతాంతరీకరణమునకు అభ్యంతరము చెప్పక, వారి అన్యమతస్వీకారము యథార్థమైన ఉన్నతికి సాయపడుగాక యని కోరెను.

మిషను కళాశాలలో స్వామికి పూర్వసహచరు డొకడు మథురలో ఆయనను కలిసికొని, ప్రసంగవశమున స్వామి తన కుటుంబమును, స్నేహితులను, విద్యార్థులను ఏల వదలిపెట్టెనని ప్రశ్నించెను. అతనికి రామతీర్థు డిట్లు బదులు పలికెను: 'ఎవడైనను తన మనోగమనమునకు సజాతీయములగు మనఃప్రవృత్తికలవారితో సరిపెట్టుకొని పోవచ్చును. ఒకనికి ఒకరు సన్నిహితులగుటయనగా అతని తత్త్వము ఏ స్థాయిలో నున్నదో తాముకూడ దానికి సమీపస్థులుగా ఉండుటయే యగునుకాని కేవలము ఒకేఇంటిలో కలిసి నివసించుట కాదు. ఉదాహరణకు:- ఎలుకలు-దోమలు-కలిసిఉండుట లేదా,'

రామతీర్థుడు క్రొత్తసంస్థ నొకదానిని స్థాపించి, దానిద్వారా జాతి నిర్మాణమున తన యభిప్రాయములనుబట్టి కృషిచేయుట మంచిదని కొందరు సూచించిరి. కాని స్వామి దీని కంగీకరింపలేదు. ఇప్పుడున్న సంస్థలన్నియు తనవేయనియు, వానిద్వారా తాను కృషి చేయవచ్చుననియు బదులుచెప్పెను. ఆయన తనమతము నిట్లు వివరించెను: 'హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు - నిజమునకు భారతదేశములోని ఆహారముతో ఏర్పడిన రక్తమాంసము లున్నవా రందరు నా సోదరులే - కాదు - నా స్వరూపమే. వారి నందరిని నా పరిష్వంగమున పట్టుదును. ఏ ఒక్కనిని వదలిపెట్టను.'

ఆరోజులలో ప్రభుత్వము స్వామిని అనుమానించి ఆయనపై ఒకకన్ను వేసియుంచెను. అమెరికానుండి తిరిగివచ్చినపిమ్మట రామతీర్థుడు జాతీయ స్వాతంత్ర్యముపై ప్రసంగించును. స్వాతంత్ర్యముకొఱకు ప్రజలు గొప్ప త్యాగములను చేయవలసియున్నదని చెప్ప నారంభించెను. రాజకీయ పురోగమనమునకుకూడ ఆయన ఎక్కువ ప్రాముఖ్యమిచ్చుచుండెను. ఒకనాటి ఉదయమున రామతీర్థుని చూచుటకు ఇద్దరువ్యక్తులు వచ్చిరి. వారిని చూచుచునే స్వామి నవ్వ నారంభించెను. 'ఎట్టి దాపరికములేక, ప్రతివ్యక్తికిని హృదయమును విప్పిచూపు నన్నుగూర్చి రహస్య పరిశోధన చేయుటకు మీరు వచ్చిరి' అని పలికెను. ఆ వచ్చినవ్యక్తులు ఆయన పాదములపైబడి క్షమింపుడని వేడిరి. తాము తప్పుచేసితిమనియు, వృత్తిధర్మముగా తామచ్చటికి వచ్చితిమనియు వారు చెప్పుకొనిరి. తాము అపరాధపరిశోధకశాఖకు చెందినవారమనియు, స్వామిజాడలను కనిపెట్టిచూచుటకు తామాదేశింపబడితిమనియు విన్నవించుకొనిరి.

ప్రభుత్వదృష్టిలోపడినను రామతీర్థుడు తాను తలచినట్లుచేయుట మానుకొనలేదు. నిజమైన వేదాంతి ఎట్లుండవలెనో ఆతడు తనదేశమున కెట్లు సేవ చేయవలయునో ఆయన ప్రబోధించుచునేయుండెను. శివగుణాచార్యునికి రాజకీయములన్న బొత్తిగా కిట్టవు. ఆతనికి స్వామి ప్రసంగములు దుస్సహముగా ఉండెడివి. ఆతడు భారతదేశములోని రాజులతో పరిచయము పెంపొందించుకొని వారినుండి విరాళములుగా కొంతధనమును ప్రోగుచేసి ఒక ప్రత్యేకసంస్థను ఏర్పాటుచేసి కొంత అధికారమును సంపాదించుట మంచిదని రామతీర్థునకు సలహానిచ్చెను. దీనిలోని ఆంతర్యము రామతీర్థునకు తెలియకపోలేదు. శివగుణాచార్యుడు స్వలాభాపేక్షతో తనను దీనిలోనికి దింపి పిల్లిచేత జీడిగింజలు తీయించదలచినాడని ఆయన వెంటనే గ్రహించెను.

రామతీర్థుడు రాజులతోడిపొత్తు కార్యరూపము ధరింపకుండ పరిహరించి, మెల్లగ మధురనుండి వెడలిపోయెను. తాను ఎన్నుకొన్నమార్గములోనే కృషి జరుగుననియు, దీనిలో రాజులకు, వారి ధనమునకు ప్రసక్తిలేదని ఆయన శివగుణాచార్యునకు ఒక లేఖ వ్రాసెను.

## పుష్కరములో....

రామతీర్థుడు తన నివాసమును పుష్కరమునకు మార్చెను. అచ్చట ఒక సరోవరతీరముననున్న ప్రభుత్వభవనములో ఆయన బసచేసెను. లండను నుండి తిరిగివచ్చినపిమ్మట దక్షిణదేశమున పర్యటించుచున్న నారాయణ స్వామి అచ్చటకువచ్చి స్వామిని కలిసికొనెను. లాహోరునుండి పూర్ణ సింగుకూడ వచ్చిచేరెను. రామతీర్థునిదగ్గర ఒక వెదురుగొట్టము ఉండెడిది. అందులో ఆయన పెనిసిల్లు దాచెడివాడు. అది తన మంత్రదండమనియు దానితో చెఱువులోని మొసళ్లను తరిమివేయుదుననియు చెప్పెడివాడు. ఆ చిన్న వెదురుగొట్టమే తనకున్న ప్రయాణసామగ్రి అని ఆయన అను చుండెడివాడు. ఆ గొట్టమును చేతిలోనుంచికొని, తన సహచరులందరు ఓంకారోచ్చారమొనర్చుచు తనవెంటరాగా స్వామి చాలదూరము నడచి పోవుచుండెడివాడు. ఒకసారి పూర్ణసింగు మొదలగువారినందరను తనతో స్నానముచేయుటకు చెఱువునకు తీసికొనిపోయెను. ఆయనకు ముందర వెదురుగొట్టము నీటిలో తేలుచుండెను. స్వామి మొసళ్ళ అలవాట్లను జాగ్రత్తగా పరిశీలించియున్నవాడు కాబోలు. ఆయన నీటిలో ఒక మునక వైచి లేచి, తన సహచరులను మొసళ్లుకదలి వారివైపునకు వచ్చుచుండెనని హెచ్చరించెను. నిజముగా మొసళ్ళు వచ్చుచుండెను. స్నానముచేయుచున్న ఆ బృందమంతయు ఒక్క ఉదుటున నీటినుండి బయటపడి ఒడ్డుపైకెక్కెను.

రామతీర్థుడు పుష్కరములో మూడువారము లుండెను. తరువాత జయ పూర్‌లో కొద్దికాలముండెను. ఆయన నారాయణస్వామిని సింధు, అఫ్ఘను

స్థానములకుపంపి తాను డార్జిలింగ్ పోయెను. అచ్చటి ప్రకృతిసౌందర్య మాయనకు ఆనందదాయకమయ్యెను. 1905 వ సం॥ ఆగస్టు చివరి రోజులలో ఆయన శ్రీమతి వెల్‌మన్‌కు వ్రాసినలేఖలో ఎవరెస్టు శిఖరమునకెదురుగ తాను గడపిన మూడునెలలలో తాను ఇరువది పుస్తకములు చదివితిననియు ఐదుపుస్తకములు వ్రాసితిననియు వ్రాసెను. మరియు 'వనసీమలలో మానవుడు భగవంతునిసాన్నిధ్యమును పడయుచుండగా, పేరుప్రతిష్ఠ లేల? వాంఛలేల? ఆశలేల? ఐశ్వర్యమేల? కార్యసాధన లేల?' అని వ్రాసెను. సెప్టెంబరునెల ఆరంభములో ఆయన డార్జిలింగువదలి బెంగాలు, బీహారురాష్ట్రములలోని కొన్నిపట్టణములు చూచుటకు పోయెను. అక్టోబరునెలలో లక్నో వెళ్ళి రెండువారము లుండెను. స్వామి అచ్చట పాత్రికేయుడు, పురప్రముఖుడునగు బాబు గంగాప్రసాదవర్మకు అతిథిగా ఉండెను. స్వామి ఉదయములయందు తన నివాసములో నగర విద్యార్థులను కలిసికొనుచుండెను. మధ్యాహ్నములయందు పాఠశాలలలోను కళాశాలలలోను ఉపన్యాసము లిచ్చుచుండెను. సాయంకాలములందు కైసరాబాదులో ఉపన్యాసములు ఇచ్చుచుండెను. అచ్చటకు వేలకొలదిప్రజలువచ్చి ఆయన ఉపన్యాసములను వినుచుండెడివారు. ప్రసంగము ముగిసినపిమ్మట జనసమూహము శ్రీ వర్మ ఇంటివరకు స్వామిని వెంబడించి వచ్చెడిది. విద్యార్థులనుద్దేశించి చేయుప్రసంగములలో ఆయన శరీరవ్యాయామావశ్యకతనుగూర్చియు, మాతృదేశమునకు సేవచేయుటనుగూర్చియు నొక్కి వక్కాణించెడివాడు.

స్వామి విరామములేకుండ పనిచేయుటచే ఆయన ఆరోగ్యము దెబ్బతినెను. స్వామి హరిద్వారమునకు వెళ్ళెనుకాని, ఆరోగ్యమేమియు కుదుటపడలేదు. సింధురాష్ట్రమునుండి తిరిగిరావలసినదని నారాయణునకు వార్త వెళ్ళెను. వైద్యమువలన ఏమియు ప్రయోజనము లేకపోయెను. అందుచే వైద్యము

మార్పించిరి. దీనివలన కొంత మేలయ్యెను. ప్రకృతియే కొంత స్వాస్థ్యము చేకూర్చెను. స్థలము మార్చుకొనుటకు రామతీర్థస్వామి ముజఫరునగరుకు వెళ్ళెను. అచ్చట ఉన్నప్పుడే ఆయన హిమాలయ పశ్చిమభాగములకు పోయి కొంత ఏకాంతము ననుభవించుచు తాను అమెరికాలో ఒసగిన ఉపన్యాసములను గ్రంథరూపమున ప్రకటించుటకు నిశ్చయించుకొనెను. స్వామియు నారాయణయు హరిద్వారము వెళ్ళిరి. ఆ సమయమున మృత్యువు హిమాలయ పర్వతములపై వేచియున్నదనికాని, ఆ భూమీధరశ్రేణి ఆయనను తన శాశ్వతపరిష్వంగమున పట్టనున్నదనికాని ఎవ రెఱుంగుదురు?

# 8. యాత్రాసమాప్తి

రామతీర్థుడు హరిద్వారమునేరి అచ్చట కొద్దికాలముండెను. ఆ పవిత్రప్రదేశ ముతో తనకుగల అనుబంధమును వశీకృతము చేసికొనసాగెను. అచ్చట స్వామి, దేవాలయములను ఘట్టములను దర్శించుచు, పట్టణమును తత్పరి సరముల సౌందర్యమును తిలకించుచు గడపెను. అచట గుంపులుగుంపులుగా నివసించుచున్న సాధువులనుచూచి, వారి పరిస్థితులు మెఱుగుపఱుచుట తాను వెంటనే చేయవలసిన కర్తవ్యమని తలంచెను. తన బోధనలనువిని అనుస రించుటకు వారు చాల తహతహపడుచున్నట్లు ఆయన గ్రహించెను. గంగా నదికి ఆవలిఒడ్డుననున్న చండీమందిరమన్నచో ఆయనకు చాల ప్రీతి యేర్పడెను. ఆ ప్రదేశము చాల ఆరోగ్యకరమైనదని తెలిసికొని, ఆ వేసవిలో తన కాశ్మీరప్రయాణమును మానుకొని స్వామి అచ్చటనే ఉండిపోయెను. హరిద్వారములో ఉన్నకాలమున ఆయన తన మతప్రచారార్థము ఉర్దూలో మూడుగ్రంథములు వ్రాసెను. అచ్చట స్వామి 'ఖునావాదా' అను వాయనను కలిసికొనెను. అతడును రామతీర్థుని నవ్వులలోని ఇంపుసొంపు లకు వశుడైనవాడే. 1905 వ సం॥ నవంబరునెంలో రామతీర్థుడును నారా యణుడును హృషీకేశము వెళ్ళిరి. అచ్చటనుండి రామతీర్థుడు వివిక్తము ప్రశాంతమువగు ప్రదేశమున నివసింపగోరి, అట్టి ప్రదేశముకొఱకు వెదకు కొనుచు బదరీనాథమువైపునకు పోయెను. నారాయణుడు పుస్తకములు, తదితరవస్తువులు తీసికొని తరువాత వచ్చుటకు నిర్ణయించుకొనిరి. రామ తీర్థుడు అన్వేషించుచున్న ప్రదేశము ఒకచోట గోచరించెను. దానికి వ్యాసా శ్రమము అనిపేరు. అది హృషీకేశమునకు ముప్పదిమైళ్ళదూరమున గంగా వ్యాసగంగలు కలియుచోట ఉన్నది. అది చాల దుర్గమమైనప్రదేశము. అచ్చటికి 'పింగూనా' సాయమునకాని చేరుటకు సాధ్యముకాదు. నదికి

అర్ధముగా తీరములందు ఇటు నటు రెండు పెద్ద బండరాళ్లకు బిగించిన మోటైన పగ్గమునకు వ్రేలాడు ఒక బొక్కెనకు 'ఫింగూరా' అని పేరు. ఈ ప్రదేశములో అరమైలున కొక్కటిచొప్పున మూడు కుటీరములున్నవి. అచ్చట సాధువులు ఎవరికివారు విడివిడిగా ఉండవచ్చును కాని భోజనశాల మాత్రము అందరకుకలిపి ఒక్కటే ఉండును. 'కాళీకంబళి' నివాసియగు రామనాథబాబా వారందరికి ఆహారపదార్థములు పంపుచుండును. రామతీర్థుడు క్షౌరము చేసికొనుట మానివేసెను.

రామతీర్థస్వామి చివరిసారి హరిద్వారములో ఉన్నప్పుడు, ఆయన సంస్కృత వ్యాకరణమును వేదములను కూలంకషముగా అధ్యయనముచేయుట చాల అవశ్యకమని ఎవరో చెప్పిరట. తన పాండిత్యములోని ఈ లోపమును పూరించుకొనుటకు రామతీర్థుడు నిశ్చయించుకొనెను. కొన్ని నెలలలో ఆయన వేదవాఙ్మయమునంతను అవగతము చేసికొనెను. పూర్తిసింగు 'ఆయన ఇప్పుడు వేదముల సంప్రదాయార్థవిజ్ఞానమును, పాశ్చాత్య విమర్శన, పరిశోధనపద్ధతు లను తనయందు మేళవించుకొనెను' అని తెలిపెను. ఏమయినను ఈ అధ్యయనమువలన రామతీర్థుని విహంగోచితమైన స్వేచ్ఛోల్లాసప్రవృత్తి కొంత మందగించినదనియే చెప్పవలెను. ఆయన వేదములు తిరుగులేని అమోఘవాక్కు లనుకొనువారితోగాని, ఆధునిక విజ్ఞానశాస్త్రమంతయు వేద ములయందే ఉన్నదనెడువారితోగాని, ఏకీభవించెడివాడుకాడు. ఆయనకు ప్రాచ్యసంస్కృతి పరిశోధకులన్నచో ఒక మెప్పుదల ఏర్పడెను. జగద్గురు శంకరాచార్యులవారే వేదవాఙ్మయమునకు సరియగు మార్గదర్శకులని ఆయన తలంచెను.

1906 సం॥ ఫిబ్రవరినెలలో స్వామి మరింత వివిక్తముగను చల్లగను ఉండు ప్రదేశమునకు తన నివాసమును మార్చదలచెను. ఆయనయు, నారా యణుడును తేహరీకి వెళ్ళిరి. తేహరీ మహారాజా వారికి హృదయపూర్వక

నముగా స్వాగతమిచ్చెను. అచ్చట వారు మహారాజునకు అతిథులుగా కొన్నా ళ్లుండిరి. స్వామితలంపునకు అనుకూలముగా ఉండు ప్రదేశము 'వశిష్ఠాశ్రమ' మని అచ్చటివారు చెప్పిరి. అది తేహరీకి ఏబది మైళ్ళదూరమున 12000-13000 అడుగుల ఎత్తుననున్నది. 'కాళికంబాళి' యాజమాన్యమున వారి భోజనపుటేర్పాట్లు జరిగినంతవఱకు బాగుగనే ఉన్నది కాని 1906 మార్చిలో వీరు తొలుత తేహరీకి, పిమ్మట వశిష్ఠాశ్రమమునకు వెళ్లుటచే ఇబ్బందిపడ వలసివచ్చెను. రామతీర్థస్వామి వశిష్ఠాశ్రమములో ఒకనెల గడపినపిమ్మట చాల జబ్బుపడెను. ఆయనవెంట వచ్చిన వంటవాడుకూడ జబ్బుపడెను. అచ్చట తమతువికి ఇబ్బందులతో ఆరంభమైనను రామతీర్థున కా ప్రదేశమును వదలిపెట్టుటకు మనసొప్పలేదు. అచ్చట మంచుబాధ లేదు. ఆయనయున్న గుహకు దిగువగా ఒక ఏరు ప్రవహించుచుండెను. దానినుండి దూరు వదారు చిన్నచిన్న జలపాతములవలన సహజసరస్సులు ఏర్పడినవి. అచ్చటి కొండలపైన దేవదారువృక్షము లధికముగా నున్నవి. ప్రతిదినము ఒక యువకుడు స్వామికి వంటచేసిపెట్టి, రాత్రులు అచ్చటికి మూడుమైళ్ళదూర మునన్న ఒక పల్లెకు పోవుచుండెడివాడు. ఈ ప్రదేశమునుండిచూచినచో, అర్ధచంద్రాకృతిలో కేదారనాథము, బదరీనాథము, సుమేరువు, కైలాసము, గంగోత్రి-యమునోత్రి-చక్కగా కనబడుచుండును.

'ఈ సుందరారణ్యములో నేను పాటలు పాడుకొందును. నవ్వుదును. చప్పట్లు చఱచుచు నృత్యము చేయుదును' అని స్వామి అనుచుండెడివాడు. ఆ ప్రదేశమున పెద్దపెద్ద గులాబిపొదలు. పలువిధములైన ఫలవృక్షములు కలవు.

వర్షమువచ్చినచో స్వామి నివసించుచున్న గుహ నీటితో నిండిపోయెడిది. ఇది ఒక్కటియే అచ్చటనున్న పెద్ద యిబ్బంది. వర్షము వచ్చినపుడు ఆయన గుహకు దిగువనున్న పచ్చికబయలునకు దిగివచ్చెడివాడు. అచ్చటనున్న

పశువులకాపరులు ఆయన కొక కుటీరమును నిర్మించియిచ్చిరి. ఇది కొంత బాగుగనే ఉన్నదికాని పెద్దవర్షమువచ్చినచో కుటీరముకూడ ఆగుహవలెనే ఉండెడిది. ఒకనాటిరాత్రి వర్షము కురియుచుండగా స్వామి తన పుస్తకము లకు, వస్త్రములకు గొడుగుపట్టి తెల్లవారువరకు కూర్చుండెను. వర్షము లేనప్పుడుమాత్రము అచ్చట చాల అనుకూలముగా ఉండును. కూలివాండ్రు, ఇతరులు ఆ పరిసరములయందు వనమూలికలను సంగ్రహించుకొనుచుండుట స్వామి పెక్కుసారులు చూచెను. ఆ ప్రదేశమున పండిన ధాన్యమునే స్వామి భోజనమున కుపయోగించెడివాడు. ఈ ఆహారము ఆయనకు సరిపడక మరల జబ్బుచేసెను. ఆయనకు జ్వరము, విరేచనములు పట్టుకొన్నవి. నారాయణు డచ్చటికి వచ్చుసరికి స్వామి చాల కృశించియుండెను. అచ్చటి తిండితిని నారాయణుడుకూడ జబ్బుపడెను. అందుచే ఆ బృందము వారందరు అచ్చటి కైదుమైళ్ళ ఎగువకుపోయిరి. ఆ ప్రదేశము చాల అందముగా ఉన్నది. స్వామి దానికి 'గంధర్వోద్యానము' అని పేరుపెట్టెను. స్వామి ఇంకను ఎగువకుపోయెను. కాని ఆయనకు ఉదరవ్యాధి తగ్గలేదు. ఆయన పాలు మాత్రము తీసికొనుచుండెను. ఇచ్చట స్వామికి తరుచుగా ఒక సింహము, ఒక కొండచిలువ కనబడుచుండెడివి. కాని అవి ఆయన నేమియు చేయ లేదు. ఇచ్చటకూడ వర్షములసీడ తప్పలేదు. ఒకసారి ఒక వారమురోజులు ఎడతెఱపిలేకుండ వర్షము కురిసెను. స్వామి ఆ వారమురోజులు వాననీళ్ళతో నిండిన ఒక గుహలో గడపెను. తరువాత ఆయన తన నివాసము మార్చెను. అచ్చట చాలమంది గొఱ్ఱెలకాపరు లుండిరి. వారు స్వామికి ఒక కుటీరమును ఏర్పాటుచేసిరి.

కొన్నిదినములపిమ్మట పూర్ణసింగు అచ్చటికి వచ్చెను. రామతీర్థుడు కృశించి చాల నీరసపడియుండెను. నడచునప్పుడు తూలిపోవుచుండెను. ఆయనకు సహజమైన ఉల్లాసము ఇప్పు డాయనముఖములో కానవచ్చుట

లేదు. పూర్ణసింగు 'మీరు విచారముతో నుంకిరేమి? మునుపటివలె మీలో ఉత్సాహోల్లాసములు కానవచ్చుటలేదే?' అని ప్రశ్నింపగా రామతీర్థుడు తన స్థితి నిట్లు వివరించెను—

'ప్రపంచము నా మంచి పువ్వులే కోరును. వారా ఫలములనే అనుభవింతురు. నేను వారికి నిత్యవసంతముగా ఉండవలయును. కాని అంతరాంతరములయందు, చీకటికోణములలో ఆ పువ్వులకు జీవదానముచేయు మూలములలో నే నెంత మథనపడుచుంటినో వారికి తెలియదు. ఇప్పు డట్టి మూలములలో ఉన్నాను. ప్రపంచమునకు మన భావములను వెదజల్లుటయనెడు బాణసంచాలు కాల్చుటకంటె మౌనముగా ఉండుటయే ఉత్తమమయిన పని'—

రామతీర్థుడు తన శరీరమునుగూర్చి ఏమియు పట్టించుకొనక, రోజుల కొలది పద్మాసనమువేసికొని కూర్చుండసాగెను. ఆయన 'ప్రపంచము ఉన్నదని ఎవరు చెప్పిరి? అది ఇంతకుముందు లేదు. ఇప్పుడు లేదు. ఇటుపైని ఉండబోదు' అనుచుండెడివాడు. తత్త్వశాస్త్రాధ్యయనము గాఢమగుచున్న కొలది ఆయన అంతకంతకు చింతాక్రాంతుడు కాజొచ్చెను. పూర్ణసింగు పెండ్లిచేసికొని గృహస్థజీవితమున స్థిరపడినందులకు స్వామి మెచ్చుకొనెను. పిమ్మట తనభార్య హరిద్వారమునకు వచ్చుట జ్ఞప్తిచేసికొని స్వామి ఇట్లనెను: 'బ్రహ్మానందుని తల్లిముఖమున ఎట్టి దివ్యతేజము ఉట్టిపడుచుండెను! ఆనా డామె రూపాంతరము పొందినట్లుండెను.' ఆమె హరిద్వారము రాగా, స్వామి ఆమెను తిరిగి పంపివేయుమని పూర్ణసింగుతో చెప్పెను. స్వామి ఆజ్ఞవిని పూర్ణసింగునకు కోపమువచ్చెను. అప్పుడు స్వామి తానుధరించు కాషాయవస్త్రములు నిర్దేశించు నియమములను తాను పాటించుచుంటినని సమాధానము చెప్పెను. లాంఛనప్రాయముగ ఇట్లు నిరాకరించినను రామతీర్థుడు భార్యయెడల తన అనుబంధమును మరచి

పోలేదు. ఆయన పూర్ణసింగుతో 'ఆధ్యాత్మికవికాసము అనగా జడత్వము కాదు. వికాసము అధికమగుచున్నకొలది అనుభవము పెరుగుచుండును. వస్త్రములు కాషాయవస్త్రములు విముక్తికి చిహ్నములు కావు. వేసవి పర్వత ప్రాంతములు విడిచిపెట్టినప్పుడు విందుసభలో ఈ కావిగుడ్డలను చింపి ప్రోగులు పెట్టెదను' అనెను. తరువాత కొద్దికాలమునకు తాను చెప్పినట్లే స్వామి కాషాయవస్త్రములను విసర్జించి వానికిబదులు లాగు, అంగీ, గొఱ్ఱె బొచ్చుతోచేసిన ముదురుగోధుమరంగు తలపాగ-ధరింపసాగెను.

పూర్ణసింగు స్వామిలో వచ్చిన మరియొకమార్పునుగూడ గమనించెను. ఆయన నిరంతరము గ్రంథపఠనము చేసెడువాడుకదా! పూర్ణసింగు వచ్చినపుడు కొన్ని క్రొత్తగ్రంథములు తెచ్చెను. అందులో ఒకటితీసి అతడు స్వామిచేతి కిచ్చెడివాడు. కాని ఆయన దానిని చదువుటయే జరిగెడిది కాదు. ఒక్కొక్కప్పుడు ఆయనచేతినుండి పుస్తకము క్రిందపడిపోయెడిది. ఇది పూర్ణసింగునకు చాల ఆశ్చర్యము కలిగించెను. అతని కన్నులవెంట నీళ్లు వచ్చి 'రాముడు ఇక ఏమియు చదువలేడు' అనుకొనెను.

ఈ స్థితికి హేతువు అమితమైన అలసటయో లేక గాఢమగు ఆత్మనిమగ్నతయో పూర్ణసింగునకు అర్థము కాలేదు. కాని నారాయణుడు స్వామి తీసికొనుచున్న సరిలేని ఆహారము, అజీర్ణవ్యాధి కారణములని తెల్పెను. అనారోగ్యకరమైన ఇట్టి ఆహారము తీసికొనుటవలన ప్రయోజనములేదనియు, ఏదైన పట్టణమునకు పోవుదమనియు, లేనిచో బిచ్చమెత్తికాని, ఏ స్నేహితుని సాయముతోగాని మంచి ఆహారపదార్థములను తెచ్చియిచ్చుటకు అనుమతింపుడని నారాయణుడు స్వామిని ప్రార్థించెను. అతని విన్నపవాక్యములు విని స్వామి చివరకెట్లో తేహరీకిపోవుట కంగీకరించెను. స్వామి పుస్తకములను తరలించు ఏర్పాటుకొఱకు నారాయణుడు ముందుగా బయలుదేరవలసియుండెను. పూర్ణసింగు పెట్టుకొన్న తలంపు పూర్తికావచ్చుటచే

అతడును తన ఉద్యోగములో చేరవలసియుండెను. అందుచే వారిద్దరును కలిసి పోవుటకు నిశ్చయించుకొనిరి. 1906 వ సం॥ సెప్టెంబరునెలలో ఆశ్రమము నుండి పూర్ణసింగు బయలుదేరురోజున స్వామి తన్ను ఏటికి స్నానము చేయుటకు తీసికొనిపొమ్మని అతనిని కోరెను. ఆ ఉదంతమునుగూర్చి పూర్ణ సింగు ఇట్లు వ్రాసెను: 'రామతీర్థుని నారికేళభిక్షాపాత్రను, తుండుగుడ్డను తీసికొని నేను ఆయనవెంట ఏటికి వెళ్ళితిని. ఆయనకు ఏపనిచేయుటకు ఇష్ట మున్నట్లు లేదు. ఆయన పైబట్టలను నేనే విప్పితిని. స్వామి నీటిలోనికి దిగినపిమ్మట నా చేతులతో స్నానము చేయించితిని. మేము తిరిగి కుటీరము నకు వచ్చునరికి నేను బయలుదేరు సమయమైనది. ఆయన నాతో ఇట్లనెను: 'పూరణ్ జీ! నీవు ఎచ్చటికివెళ్ళినను అంతర్జ్యోతి అనెడి స్వర్ణభూములలోనే ఉండుము. రాము దారంభించినపని నీవు కొనసాగింపుము. రామున కిప్పుడు మౌన మవలంబించుసమయము వచ్చినది' అనెను. ఇదివిని పూర్ణ సింగు 'నేను మరల మిమ్ము చూచుటకు వచ్చినప్పుడు మీచేత మాట్లాడించి తీరెదను చూడుడు' అని నవ్వుచు అనగా, స్వామి 'మౌనవ్రతుని ఎవరు మాట్లాడింపగలరు?' అనెను.

రామతీర్థుడు కొండదిగి చాలదూరమువచ్చి పూర్ణసింగునకు వీడ్కో లిచ్చెను. ఆ సందర్భమును పూర్ణసింగు ఇట్లు వివరించెను: 'స్వామి ఒంటి మీద కౌపీనముతప్ప వేరు ఆచ్ఛాదనమేమియు లేదు. ఏటినుండి బయటకు వచ్చినప్పుడు ఆయన ఎట్లుండెనో ఇప్పుడును అట్లే ఉండెను. ఇంతలో చినుకులుపడ నారంభించెను. ఆయన అప్పుడు పలికినమాటలకు నేను భయ ముతో వణకిపోయితిని. ఆయన ఇట్లనెను: 'పూరణ్ జీ! నీవు రాముని పరిస్థితి చూచితివి. త్వరలో అతని లేఖని ఆగిపోవును అతనివాలుక మూగ పోవును. రాముడు నిన్ను ఇక కలిసికొనకపోవచ్చును. లేదా తిరిగి పట్టణ ప్రాంతములకు రాకపోవచ్చును. మీరే రాముడు కావలయును. రామునిలో

లీనము కావలెను. చదువుడు-వ్రాయుడు-కృషి చేయుడు-రామునిపై ఏమియు ఆశలు పెట్టుకొనవద్దు'-పూర్ణసింగుకన్నులలో నీళ్ళు తిరిగినవి. అతడు మెలపు తీసికొని వంగి నమస్కరించినంతనే స్వామి హఠాత్తుగా కొండవైపునకు పరుగెత్తసాగెను. ఆయన ఒక్కసారికూడ వెనుదిరిగిచూడలేదు. ఈవిధమున స్వామి పూర్ణసింగుతోడి తన అనుబంధములన్నిటిని త్రెంచుకొననెంచెను కాబోలు!

తరువాత కొన్నాళ్లకు నారాయణునికి నీదోక్కలుకూడ అదేవిధముగా జరిగెను. అతడు స్వామిపుస్తకములను తేహరీకి తీసికొనిపోవుటకు కూలివాండ్రను తీసికొనివచ్చెను. పుస్తకములను తరలించుకొని ఒక వారము రోజులకు తేహరీ చేరుకొని అతడు స్వామిని దర్శించెను. తేహరీ మహారాజా స్వామికి తోటలో నివాసము ఏర్పాటుచేసెను. అచ్చట పదునైదురోజులున్న తరువాత స్వామి తాను నివసించుటకు గంగాతీరమున ఒక మంచిప్రదేశము కొఱకు చూడసాగెను. చివరకు ఆయన కొక ప్రదేశము పొడగట్టెను. అది త్రిభుజాకారముగ నున్నది. అచ్చట పూర్వము ఒక పెద్ద ఆశ్రమముండెడిది. ఇప్పటికిని అచ్చట నివాసయోగ్యమైన ఒక కుటీరమున్నది. మహారాజునకు ఈ సంగతి తెలిసినది. ఆయన తన భవననిర్మాణశాఖోద్యోగులను అచ్చటికి పంపి స్వామిచెప్పినపద్ధతులలో ఒక కుటీరమును నిర్మింప నాజ్ఞాపించెను. మహారాజుచేసిన ఏర్పాటు తెలిసికొన్న రామతీర్థస్వామి ఇట్లనెను: 'ఈ కుటీరము ఆకృతిధరించిన భక్తి. రాముడు తన యీ రాజ్యమును వదలిపోడు. అతనిశరీరము చివరవఱకు ఇచ్చటనే ఉండును.'

స్వామి ఇప్పుడు నారాయణునికి తగిన నివాసముకొఱకు ఆలోచింపసాగెను. అచ్చటకు మూడుమైళ్ళదూరమున పూర్వము స్వామి నివసించిన గుహ ఉన్నది. ఆ గుహలో నివసించుచుండుమని స్వామి నారాయణునితో చెప్పెను. నారాయణుడు తన పుస్తకములను, పక్క బట్టలను పర్దుకొని

స్వామియొద్ద సెలవుతీసికొనుటకు వెళ్ళెను. ఆయన అతనిని సాగనంపుటకు వచ్చెను. ఆయనకాళ్ళకు చెప్పులు లేవు. తలపై ఆచ్ఛాదనము లేదు. కొంత దూరమువచ్చి స్వామి ఒక దీర్ఘనిశ్వాసము విడిచి నారాయణుని తదేక దృష్టితో కొంతతడవుచూచి ఇట్లనెను :

'నాయనా ! రాముడు త్వరలో మౌనము అవలంబించును. అతని లేఖిని, నాలుక పనిచేయవు. రాముని శరీరము నానాటికి కృశించుచున్నది. అతని మనస్సు ఈ ప్రపంచమువల్ల విసిగిపోయినది. అతనికి దేనియందు అపేక్ష లేదు. అతనికి తిరిగి పట్టణములకు పోవలయుననన్న తలంపులేదు. రాముని శరీరము త్వరలో నిష్క్రియమైపోయినను ఆశ్చర్యములేదు. అతడు గంగో త్రంగము నెన్నడును వదలిపెట్టడు. రాముని ఎవరైన ఆహ్వానించినచో అతని ప్రతినిధిగా నీవు పోవుచుండుము. ఇప్పుడు నీ గుహకుపొమ్ము. ఏకాంతసాధన చేయుచుండుము. రామునిలోనికి చొచ్చుకొనిపోయి వేదాంతివై వెలుపలికి రమ్ము. నీకు దుఃఖము ఉండరాదు. క్లేశము ఉండరాదు. చింత ఉండరాదు. రాముడు నీతోడనే, నీయందే ఉన్నాడనుకొనుము. అతడే నీ శరీరము - అతడే నీ మనస్సు - అతడే నీ సర్వస్వము - అతడే నీవు-నీ ఏకాంతమునుండి వెలువడినపిమ్మట నీవు రామునివలెనే ఉండుము.'

నారాయణుని దుఃఖమునకు మితిలేదు. అతడు భోరున ఏడ్చుచు స్వామి పాదములపై బడెను. ఆయన అతనిని లేవనెత్తి ఓదార్చెను. ఇప్పుడు స్వామికి కన్నీళ్ళు తిరిగినవి. ఇట్లొకరినొకరు బాష్పాకులితనేత్రులై చూచుకొనుచు నిలిచిరి. స్వామి నారాయణుని గుహకు పొమ్మని వీడ్కొలిచ్చి ప్రతి ఆదివారము తనను చూచుటకు కుటీరమునకు వచ్చుచుండుమని చెప్పెను. స్వామి మరల ఇట్లనెను : 'నీవు అచ్చట ఉన్నప్పుడు రామునితోడి శారీరక వియోగమునకు మనస్సున దిగులుపడకుము. అతనిశరీరము త్వరలో జడత్వము తాల్చును. దాని పరిచర్యకై నీవు ఆలోచింపవద్దు. నీ అభివృద్ధి నీవు

చూచుకొనుము. ఇతరులసాయ మపేక్షింపవద్దు. స్వశ_క్తిపై ఆధారపడుము. మూ_ర్తిదాల్చిన వేదాంతమవై, నీలో నీవు సుస్థిరుడవై, అచంచలుడవై లోకములోనికి చొచ్చుకొనిపొమ్ము.'

నారాయణుడు క్రుంగిపోయెను. కళవళపడెను. ఇదియంతయు ఏమి? దీని కర్థమేమి? రాముడు తనశరీరమును పరిత్యజింపదలచెనా? లేక దీర్ఘసమాధి లోనికి పోవునా? నారాయణుడు తనగుహలో కూర్చుండి స్వామి వీడ్కోలు ఇచ్చినపుడు చెప్పినమాటలను మననము చేయుచుండెను. ఐదురోజులు గడచినపిమ్మట స్వామియొద్దనుండి ఈ సందేశము వచ్చెను: 'ఆత్మసాంవశ్యము - అభ్యుదయబంధము - ఒకటి రెండు రోజులలో ముగిసిపోవును. ఆదివారమునాడు రమ్ము' సందేశము శుక్రవారమునా డందినది. నారాయణుడు స్వామిని ఎప్పుడు పోయిచూతునాయని తహతహ లాడుచుండెను. మరునాడు శనివారము. ఆనాటిసాయంకాలము మహారాజానొద్దనుండి ఒక భృత్యుడువచ్చి నారాయణునితో 'మహారాజా మిమ్ము పిలుచుకొనిరమ్మనిరి' అని చెప్పగా, అతడు 'కారణమేమైయుండును' అనగా ఆ భృత్యుడు 'తల్లి గంగాభవాని స్వామిని తీసికొనిపోయెను. ఈ వా_ర్త మీకు చెప్పిరమ్మని నన్ను పంపిరి' అనెను.

నారాయణుడు నిశ్చేష్టుడయ్యెను. అతడు తేహరివఱకు ఐంచుమించు పరుగెత్తుచునే పోయెను. రాత్రి ఎనిమిదిగంటలవేళకు తేహరి చేరుకొనెను. పట్టణమంతయు దుఃఖసముద్రమున మునిగియుండెను. మృత్యువువంటి నిశ్శబ్దము ఎల్లెడల ఆవరించిఉండెను. నారాయణు డెట్లో నిలువ్రదొక్కుకొని వేదాంతికి సహజమగు సంయమనము నవలంబించి, స్వామికి వంటచేయు నతనియొద్దకుపోయి, గొంతు పెగుల్చుకొని 'మన రామున కేమయ్యెను?' అనెను. జరిగినవృత్తాంతమును వంటవా డిట్లు వివరించెను.

'నేనును స్వామియు నదిలో స్నానముచేయుటకు వెళ్ళితిమి. నేను ముందు స్నానముచేసితిని. స్వామి ఒడ్డునయున్న ఒక బండరాతిపై వ్యాయామము చేయుచుండెను. పదునైదునిముసములు గడచిపోయినవి. ఒడలు మర్దనము చేసికొని, ఆయన నీటిలోనికి దిగెను. అచ్చట ప్రవాహము చాల వేగముగా నుండెను. స్వామి నీటిలో కంఠములోతునకు వెళ్లెను. నేను ఇంక ముందునకు పోవద్దని ఆయనను ప్రార్థించితిని. స్వామి 'భయపడకుము. నాకు ఈతవచ్చును' అని నాకు సమాధానముచెప్పి నీటిలో ఒక మునకవైచి లేచెను. కొద్దినిముసములకు మరల ఒకసారి మునిగెను. ప్రవాహవేగమునకు ఆయన కాళ్లక్రింద రాయి తొలగిపోయెనుకాబోలు. ఆయన పట్టుతప్పి ప్రవాహమునబడి కొట్టుకొనిపోవుచుండెను. అట్లు కొట్టుకొనిపోయి ఒక సుడిగుండములో చిక్కుకొనెను. నేను సాహాయ్యముకొఱకు కేకలు పెట్టితిని. కాని స్వామి "ఊరక ఆందోళనపడకుము. నేను ఈదుకొని బయటకు రాగలను' అని ధైర్యముగా కేకవేసెను. ఆయన శక్తి కొలది ప్రయత్నించి బహుకష్టమున బయటపడగలిగెను. కాని ప్రవాహవేగము మరల ఆయనను సుడిగుండములో త్రోసెను. నేను పరిస్థితి విషమించినదని గ్రహించి, ఆందోళనపడి సాయముకొఱకు కేకలుపెట్టుచు ఇటు నటు పరుగులుపెట్టసాగితిని. ఆ చుట్టుప్రక్కల మనుష్యసంచారమే లేదు. ఆరోజున, ఎచ్చటకో పర్యటనకువెళ్ళిన మహారాజు నగరమునకు తిరిగి వచ్చుచుండెనట; ఆయనకు స్వాగతమిచ్చుటకు ఊరిలోనివారందరు అచ్చటికి పోయిరి కాబోలు. స్వామి మరల సుడిగుండమునుండి బయటపడుట చూచితినిగాని ఆయన అప్పుడు నట్టనడియేట నుండెను. అచ్చట ప్రవాహము మహావేగముగా ఉన్నది ఆయన శ్వాస పట్టలేకుండెను. నీరు త్రాగుచుండెను. అప్పు డాయన బిగ్గరగా ఇట్లనుకొనుచుండుట వింటిని-'నీ తల్లిని స్మరింపుము. ఇట్లు పోవుటయే నీకు వ్రాసిపెట్టియున్నచో ఇట్లే పొమ్ము'-

ఆయన ఒకటి రెండుసార్లు ఓంకారోచ్చారణము చేసెను. ఆయనశరీరము పీటపై తేలి ఏటివాలున రెండువందలగజములమేర పోయెను. అప్పుడు, గుహకు కొద్దిదూరమున, ఒక సుడిగుండము ఆ కళేబరమును లోనికి గుంజు కొనెను. ఇక శరీరము కనబడలేదు. అదేసమయమున ఊరిలో మహారాజు నకు స్వాగతసూచకముగా ఒనగుచున్న శతఘ్నిసంరావము వినవచ్చెను.'

ఆరోజు 1906 వ సం॥ అక్టోబరు 17 వ తేది. అనాడు దీపావళి. ఆనాటికి రామతీర్థునకు 33 సంవత్సరములు నిండినవన్నమాట. (ప్రజలాలు గోసాయి లెక్కప్రకారము 36 సంవత్సరములు). ఒకవారమురోజుల తరు వాత సుడిగుండములోనికి గుంజుకొనినచోటనే కళేబరము పీటపై తేలుచు కనబడినది. కాళ్లు పద్మాసనము వేసికొనిన ట్లుండెను. చేతులు వ్రేళ్ళనందున ఒకదానిలో నొకటి చేరియుండెను. వెన్నెముకయు మెడయు నిటారుగా ఉన్నవి. కన్నులు మూతలువడినవి. ఓంకారోచ్చారణము చేయుచున్నట్లు పెదవులు కొంచెము విచ్చుకొనిఉన్నవి. ఇట్టి సమాధిభంగిమలో ఆ కళే బరము ఉన్నదని అప్పుడు చూచినవారు చెప్పిరి. ఆ దినమున తేహరీరాష్ట్ర ములో కార్యాలయములన్నియు మూసివేయబడెను. కళేబరమును శవపేటిక యందుంచి అంత్యక్రియలకై గంగానదికి కొనిపోయిరి. స్వామికి అత్యంత ప్రేమపాత్రయగు భాగీరథీ మహామోహినికి పీనుగుబంధ అర్పింపబడెను.

స్వామియొద్దనున్న వంటవానిపేరు భోలాదత్తు. అతడు తన యజమాని చివరిగడియలు ఎట్లుగడచెనో తెలిపెను. రామతీర్థస్వామి ఉదయముననే లేచి తొందరతొందరగా ఏదియో వ్రాసికొనుచు కూర్చుండెను. ఆయన కన్నుల నుండి కన్నీరు కాల్వలు కట్టుచుండెను. 11 గంటలకు భోలాదత్తు స్వామి యున్నగదిలోనికి వెళ్ళెను. ఆయన ఈతని ఉనికిని గమనింపనేలేదు. దత్తు చాలసేపు ఆ గదిలో నిల్చుండెను. భోజనము సిద్ధమైనదని స్వామికి చెప్పుట కాతడు వెళ్లెను. కాని భోలా వెళ్లునరికి స్వామికనులు మూతలుపడియుండెను.

ఆయన చేతులనుండి కాగితములు, కలము, క్రమముగా జారిపడిపోయెను. మరికొద్దిసేపు ఆగి అతడు మెల్లగా 'మహరాజ్! తమ భోజనము సిద్ధముగా ఉన్నది' అనెను. సమాధానము లేదు. భోలాదత్తునకు ఆకలి అధికముగా ఉన్నది. అందుచే అతడు మరల కొంచెము గట్టిగా ఆ మాటలే అనెను. రాముడు కనులుతెఱచి 'ఏమి సంగతి?' అనెను. భోలా అప్పుడు సమయ మెంతైనదో తెలిపి, 'మీకు స్నానమునకు నీరు తీసికొనివత్తునా? లేక, తాము ఈరోజున నదికి వెళ్ళెదురా?' అని అడిగెను. కొద్దిరోజులకు పూర్వము వ్యాయామములో మోకాలునొప్పి పట్టుటచే స్వామి నదికిపోలేక కుటీరమునకు నీరు తెప్పించుకొనుచుండెను. రాముడు భోలాను 'నీవు భోజనము చేసితివా' అని అడిగెను. అతడు 'నేడు దీపావళి - స్నానము చేసి భోజనము చేయుదును' అనెను. నాడమావాస్యయు, సంక్రాంతియు (విక్రమమాసమున తొలిరోజు) అగుటచే స్వామి గంగానదికి వెళ్ళి స్నానము చేయవలెనని తలంచెను. కాని ఆనాటిస్నానమే ఆయన ప్రాణములు తీయునని ఎవరును ఎఱుగరు.

తన జీవితమిట్లు ముగియునని రామతీర్థునకు ముందుగా తెలియునా? ఆయన మరణము ప్రమాదవశమున సంఘటిల్లినదా? లేక ఆయనయే కోరి తన జీవితము నట్లు ముగించుకొనెనా? స్వామి నిర్యాణమునుగూర్చి పలువురు పలువిధములుగా ఊహింప నారంభించిరి. కొందరు అది ప్రమాదవశమున సంభవించియుండునని భావించిరి. కొందరు ఆయన కోరి అట్లు చేసికొనెనని తలంచిరి. ఆయన మరణించుటకు కొన్ని గంటలముందు వ్రాసినవ్యాసములో ఇట్టి ఊహను వ్యక్తము చేసెనని అర్థములు తీయసాగిరి. ఆ వ్రాతలలో తన్ను తీసికొమ్మని మృత్యువును స్వామి ప్రార్థించినాడని ఊహింపసాగిరి. 'నాకు చాలినన్ని శరీరములున్నవి' అని ఆయన వ్రాసెనట! ఈ మాటలలో అట్టి అర్థమును స్వామి ఉద్దేశించెననుటకు పూర్ణసింగు అంగీకరింపలేదు.

ఇది ఆయన సహజధోరణి. కాని అట్లగుట కేవలము కాకతాళీయమే యైనచో అది ఒక విచిత్రసంఘటనమే యని చెప్పక తప్పదు. రామతీర్థుడు తనకు మృత్యు వాసన్నమగుచున్నదని సూచించినసందర్భములు లేకపోలేదు. ఇట్టి మాటలు ఆయన పూర్ణసింగుతోను, నారాయణునితోనుకూడ అనుచుండెడి వాడు. ఆయన శిష్యురాలైన శ్రీమతి వెల్మన్‌కుకూడ ఈ యభిప్రాయమే కలదు. ఆమె భారతదేశమునకు వచ్చినపుడు వ్యాసాశ్రమములోనున్న స్వామిని దర్శించుటకు పోయెను. ఆమె ఆయనతో ప్రసంగించి సెలవు తీసి కొనువేళకు సూర్యాస్తమయమగుచుండెను. స్వామి ఆమెతో ఇట్లనెను: 'అదిగో. సూర్యు డస్తమించుచున్నాడు. చూడుము. అతడే రాముడు. సెలవు' ఆమె నిట్టూర్చి తనలో తా నిట్లనుకొనెను. 'ఈయనను భారత దేశము కోల్పోయినది. రామతీర్థస్వామి ఇక పర్వతములనుండి తిరిగి రాడు. అంతయు అయిపోయినది'. అప్పటికి కొన్నినెలలకు ముందునుండి ఆయన మనస్సులో మృత్యువునుగూర్చిన భావములు ముసురుకొనదొడ్గినవి. ఆయన మనస్సు అలసిపోయినది. అది క్రుంగిపోవసాగెను. ఆయన అనుచరు లిది గమనించిరి కాని, వారికి కారణము తెలియకపోవుటచే తన్నివారణమునకు యత్నింపరైరి. నారాయణుడు మరియొకరీతిగా తలపోసెను: రాముని శరీరము శిథిలపడినది. అందుచే ఆయన దానితో ఇక ప్రయోజనము లేదను కొని గంగాదేవి కర్పించెను-అని అతని ఊహ. కాని స్వామికి కలిగిన ఆత్మానుభవానందము అతివేలమై ఆయనకీ పాంచభౌతిక శరీరము భారముగా తోచెనని అనుకొనవచ్చును. అందుచేత ఆయన తనశరీరమును తీసికొని బొమ్మని మృత్యువును వేడెను. కాని వంటవాడు చెప్పినవిషయము ఇట్లను కొనుటకు ప్రతిబంధకముగా ఉన్నది. స్వామి సుడిగుండములో చిక్కు కొన్నప్పుడు ఆయన ఎంతయో కొట్టుమిట్టాడి సర్వశక్తిని గూడకట్టుకొని

దానినుండి బయటపడుటకు యత్నించియు ప్రయోజనములేక చివరకు ప్రవాహమున బడిపోయెను-అనికదా వంటవాని కథనము?

స్వామి ఆత్మహత్య చేసికొనెనని చెప్పుటకు అనుకూలముగాను, ప్రతికూలముగానుకూడ ఉన్నవాక్యములు ఆయన రచనలలో ఉన్నవి. ఆయన ఒకచోట ఇట్లు వ్రాసెను: 'జీవితసమస్యలను ఆత్మహత్య పరిష్కరింపజాలదు. బడిపిల్లవాడు తాను చేయలేనిలెక్కను పలకనుండి చెరిపివేసి, గణితమును సాధింపగలడా?'-కాని ఆయన కట్టకడపట వ్రాసినవ్యాసముతో మాత్రము తన మరణమునుగూర్చి ఆయనకు తెలిసినట్లేయున్నది. అప్పటికి ఎనిమిదేండ్లకుపూర్వము ఆయన ధన్వామల్లానకు వ్రాసినలేఖలో 'చనిపోయిన వారి అస్థికలు గంగలో కలుపుదురు. పతితమైన శరీరమునుమాత్రము ఏల కలుపరాదు?' అని వ్రాసెను. 1905 వ సం॥లో ఆయన శ్రీమతి వెల్‌మన్‌తో ఇట్లనెను: 'మృత్యువు మనలను వెన్నంటియే యున్నదికదా'-తాను తన యిచ్చవచ్చినప్పుడే మరణింపగలనని ఆయన కొంత విశ్వాసముండెడిది. దీనికి నిదర్శనము లేకపోలేదు. ఆయన అచ్చటచ్చట రచనలలో ఇట్లు వ్రాసెను: 'రాముని కిష్టములేకుండ మృత్యువు వచ్చినచో మృత్యువే మరణించును'- 'రాముని ఆజ్ఞ లేనిచో మృత్యువు ఉచ్ఛ్వాస నిశ్వాసములుకూడ చేయజాలదు'- 'రాముడు తాను మరణమును కోరుకొనినప్పుడుగాని మరణింపడు.'

పై విషయములనుబట్టి చూచినచో ఆయన మరణము ప్రమాదవశమున సంభవించినదనుటయే సమంజసము. నదిలో కాలుజారుట - అనారోగ్యస్థితి- మోకాలు నొప్పివట్టియుండుట - ఇవన్నియు పై ఊహకు బలమొసగుచున్నవి. దీర్ఘకాలికమగు అజీర్ణవ్యాధితోను, జ్వరముతోను ఆయన కొన్నినెలలుగా అస్వస్థులై యుండెను. ఈ అనారోగ్యము ఆయన జవసత్త్వములను పీల్చివేసెను. స్వామి కృశించి సీరసపడియుండెను. ఆయన ఆరోగ్యము చక్కగా

ఉండినచో నదిలో ప్రమాదవశమున కలిగిన జారుపాటునుండి ఆయన వెంటనే నిలువద్రొక్కుకొనియుండెడివాడు. దెబ్బతిన్న మోకాలు ఆయనను లేవనిచ్చినది కాదు. అందుచేతనే ఆయన ప్రవాహమునకు తట్టుకొనలేక పోయియుండును. అప్పటికిని ప్రాణరక్షణకొఱకు బహుప్రయాసపడెను. పరిస్థితి తనకు ప్రతికూలముగా ఉన్నదని గ్రహించినంతనే విధివిలాసము నకు తలయొగ్గెను. తన శరీరమును సమాధిభంగిమయందుంచి తనకు ప్రియ మైన ఓంకారోచ్చారణము చేసినవిస్మృతనే తన్నుతాను మృత్యువున కర్పించు కొనెను. ఈ విషయమునమాత్రము ఆయన ఆజ్ఞను మృత్యువు శిరసావహిం చినదని చెప్పవలయును.

# 9. రామతీర్థుని దృష్టాంత కథలు

భావవిషయమునను భావవ్యక్తీకరణమునందును గల సరళత్వమే రామతీర్థుని ఒక గొప్పవక్తగా పలువురు కొనియాడుటకు ఒక కారణమైనది. సభాసదులకు సులభముగా అర్థమగు శైలి ఆయన ఉపయోగించెడివారు. తాను చెప్ప దలచు అంశములను ఆయన పూర్వకథలతోను, కథలతోను, దృష్టాంత కథలతోను చక్కగా విశదీకరించెడివారు. ఒక్కొక్కప్పుడు ఆయన వెలువరించుభావములు కొంత గూఢముగా ఉండెడివి. వానిని ఈ దృష్టాంతకథల సాయమున చక్కగా అర్థమగునట్లు, వానితత్త్వము బోధపడునట్లు చేసెడివారు. అట్టివానిలో కొన్నిటిని అమూల్యమగు ఆయన గ్రంథపరంపరనుండి ఏర్చి క్రింద పొందుపఱచుచున్నాము.

## 1. ప్రేమసూత్రము

ఒకరాజు ఒకనాడు వేటకుపోయెను. వేటలో దారితప్పి ఆయన తన పరివారమును గానక ఇటునటు తిరుగుచుండెను. రాజునకు దప్పిక యగుచుండెను. అంత దగ్గరలోనున్న ఒక తోటలోనికిపోయి. అచ్చటి తోటమాలిని త్రాగుటకు ఏదైన ఇమ్మని కోరెను. తోటమాలికి ఆయన రాజని తెలియదు. అతడు ఒక గ్లాసుతో పండ్లరసమును తెచ్చి రాజునకిచ్చెను. రాజు దానిని త్రాగివేసి ఇంకను కావలెననెను. తోటమాలి గ్లాసునుతీసికొని లోనికివెళ్ళెను. రాజు ఇట్లు తలపోయసాగెను: 'ఈ తోటయజమాని గొప్ప ధనవంతునివలె ఉన్నాడు. ఏమయినను ఈతని ఫలవృక్షములు మంచివి. అడిగిన మరుక్షణములో గ్లాసుడు పండ్లరసము తెచ్చుట సామాన్యమా! ఈ తోటయజమానికి చాల పన్ను వేయవలెను.'

కాని ఈ పర్యాయము తోటమాలి రసము తెచ్చుటకు చాల జాగుచేసెను. రాజు ఆశ్చర్యపడి, కారణమేమా! అనుకొనుచుండెను. ఇంతలో తోటమాలి

వచ్చెను. ఇప్పు డాతని చేతిలోనిపాత్రలో రసము నిండుగాలేదు. అతడు బాగుచేయుటకు, రసము నిండుగా లేకుండుటకు కారణమేమని రా జడిగెను. అంతట తోటమాలి 'నేను మొదట రసమును తెచ్చునపుడు ప్రభువులకు మా యెడల మంచి అభిప్రాయముండెను. రెండవసారి నేను రసముకొఱకు వెళ్ళునపుడు ఆ యభిప్రాయముమారి దిగజారినది. కావున తోటలోని చెట్లు కూడ పండ్లు ఇచ్చుట తగ్గించెను కాబోలు। దీనికంటె వేరుకారణము నాకు పొడగట్టుటలేదు' అని బదులుచెప్పెను. రాజునకు తోటమాలి చెప్పినది నిజమే అనిపించెను. తాను మొదట తోటలో ప్రవేశించినపుడు తోట యజమానియెడల తనకు సద్భావమే యున్నది. తరు వాతతన అభిప్రాయము మారినది. ప్రకృతి కిది విరుద్ధమై ఫలములు తగ్గినవి.

ప్రకృతితో సామరస్యముపడసి 'ఆత్మవత్సర్వభూతాని' యను భావము మనలో ఉన్నచో పరిసరములు, పరిస్థితులు మనకు అనుకూలములుగా నే ఉండును. మన భావనలో అపశ్రుతివచ్చినచో సర్వము మనకు వ్యతిరేకము గనే యుండును.

## 2. ఏకత్వభావము

శ్రీ కృష్ణుడు ఒకపర్యాయము విందుచేసెను. ఇరుగుపొరుగులకు, బంధు మిత్రులకు అందరకు ఆహ్వానములు వెళ్లినవి. కాని అతని ప్రాణప్రాణమైన రాధకు ఆహ్వానము లేదు. శ్రీ కృష్ణుని ముఖ్యసచివుడు రాధకుకూడ ఆహ్వా నము పంపవలెనని సూచించెను కాని ఆయన వినిపించుకొనలేదు. మంత్రి శ్రీ కృష్ణునికి చెప్పకుండ రాధయొద్దకుబోయి విందునుగూర్చి ఆమెకు తెలియజేసెను. రాధ అతనితో ఇట్లన్నది: 'నీ వెప్పుడైన విందుచేసినచో నీ స్నేహితులకు, బంధువులకు, పరిచితులకు, నీవు కోరినవారందరికి ఆహ్వా నములు పంపుదువు. అంతేకాని నిన్ను నీవే ఆహ్వానించుకొనవు. ఆహ్వా

వించుకొందువా ? ! శ్రీ కృష్ణుడు ఏందుచేయుచున్నాడని నాకు తెలియును. కాని నాకు అహ్వానమెందులకు ? ఆయనయే నేను-నేనే ఆయన !'

## 3. కాలము-స్థలము

ఒకనాడు ఒక ఆసామి డా॥ రామ్యూలు జాన్సను దగ్గరకువచ్చి 'నాకు అన్యాయము జరిగినది - అన్యాయము జరిగినది' అని వాపోవసాగెను. అంతట జాన్సను ఆతని ఫిర్యాదును విచారింపగా ఆత డిట్లు చెప్పెను: 'ఈ ప్రపంచములో ఒకడు పూర్తిగా వందయేండ్లు బ్రతుకును అనుకొందము. అనంతమైనకాలములో ఈ వందయేండ్లు అనగా ఎంత ? మానవుని జీవితకాలములో సగము నిద్రకే సరిపోవుచున్నది. ఇక బాల్యము-వార్ధకము-ఇవికూడ నిద్ర అనియే మనము లెక్కకట్టవచ్చును. ఇక యౌవనము ఆట పాటలతో గడచిపోవుచున్నవి. ఇక పగలంతయు తినుట, త్రాగుట, అలంకరించుకొనుట - వీనితో గడచిపోవుచున్నవి. ఇవికాక, అలుబిడ్డలపోషణకై యత్నములు, బంధుమిత్రుల యోగక్షేమములరయుట కొంతసమయమును మ్రింగివేయుచున్నవి మిగిలినకాలము వచ్చినవారికొఱకు కేడ్చుటతోడను, పుట్టినవారినిచూచి మురియుటతోడను సరిపోవుచున్నది. కాలమంతయు ఈవిధముగా చెల్లిపోవుచున్నచో, ఇక మానవుడు ఆధ్యాత్మికవిషయములను గూర్చి భగవంతునిగూర్చి ఆలోచించుటకు వ్యవధి ఎక్కడ ? కావున మన మీ దేవాలయములకు, చర్చిలకు, మతబోధకులకు, గురువులకు వ్యాప్తి చెప్పవలెను.'

జాన్సను ఇది అంతయు వినెను. ఆయనకూడ మూలుగుచు బాధపడి కొంతవడికి అతనితో ఇట్లనెను: 'అధ్యాత్మికవిషయములపై కాలమును వెచ్చింపలేనందులకు మానవులు నిజముగా అత్మహత్య చేసికొనవలసినదే-కాని నీ ఫిర్యాదుతోడి నా ఫిర్యాదుకూడ ఒకటి ఉన్నది. నాకు తిండిగింజలు

పండించుకొనుటకు భూమి లేకుండపోయినది. నాకు అన్యాయము జరిగినది. నాకు అన్యాయము జరిగినది' అని వాపోయెను. ఆ ఆసామికి జాన్సను మాటల లోని అర్థము తెలియలేదు. ఇంత భూమి ఉండగా ఈయన తనకు పండించు కొను నేల లేదనుచున్నా డేమిరా? అని అనుకొనెను. అంతట జాన్సను అతనితో ఇట్లనెను: 'చూడవయ్యా! మన భూమండలము ఈ మహావిశ్వ ములో ఒక నలుసంత కూడ ఉండదు. ఈ ఉన్న భూమిలో మూడువంతులు సముద్రములు, మహాసముద్రములు ఆక్రమించుకొని ఉన్నవి. ఇక మిగిలిన దానిలో పర్వతములు, చెఱువులు, చెట్లుచేమలు, అడవులు, ఎడారులు నిండి యున్నవి. వీనికితోడు పట్టణములు, మహానగరములు కావలసినన్ని ఉన్నవి కదా. భూమండలమంతయు ఇట్లు ఆక్రమింపబడియుండగా మానవునికి ఇంక చోటు ఎక్కడిది? ఏ కొద్ది భూభాగమో మిగిలె ననుకొనుము - లక్షలాది జంతువులు, పక్షులు, చీమలు, దోమలు మొదలయిన ప్రాణులు ఉన్నవికదా వానికి ఆహారము కావలెనుకదా - వీనికన్నిటికిపోను మానవునివంతునకు వచ్చు భూమి ఎంత? అప్పటికి మిగిలిన భూమినే లెక్క కట్టుకొందమన్నను, మానవులు ఎన్నికోట్లమంది ఉన్నారో చూచితివా? మరి ఇట్టిపరిస్థితిలో నావంటి ఒక్కవ్యక్తివంతునకు లభించు నేల ఎంత? కాబట్టి ఆలోచింపగా, నాకు తిండి ఉత్పత్తిచేసికొనుటకు భూమి లేదని నేను ఆత్మహత్య చేసి కొనుటకంటె గత్యంతరములేదని తోచుచున్నది.' ఈ మాటలువిని ఆ ఆసామి జాన్సనుతక్కము 'వినుటకు బాగుగానే ఉన్నదికాని అది యథార్థము కాదు' అనెను. అంతట జాన్సను అతనితో 'అట్లయినచో, నీవు చేసినన్యాయములో కూడ నిజములేదు. భూమి నాకు తిండిపెట్టగలిగినచో, నీకు ఆధ్యాత్మికవిషయ ములనుగూర్చి భగవంతునిగూర్చి చింతించుటకు చాలినంతకాలము ఉండనే ఉన్నది' అని బదులుపలికెను.

## 4. తెలివితక్కువ సంబరము

ఒకనాడు ఒకడు దేవాలయములో అందరకు మిఠాయిలు పంచిపెట్టు చుండెను. మరియొకడు 'ఏమయ్యా! అంతసంతోషముతో మిఠాయిలు పంచి పెట్టుచున్నావు? ఏమి కథ?' అని అడిగెను. ఆ ఆసామి 'నా గుఱ్ఱమును ఎవరో దొంగిలించుకొని పోయిరి. అందులకు ఈ సంబరము' అనెను. అందరు అతనిమాటలకు ఆశ్చర్యపడిరి. జీను పోయెనుకాబోలు అనుకొనిరి. కాని అతడు ఉన్నసంగతి ఇట్లు బయటపెట్టెను. 'నా గుఱ్ఱముపోయినది, రౌతు దక్కినాడు. నా గుఱ్ఱమును ఒక దొంగలముఠా దొంగిలించికొని పోయిరి. ఆ సమయమున నే నా గుఱ్ఱముపై స్వారిచేయుచుండుటలేదు. అయ్యా! నేను అప్పుడు గుఱ్ఱముపైని ఉన్నచో వాండ్రు నన్నుకూడ ఎత్తు కొనిపోయెడివారే కదా - మీరే ఆలోచింపుడు' అనెను.

ఒక్కొక్కప్పుడు మన ప్రవర్తనకూడ ఆ ఆసామి ప్రవర్తనవలెనో, అంతకంటె కనికష్టముగానో ఉండును. మనలో వేలకొలదిజనులు గుఱ్ఱ మును దక్కించుకొని రౌతును పోగొట్టుకొనుచున్నారు. ఆత్మ రౌతువంటిది. శరీరము గుఱ్ఱమువంటిది అని మనకందరకు తెలియును. మనము ఏ వ్యక్తి నైన-అతనినిగూర్చి, అతని నివాసాదికమునుగూర్చి ప్రశ్నించినచో అతడు 'నేను ఫలానా, నేను ఫలానా కార్యాలయములో పనిచేయుచుందును' మొదలయిన జవాబులు చెప్పును. ఈవిధమైన సమాధానములన్నియు అతని శరీరమునకు సంబంధించినవే. అనగా మనము రౌతునుగూర్చి ప్రశ్నింపగా అతడు గుఱ్ఱమునుగూర్చి జవాబిచ్చుచున్నాడు. దీనినిబట్టి మనము రౌతునే గుఱ్ఱముగా భావించుచున్నట్లు స్పష్టమగుచున్నది కదా?

## 5. పెద్ద అసందర్భము

ఒక గ్రామములో ఒక వెఱ్ఱిబాగులవాడు ఉండెను. ఆ ఊరిలోని కొందరు కొంటెయువకులకు ఒకసారి అతనిని ఏడ్పింపవలెనని బుద్ధిపుట్టినది. వాండ్రు

అతనికి సారాయి పట్టించిరి. తరువాత అతనికి విశ్వాసపాత్రుడు, స్నేహితుడునగు ఒక యువకుని అతనియొద్దకు పంపిరి. ఈ స్నేహితుడు అతని యొద్దకుపోయి ఏడ్చుచు 'నీ భార్య ముండమోపినదయ్యా! మిత్రమా! ఇప్పుడే మీ యింటినుండి వచ్చుచున్నాను' అని, మరల ఏడువసాగెను. ఆ వెఱ్ఱిబాగులవాడు, 'అయ్యో! కొంప మునిగిపోయినదిరా దేవుడా' అని పెద్దపెట్టున ఏడువ నారంభించెను. ఇంతలో కొందరుయువకులువచ్చి వానిని 'ఏమయ్యా! ఏడ్చుచున్నావు?' అని ప్రశ్నించిరి. అతడు 'నా భార్య ముండ మోపినది, అందుకు ఏడ్చుచున్నాను' అని బదులుచెప్పెను. వారు 'నీవు బ్రదికియుండగా నీ భార్య ముండమోయుట ఏమిరా పిచ్చివాడా' అనిరి. వాడు ఆ మాట వినిపించుకొనకుండ, 'ఇదుగో నా స్నేహితుడు - నాకు మిక్కిలి విశ్వాసపాత్రుడు - ఇతడు ఇప్పుడు మా యింటినుండియే వచ్చుచున్నాడు. నా భార్య ముండమోయుట తాను కన్నులార చూచివచ్చినానని చెప్పుచున్నాడు. ఇతనిని నమ్మకుండుట ఎట్లు? మీరు చెప్పునది సరికాదు. మీకు తెలియదు' అనెను.

ఈరకమైన అసందర్భములు అనేకమతములలో, తెగలలో, లోతులేని మనుజులలో కన్పట్టుచునే యున్నవి. వీరు తమకన్నులతో చూడరు. మనస్సుతో ఆలోచింపరు. ఎవరో ఏదో చెప్పినారని గ్రుడ్డిగా నమ్ముదురు. అది ఎంత అసందర్భమైనను పట్టించుకొనరు. వెల్గులకు వెల్గు, స్వర్గములకు స్వర్గము అగు మన ఆత్మ నిత్యకాంతులీనుచుండగా దానిని చూడకుండ 'నాకు మంచిరోజులు ఎప్పుడు వచ్చును?' అని వాపోవుచుందుము. మన లోని ఆపద్బాంధవుని గుర్తింపలేక ఎక్కడో దేవుడున్నాడని, అతనిని 'వచ్చి రక్షించి మా ఆపదలను తుదముట్టింపు'మని వేడుకొనుచున్నాము.

## 6. ఆత్మవిశ్వాసము

ఇద్దరన్నదమ్ములు ఒక వ్యాజ్యమునందర్భములో ఒక న్యాయాధిపతి యొద్దకు వెళ్ళిరి. వారిలో ఒకడు లక్షాధికారి. రెండవవాడు నిరుపేద. న్యాయాధి

పతి లక్షాధికారిని 'నీ సోదరుడు ఇంత నిరుపేదగా ఉండగా నీ వెట్లు లక్షాధికారివైతివి?' అని అడిగెను. అతడు ఇట్లు జవాబు చెప్పెను. 'మే మిద్దరము అయిదుసంవత్సరముల క్రిందట మా తండ్రిఆస్తిని సమానముగా పంచుకొంటిమి. నా సోదరుడు తాను ధనవంతుడనైతి నను భావముతో బద్ధకము పెంచుకొనెను. ఏదైన పనివచ్చినపుడు ఇతడు ఆ పనిని సేవకులకప్పగించి, దానినిగూర్చి ఏమియు పట్టించుకొనకుండ తాను భోగవిలాసములలో గడపుచుండెడివాడు. కాని నేనుమాత్రము అట్లుకాక, ఆస్తి నాచేతికి వచ్చినప్పటి నుండి ప్రతివిషయమును స్వయముగా చూచుకొనుచు సేవకులకు 'రండు! ఈపని చేయుదము' అని దగ్గరుండి చేయించెడివాడను. నా నోటినుండి ఎప్పుడును 'రండు! రండు!' అను మాటలేకాని మా తమ్మునివలె 'వెళ్లుడు వెళ్లుడు' అని వచ్చెడివే కావు. అతడు అనునట్లు అతని సంపద అంతయు 'వెళ్ళినది'. అతని సేవకులు, స్నేహితులు అందరు 'వెళ్ళిరి'. కాని నా స్నేహితులు, నా ఐశ్వర్యము మరింత పెరిగినదేకాని తరుగలేదు. ఇట్లు నా నోటినుండి వచ్చు మాటప్రకారమే జరిగెను.

ఇదియే విజయరహస్యము. ఇతరులమీద ఆధారపడినచో మనము నష్టపోవుదుము. స్వీయశక్తిపై ఆధారపడినచో మనకు లాభించును. మనకు ఆత్మవిశ్వాసములేక మనసు పేదలమయాతిమేని మనకు అధోగతియే పట్టును. గొప్ప ఆత్మప్రత్యయముకలిగి స్వశక్తిపై ఆధారపడుట నేర్చుకొంటిమేని మనకు విజయము లభించితీరును.

## 7. జీవనభానుడు

(శాన్ ఫ్రాన్సిస్కోలో రామతీర్థుడొసగిన ఒక ఉపన్యాసము ననుసరించి)

హిమాలయపర్వతములపై మంచుదిబ్బలు చాల అందముగా, ఉత్తేజకరములుగా ఉండును. అచ్చట ప్రాణులుగాని, చెట్లుచేమలుగాని లేవు.

ఆ మంచుదిబ్బలపై జీవనమూలములను మనము గాంచగలము. ఇచ్చటి ఖానుడు నదియొక్క గంగానదియొక్క కారణ శరీరము.

మనము కొంచెము దిగువకువచ్చినచో హిమావృతములగు పర్వతశిఖరములు వెనుకబడి, పెద్దపెద్ద గులాబిపొదలనడుమకు వత్తుము. ఈ పొదల నుండి పక్షుల కలకలరవములు వినవచ్చుచుండును. ఇచ్చటనే గంగానది శిలాసంఘాతములనుండి గంతులిడుచు బయలువెడలి తన యిచ్చవచ్చిన తీరున ప్రవహించుటకు మొదలిడును. ఇది ఆ నదీజీవితమున రెండవ దశ. ఇచ్చట గంగానది తన సూక్ష్మ శరీరమున కన్పట్టుచుండును.

సూక్ష్మ శరీరము కారణ శరీరమునుండి ఉద్భవించును. కారణ శరీరముపై సూర్యకాంతిప్రసరణము సూక్ష్మశరీరమునకు చాంచల్యమును, వక్రతను అపాదించును. నది కొంతదూరము దూకుచు, పరవళ్ళు త్రొక్కుచు, ప్రళయార్బటితో సాగి చివరకు ఒక పెద్దకాసారముగా ఏర్పడును.

మైదానములలో గంగానది ఒక మహాప్రవాహమగును. తనకు సహజమైన స్వచ్ఛతనువీడి, ఆ నది పొంగి పంకపంకిలమగును. వేగము తగ్గిన కొలది నది ఎక్కువ ఉపయోగకరమగుచుండును. నదిపై పడవలు సాగును. నౌకలు సరకులను తీసికొనిపోవుచుండును. కాలువలు త్రవ్వబడి పొలములకు నీరు లభ్యమగును. ప్రజలు నీటిని స్నానపానముల కుపయోగించుకొనుచుందురు. ఇది నదికి మూడవదశ. ఈ దశలో నది స్థూల శరీరమును వహించును. ఇప్పుడుకూడ సూర్యుడు నదికి చలనశక్తిని ఒసంగుచునే యుండును.

ఇప్పుడు మనము పై దృష్టాంతమును మానవునిజీవితమునకు అన్వయింతము. నిద్రలో మానవుడు ఆత్మకు అథోభాగమున పడియుండును. ఇది మంచుదిబ్బలపై సూర్యుడు ప్రకాశించుటవంటిది. ఆస్థితిలో మానవునకు ప్రపంచము లేదు. స్వప్నభూములే ఉన్నవి. సుషుప్త్యవస్థలో మనకు స్వప్న

ములుకూడ రావు. ఈ యవస్థను మంచుదిబ్బలవలెను, ఆత్మను సూర్యుని వలెను, వేదాంతము చెప్పును. ఈ యవస్థనుండియే జాగ్రదవస్థయు, స్వప్నావస్థయు కలుగుచున్నవి.

స్వప్నావస్థలో మనము మంచుదిబ్బలనుండి పర్వతముల దిగువభాగమునకు వచ్చితిమన్నమాట. ఇచ్చట స్వప్నగతుడైన జీవుడు ఒక ఊహాలోకములో ఉండును. అతడు మహారాజు, బిచ్చగాడు, తానే యగుచు సెలయేరువలె చంచలత్వము తాల్చును.

జాగ్రదవస్థలో మైదానములమీది నదివలె మనము స్థూలశరీరమున ఉందుము. కాని సూక్ష్మశరీరము (మనస్సు) అదృశ్యముకాదు. శీతకాలములో (రాత్రివలె) నది తన స్థూలశరీరమునువదలి సూక్ష్మశరీరమును విల్చుకొనును. సూర్యప్రతిబింబము మంచుదిబ్బలపై తొలుత కానరాదుకాని తరువాత గోచరించును. మనము సుషుప్తియందున్నప్పుడుకూడ ఆత్మ సన్నిహితమైయుండును. కాని జాగ్రదవస్థలోని స్థితిగతులు - స్వభావమున కాకపోయినను - అంతస్థులలో కొంత భిన్నముగా ఉండును. నదికి మనము చెప్పిన మూడువిధములగు శరీరములపై సూర్యుడు ఎట్లు ప్రకాశించునో, అట్లే ఆత్మ స్థూల, సూక్ష్మ, కారణ శరీరములయందు ప్రకాశించుచుండును. దానంతట అది ఎట్టిమార్పును పొందక నిర్వికారముగా ఉండును.

# 10. గ్రంథములు - భావములు

రామతీర్థస్వామి తాను జీవించిన ముప్పది సంవత్సరములలో ప్రజలకు గొప్ప ఆధ్యాత్మిక సంపద నొసంగిపోయెను. ఆయన జీవితకాలమున యువకు లనక - స్త్రీలనక - పురుషులనక - వేలకొలది ప్రజలను ప్రబోధించి ప్రభావితు లను చేసెను. ఆయన ప్రబోధములను విని అధికసంఖ్యాకులు ఉన్నతస్థితి నందుకొనిరి. ఆయన రచనలుకూడ అధికముగనే చేసెను. స్వామి నిర్యాణా నంతరము ఆయన శిష్యులకు 11 నోటుపుస్తకములు దొరకినవి. ఈ పుస్తక ములలో స్వామి తన భావములను పెక్కింటిని పొందుపఱిచెను. వానిలో పెక్కులు ఇంగ్లీషుభాషలో వ్రాయబడినవి. ఇవికాక - స్వామి జపానులోను, అమెరికాలోను ఇచ్చిన ఉపన్యాసముల నకళ్లు, ముద్రితప్రతులుకూడ వారికి లభించినవి. లాహోరునుండి ప్రచురింపబడిన 'అలీఫ్' అను ఉర్దూపత్రికలో ఆయన ఉపన్యాసములు పెక్కు ప్రచురింపబడినవి. రామతీర్థుని రచన లన్ని టిని ప్రచురించుటకు నారాయణస్వామి పూనుకొనెను. ఈ పనిలో అతనికి తొలుత మాష్టర్ అమీర్‌చందు సాయపడెను. 1909 - 10 సం॥లో ఢిల్లీ నుండి రామతీర్థుని సమగ్రరచనలు నాలుగు సంపుటములుగా వెలువరింప బడినవి. ఈ రచనలకు 'ఆత్మదర్శనారణ్యములలో' అని పేరుపెట్టిరి. పిమ్మట 1919 సం॥లో నారాణయస్వామి రామతీర్థుని భక్తుల సాయమునను, తన అనుయాయుల సహకారమునను, 'రామతీర్థ ప్రచురణసంఘము' అను సంస్థను స్థాపించెను. ఇతడు అతడు సన్న్యాసము స్వీకరించిన లక్నో నగరమునందే నెలకొల్పబడెను. ఈ సంస్థ స్వామి ఉపన్యాసముల నన్నిటిని ఎనిమిది సంపుటములుగా ప్రచురించెను. రామతీర్థుని రచనలన్నియు హిందీ భాషలోకూడ ఇరువదియెనిమిది సంపుటములలో ప్రకటింపబడినవి. 450 పుటలుగల ఒక సంపుటమున, స్వామి ఉర్దూలో వ్రాసిన కొన్ని లేఖలును,

అలీఫ్ పత్రికలోని వ్యాసములును ప్రకటింపబడెను. రామతీర్థుడు పెక్కు పద్యరచనలుకూడ చేసెను. అవి సుమారు 100 వరకు ఆంగ్లభాషలోను, ఇంచుమించు 150 వరకు ఉర్దూభాషలోను వ్రాయబడినవి. ఇవికాక, ఆయన ధన్నామల్లునకు కొన్ని సంవత్సరములుగా వ్రాసిన 1124 లేఖలుకూడ ఉన్నవి. ఈ రచనా సముదాయమంతయు జాగ్రతగా భద్రపఱుపబడి గ్రంథ రూపమున వెలువరింపబడినది. 'రామతీర్థ ప్రచురణసంఘము' 'రామతీర్థ ప్రతిష్ఠాన్, (సారనాథ్) వారణాసి' అని పునర్వ్యవస్థీకరింపబడినది. రామ తీర్థుని రచనలను, ఆయననుగూర్చి వ్రాయబడిన గ్రంథములను, ఆధారము చేసికొని స్వామి సందేశమును ప్రచారము చేయుటయే ఈ సంస్థయొక్క ముఖ్యోద్దేశము.

రామతీర్థస్వామి సందేశమును అవగాహనము చేసికొనుటకు, ఆయన ఉపన్యాసములలోను, సత్సంగములలోను చేసిన వేదాంత వ్యాఖ్యానమే ముఖ్యాధారము. ఈ విషయమున ఆయన వ్రాసికొన్న నోటుపుస్తకములు కూడ మిక్కిలి ప్రయోజనకరములు. ఆయన పర్వతప్రాంతములందు నివసించుచున్న కాలములో తనకు అప్పుడప్పుడు తోచిన భావములను ఈ పుస్తకములలో వ్రాసిపెట్టికొనెడివాడు. ఇట్టి వ్రాతలలో కొన్ని సుదీర్ఘములు గను, కొన్ని ఒకటి రెండు వాక్యములుగాను ఉండును. ఇవి కారికలవలె, సూత్రములవలె సంగ్రహముగా ఉన్నను వానియందలి విషయము మాత్రము ఉదాత్తముగా ఉండును. ఆయన ఒక ప్రణాళిక ననుసరించి, నిర్ణీతక్రమ ములో వీనిని వ్రాసిపెట్టలేదు. ఈ దిగువనిచ్చిన ఉదాహరణములలో ఒక వర్గీకరణము పాఠకులకు కన్పట్టినచో, అది ఈ సంకలనకర్త చేసినదేయని వారు గమనింతురుగాక. ప్రతిసూక్తి, ప్రతిభావము, దేనికదే స్వయం సంపూర్ణమై, పూర్వాపరసూక్తులతో సంబంధములేక ఉండును.

## వివేకస్ఫటికములు

| | |
|---|---|
| మనోద్రావకము | నీ మనస్సు ఒక ద్రావకమువలె ఉండవలయును. దానిలో వేసినవాని నన్నిటిని అది కరగించివేయవలెను. |
| విధి | విధి తన్నెదిరించినవానితో నెయ్యము నెఱపును. ధైర్యమే అదృష్టము. |
| శరీరము; ఆత్మ | శరీరమునకు రాత్రివేళ అగునది ఆత్మకు పగలు. |
| విశ్వాసము | విశ్వాసములు మతవ్యాక్రియ. |
| మనసు విప్పుదల | నీ మనస్సునకు నలువైపుల విప్పుదల యున్నచో నీ ప్రవర్తన పరిమళముతో గుబాళించుచుండును. |
| తత్త్వశాస్త్రము | సామాన్యతత్త్వశాస్త్రము వేటలో ఉన్న జాగిలము వంటిది. అది వేటాడుచున్నకొలది దూరదూరములకు పోవును. |
| చేయూత | వేడుకొను పెదవులకంటె సాయముచేయు చేతులు గొప్పవి. |
| మనుష్యులు; అభిప్రాయములు | అల్పభావములుకల గొప్పవారికంటె, ఉన్నతభావములు కల సామాన్యులే సంఘమున కలంకారములు. |
| ముళికి | అస్థానపతితమైన ఐశ్వర్యమే ముఱికి. |
| పాపాలు | మనం మన పాపాలవల్లకాదు పాపాలచేత శిక్షించబడుతున్నాము. |
| ప్రార్థన | దైవమును, పురుషకారమును సంఘటితపఱచునదియే ప్రార్థన. |
| పొరపాటు | ప్రతి పొరపాటులోను కొంత సత్యాంశము ఉండక పోదు. |
| సంఘము | కొట్టుకొనిపోవుటకంటె, చక్కాను బిగువు ఉండుటయే సంఘమును దరిజేర్చును. |

| | |
|---|---|
| సత్యము | సత్యము తెలిసికొనదగినది. ప్రమాణములనుబట్టి గ్రుడ్డిగా నమ్మదగినది కాదు. |
| ఆలోచనాపరత్వము | ఆలోచనాపరుడు గుండుసూదివంటివాడు. అతని తల అతనిని అతిదూరము పోనీయదు. |
| అధికత; అల్పత | అల్పత్వము పడయుట యెంత సులభమో అధికత్వము పడయుటయు అంతే సులభము. |
| భావనలు | నీ భావనలు ఎట్టివో నీ సిద్ధియు అట్టిదే అగును. |
| ప్రదాత | ఎల్లప్పుడూ ప్రదాతగానే వుండు, గృహీతవు కావొద్దు. |
| ఆశ | ఆశ ఉన్నచో ఉత్తేజము కలుగును. |
| మనుష్యుడు; స్వర్గము | ప్రతిమనుష్యుడు స్వర్గపరీవాహకుల్యయే. |
| ద్వేషము | ఆర్ద్రహృదయము బొమ్మ: ద్వేషాసూయలు బొరుసు. |
| వివేకము; అవివేకము | ఒకనియందున్న వివేకము మరియొకనికి అవివేకముగా గోచరింపవచ్చును. |
| భోగము | భోగమునందే క్షైణ్యప్తితులును ఉండును. |
| పేదఱికము | దారిద్ర్యము భగవంతుని సింహాసనమునకు కన్నీటి నిచ్చెనలు కట్టును. |
| భయము | భయమునకు క్రిందిభాగము స్వార్థము. |
| లాభము; నష్టము | కాసులరూపమున వచ్చిన లాభము కాలమును నష్టపఱచును. రూకలలో ఐశ్వర్యము - బ్రదుకులో పేదఱికము. |
| ఈడ్పుట మరియు త్రోయుట | జీవితపు సకలద్వారాలమీద 'ఈడ్చు' అనే లిఖించబడి వుంది. కానీ మనం తరుచు వాటిని 'త్రోయుట'కు ఉపక్రమిస్తాము. |

| | |
|---|---|
| యథార్థసంపద | విషయములను ఎంత పట్టించుకొనకుండ నుందుమో మనము అంత సంపన్నుల మగుదుము. |
| కాలసంహర్తలు | మనలో చాలమంది ఎంత ధైర్యవంతులమో ! మనము కాలమునే సంహరింతుము. (we can kill time) |
| వివేకము | చదువు గతకాలమువంక తిరిగిచూచును. వివేకము భవిష్యత్తులోనికి చూచును. |
| వ్యసనము | స్వయంకృతాపరాధమునకు మఱియొక పేరు 'వ్యసనము' |
| జయము; అపజయము | అపజయములను చిఱునవ్వుతో స్వీకరింపలేనివారికి జయమును మురియుచు చేపట్టుటకు హక్కులేదు. |
| సున్న | విలువలేని సున్నకూడ సంఖ్యకు కుడిప్రక్కను చేరినచో దానికి పదిరెట్లు విలువనిచ్చును. |
| మౌళికత | నిష్కాపట్యమే మౌళికతలోని గొప్పదనము కాని క్రొత్తదనము కాదు. |
| వినోదము | మనుజులు చక్కగా కృషిలో నిమగ్నులైనచో, దాని నుండియే వారికి వినోదము లభించును. |
| వేదన | వేదన అనెడు అగ్నివలననే మనస్సు అనెడు కట్టె జ్వలించి కాంతులు చిమ్మును. |
| విషయములు | విషయములకంటె, వానినిగూర్చి చేసెడి ఆలోచనలే మనుజులను ఎక్కువగా వశపఱుచుకొనును. |
| సమర్పణము | దైవసంకల్పమునకు తన్ను తాను సమర్పించుకొనిన వాని ముఖమున కాంతులు తొణికిసలాడుచుండును. |
| కోరిక | ప్రతికోరికయు మనలో కొంతభాగమును తునుకలుచేసి మనము నిలుకడను కోల్పోవునట్లు చేయును. |

| | |
|---|---|
| దీవనలు | నీకు లభింపనివాటికొఱకు యాచించుట యనగా ప్రస్తుత మనుభవించుచున్న ఆశీఃఫలితములకు కృతజ్ఞత చూప లేకపోవుట యన్నమాట. |
| ప్రేమ | ఒకవ్యక్తి నీకు అర్థము కావలయునన్నచో తొలుత నీవు అతనిని ప్రేమింపవలయును. |
| స్పర్థ | స్పర్థకంటె ప్రాచీనమైనది సమ్మేళనము. |
| వివేచనము | వివేచనము నిరాశాపూరితమైనపుడు ప్రేమ ఆశను చిగురింపజేయును. |
| సంతోషము | సంతోషమునకు మించిన సిద్ధౌషధము లేదు. |
| స్వామిత్వము | ఇతరు లొకవస్తువు నుపయోగింపకుండ నివారించునదియే చట్టబద్ధమగు స్వామిత్వము. |
| మార్పు | 'పరిణామము లేదా నాశనము' ఇదియే ప్రకృతి విస్మరముగా చెప్పుమాట. |
| ధైర్యము | లోకాచారముకంటె ధైర్యమే మేలు. |
| వార్తాపత్రికలు | వార్తాపత్రికలు ఎన్నడూ చదువనివారే ధన్యులు. ఎందుచేతనంటే 'ప్రకృతి' ద్వారా వారు 'భగవంతుని' దర్శించగలరు. |
| విప్లవము | సమూలముగా పుట్టకురుపును ఛేదింపలేని శస్త్రచికిత్స వంటిదే విప్లవము. |
| సంస్కారము | తొలుత నిన్ను నీవు సంస్కరించుకొనుము. పిమ్మట సర్వము చక్కబడును. |
| రాజకీయవేత్త | రాజకీయవేత్త నాగరకతగల ఆటవికుడు. |

చట్టములు — బలవంతులు చట్టములను పాలింతురు. చట్టములు బల హీనులను పిండిగొట్టును.

ఏకాంతము — ఏకాంతమును మించిన సహచరుడు లేడు.

వ్యాధి — శరీరము వ్యాధిగ్రస్తమైనప్పుడు ఆరోగ్యము నెట్లు కోల్పోవుదుమో, అట్లే ఆధ్యాత్మిక రుగ్మత కలిగినపుడు మన వ్యక్తిత్వమును కోల్పోవుదుము.

చౌర్యము — నీ వస్తువులను దొంగిలించువాడు చోరుడు. నీ మమ కారమును దొంగిలించువాడు గురువు.

సంపదలు — లజ్జాభరితమైన ఆత్మ తన నగ్నత్వమును కప్పిపుచ్చు కొనుటకు గ్రహించిన ఆకులే లౌకికసంపదలు.

యాచన — యాచించినంతకాలము నీ కేమియు దొరకదు.

భావము — సమగ్రమగుభావమే తేజోవంతమగు భావము.

గమ్యము — తన గమ్యస్థానము నెఱిగిన మనుజునకు ప్రపంచము తొలగి దారియొసగును.

మతతత్త్వము — మతబోధలనుండియే ఆధ్యాత్మికతాదారిద్ర్యము ఉత్పన్న మగుచున్నది.

ఉత్తమప్రదేశము — తాను నిలిచినస్థలమే తన కుత్తమప్రదేశము.

విశ్వాసము — మహిమల (సిద్ధులు)ను జూచి ఏర్పరుచుకొన్న విశ్వా సము విశ్వాసము కానేరదు. అది బలవంతముగా ఒప్పించుట. తర్కముద్వారా విశ్వాసమును నిరూపింప యత్నించుట హృదయమున భయబీజములను నాటు టయే.

వేదాంతము — 1. ఏ పనియు లేనిది, ఏదో ఒకపని చేయుచుండునది వేదాంతము. 2. సర్వభూతహితత్వాహంకారములు

మనలో ఏకరూపత వహించునట్లు చేయునది వేదాంతము.

**శాస్త్రము** — విజ్ఞానతత్త్వశాస్త్రములు తుష్టికరమగు భోజనమునకు పూటకూటింట ఇచ్చు మూల్యపుచీటి ఇచ్చునవి.

**ఇటుక** — గోడలో అమర్చుటకు వీలుగానున్న ఇటుక ఎచ్చటనున్నను స్వీకరింపవచ్చును.

**బంధము** — నిన్ను బంధించున దెవరు? నీ కోరికలే కదా!

**మార్గము** — తా నెచటి కేగుచుండెనో తెలియని మానవుడు ఉన్నతికి పోజాలడు.

**తీరిక** — ఘోరియో ఆభరణములకంటె తీరికయే కావలెనని కోరెను.

**తల్లి** — మాతృజీవితము ఒక అవ్యక్తమగు ప్రార్థన. ఆమెశరీర మొక పవిత్రదేవాలయము

**దైవము** — భగవంతుడు శ్రీమాన్-శ్రీమతి-కుమారి-ఎవరునుకాడు-మరి? ఒక అభేద్యరహస్యము!!

## రాముని కొన్ని యాదృచ్ఛికభావములు

1. విజ్ఞానప్రదానమే నీ వితరులకిచ్చు అమూల్యమగు కానుక. మానవునకు ఒక దినమున తిండి పెట్టిన, మరునాడు మరల అతడు ఆకలిగొనును. అతని కేదైన ఉపాధికల్పించు విద్య నేర్పితివేని అతనికి జీవితమంతయు రోట్టి దినవార వగుదువు.

2. తన సహచరుల తెలివిలేమినిగూర్చిగాని, తన అనుయాయుల అవిశ్వాసమునుగూర్చిగాని, మానవుల కృతజ్ఞతారాహిత్యమునుగూర్చిగాని, ప్రజలు తన్ను ప్రశంసించుటలేదనిగాని సణుగుకొననివాడే నాయకుడగుటకు అర్హుడు.

3. గతకాలమునాటి వైభవమును నెమరువేసికొనుచు కూర్చుండుటయే దేశభక్తి యనుకొనెడివారు కొందరుందురు. కాలదోషముపట్టి, నిరుపయోగమైన ఖాతా పుస్తకములను ముందువేసికొని కూర్చుండువారే దివాళాతీసిన వడ్డీవ్యాపారులు.

4. ప్రతివ్యక్తి తనకు తగిన ఉన్నతస్థితినిపొంది, తలయెత్తుకొని తిరుగగల స్వాతంత్ర్యము పడయనిమ్ము. కాని అతని కాళ్ళు భూమిమీదనే ఉండవలయును; అతడు బలహీనుడైనంతమాత్రమున, లేదా అంగీకరించినంతమాత్రమున అతనిని ఇతరులభుజములపైమాత్రము ఎక్కనీయరాదు.

5. గుణమును మెచ్చుకొనుట, సౌభ్రాత్రభావము, సామరస్యము, కార్యసమన్వయము, కాయకష్టములోని ఘనతను గ్రహించుట వీనిని ప్రతివ్యక్తియందు పెంపొందింపవలయును. అంతేకాని తీర్పుకూర్చుండి తప్పు లెన్నుటను కాదు.

6. పూర్వాచారపరాయణులగు ప్రియతమ భారతీయులారా! మీరు శాస్త్రములను సరియగురీతిలో ఆచరణలో పెట్టుడు. దెసకుట కొప్పుని కులవిభేదములను సడలించి జాతీయసహోదరభావమునకు పరిచ్ఛేదములను క్రిందుపటిచియుంచుటయే మీనుండి ఈ దేశధర్మము అపేక్షించుచున్నది.

7. పురుషునకు ఇల్లు, దబ్బు, పొలము పుట్రవలె స్త్రీకూడ ఒక వాణిజ్యవస్తువుగా పరిగణింపబడుచుండుట నాగరకతగల సంఘమునకు తుడిచివేయరాని కళంకము.

8. స్త్రీవిద్యను, బాలబాలికలవిద్యను, శ్రామికజనులవిద్యను ఉపేక్షించుట మనము నిల్చినకొమ్మను మనమే నరికివేసికొనుట-కాదు-జాతీయతా మహావృక్షమునే సమూలముగా నాశనముచేయుట.

9. భారతదేశములో స్వతంత్రముగా ఆలోచించువానిని మతభ్రష్టుడైనట్లుగా-కాదు-క్షమింపరాని మహాపరాధము చేసినవానిగా చూచుట అలవాటైనది. మృతభాషనుండి వెలువడినదెల్ల పరమపవిత్రము!!

10. భారతదేశపు రాజకుమారులు, ప్రభువులు తమ అధికారైశ్వర్యములను కోల్పోయి రత్నకంబళయోధులవలె, ఊరక ధమధమలాడు బిరుదనామములతో మిగిలిరి.

# 11. లేఖలు - పద్యములు

రామతీర్థస్వామి (ఒకనాటి తీర్థరాముడు) లేఖలు వ్రాయుటయందు సహజ కౌశలము కలవాడు. ప్రతి స్వల్పభావోద్వేగమునకు అతడు వెంటనే అక్షర రూప మిచ్చెడివాడు. అందుచేత అతడు తొలినాళ్లలో తఱచు లేఖలు వ్రాయుట జరిగినది. అతడు ధన్నామల్లుతో పరిచయము ఏర్పరుచుకొని, అతనిని గురువుగా ఆరాధించుట మొదలుపెట్టిననాటినుండి తన జీవితగమనమునుగూర్చి ఎప్పటికప్పుడు అతనికి తెలియబఱచుచుండుట తన ముఖ్య కర్తవ్యముగా నతడు భావించెను. లాహోరు కళాశాలలో విద్యార్థిగా చేరి నప్పటినుండి తన గురువునకు లేఖలు వ్రాయుట మొదలుపెట్టెను. అతడు లేఖలు వ్రాయుట మానివేసిననాటికి వాటిసంఖ్య 1100 పైచిలుకున్నది. ఈ లేఖలలోని విషయములు, వర్ణింపబడిన సంఘటనలు, రామతీర్థునకు ధన్నామల్లునకుమాత్రమే సంబంధించినవి. వానిలో పెద్దవిశేషము లేవియు లేవు. వ్రజలాలు గోసాయి ఆ లేఖలనుండి ఏర్చికూర్చి తన గ్రంథములో చేర్చిన కొన్నివిషయములు అతి సామాన్యమైనవి. కొన్ని ఉదాహరణములు:-

1. 'ఇటీవల నాకు ఆకలి మందముగా ఉన్నది. నోరు చేదుగా ఉన్నది.'
2. 'ఈ రోజున పప్పు వండితిని. కాని పాత్రలో నీళ్ళు ఎక్కువ పోసితిని.'
3. 'నా ఎడమచెవి కొద్దిగా నొప్పిగా ఉన్నది. కుడి మణికట్టుమీద చిన్న కురుపు లేచినది.'
4. 'నా కళ్ళజోడులో ఒక అద్దము క్రింద పడినది.'
5. 'రేపు, ఎల్లుండి, మాకు లెక్కల పరీక్షలు.'
6. 'మా బావమరది ప్రతిదినము నన్ను చూచుటకువచ్చి 4-5 నిముసము లుండి వెళ్ళుచున్నాడు.'

7. 'మా సహాధ్యాయు డొకడు చనిపోయెను.'
8. 'అనార్కలిలో ఒక జంటకాళ్ళ పిల్లవానిని చూచుటకు ఒక పైస చెల్లింతివి.'
9. 'నిన్న పెద్దవర్షము కురిసినది. నేడు ఆకాశము నిర్మలముగా ఉన్నది.'
10. 'నేను పాఠము చెప్పెదు సుందరసింగు ఒక పెండ్లి చూచుటకు గుజరాన్వాలా వెళ్లెను.'

ఇవికాక రాముని జీవితములోని కొన్ని ముఖ్యసంఘటనలుకూడ ఆ లేఖలలో ఉన్నవి. ఈ ఉత్తరప్రత్యుత్తరములనుబట్టియే లాహోరులో రామతీర్థుడు గడపిన జీవితవిశేషములను సంతరింపగలిగితిమి. ఈ లేఖలన్నియు భద్రపఱుపబడి వారణాసిలోని 'రామతీర్థప్రతిష్ఠానము' వారి అధీనములో ఉన్నవి. ధన్నామల్లు వివేకమువలన ఇవి భావితరములవారికి దక్కినవి.

రామతీర్థస్వామి ఆంగ్లభాషలోకూడ చాల లేఖలు వ్రాసెను. వీనిలో పెక్కులేఖలు ఆయన అమెరికాలో ఉండగా వ్రాసినవి. మరికొన్ని ఆయన విదేశపర్యటనము ముగించుకొని భారతదేశమునకు వచ్చినపిమ్మట వ్రాసినవి. వానిలో రెండులేఖలు ఈ దిగువ పొందుపఱుపబడినవి. స్వామి తన ఉపన్యాసములవలెనే తన లేఖలనుకూడ వేదాంతసందేశమును వ్యాప్తమొనర్చుటకే ఉద్దేశించెనని మనము గ్రహింపవలెను. వీనిలో రాముతీర్థునిజీవితమునకు ప్రత్యక్షముగా సంబంధించిన అంశములు చాల తక్కువ.

*లేఖ-1.*

ఈ లేఖ కాలిఫోర్నియాలోని శాస్తాప్ప్రింగునుండి శ్రీమతి వెల్‌మన్‌కు, ఆమె భారతదేశప్రయాణమునకు సిద్ధపడుచున్నప్పుడు స్వామి వ్రాసెను. లేఖ వ్రాసినతేది. 10-10-1903.

అమ్మా!

ప్రీతిపూర్వకమగు మీ లేఖ, కాగితములు, కవరులు అందినవి. (ఆమె స్వామికి కొన్ని లేఖనపరికరములు మొదలయానవి పంపెను.) ఆర్ద్రిహృద

యులున్న ఆ అవనీభాగముపై (భారతదేశము) మీరు కాలుమోపినవెంటనే మీకు హృదయపూర్వకస్వాగతము తప్పక లభించును. రాముడు ఇంతకు ముందే భారతదేశమునకు వ్రాసెను. మీరు అచ్చటకు వెళ్ళినపక్షమున, మీకంటె ముందుగా మీపేరు మారు మ్రోగుచుండును.

మీరు మీ యిచ్ఛవచ్చినచోట్ల మజిలీలుచేయుచు పర్యటింపవచ్చును. ఎల్లచోట్ల మీకు సుస్వాగతము లభింపగలదు.

(ఒక ప్రశ్నకు సమాధానముగా) మనము అల్పత్వమునకు, న్యూనతకు, విలాసమునకు బానిసలమైతిమేని, అగోచరమగు ప్రకృతిన్యాయముచే మనము అధోగతిపాలగుదుము. వివేకవంతుడెల్లప్పుడు హృదయమును స్వాధీనమందుంచుకొని భగవద్భావనామగ్నుడై యుండును. అతడు ప్రాపంచికవిషయములందు నిరీహుడై, నిర్లిప్తుడై వదాన్యశేఖరుడగు రాజువలె ప్రవర్తించును. సర్వకార్యములందు ఈ ఉదాత్తప్రకృతిని ప్రదర్శించుచుండును. సర్వానుభవములను పరిణతాత్ముడు నిర్వికారుడై చిఱునవ్వుతో స్వీకరించుచు-తన సహజమహత్త్వమును ఎల్లవేళల జ్ఞప్తియందు ఉంచుకొనియే వర్తించును. 'నేను ఒక్కడను, అద్వితీయుడను. నా స్వరూపమే సూర్యుడు' ఇట్టి నీ సూర్యతత్త్వమును నిరంతరభావనచేయుచు దానిని జీవితమున సర్వవిషయములందు అన్వయించుకొనుచుందువేని సర్వాత్మస్వరూపుడవగుదువు. అదియే ప్రేమ - జ్యోతిస్సు - జీవితము - మీరు బయలుదేరుటకుముందు లేదా ఓడ ఎక్కుటకుముందు రామునకు లేఖ వ్రాయగలరు. జపాను, హాంకాంగ్‌లకు చేరినపిమ్మట తప్పక లేఖ వ్రాయవలెను. భారతదేశమున మీ కేమి కావలసినను రాముడు సంతోషముతో ఆ పనులెల్లను చేసిపెట్టగలడు.

ప్రేమపాత్రుడు,
'రామ్'

2 వ లేఖ

ఇదికూడ శ్రీమతి వెల్‌మన్‌కే వ్రాయబడినది. స్థలము. ఫ్లోరిడాలోని జాక్సన్‌విల్లా_తేది_1904 వ సం. అక్టోబరు ఒకటవతేది.

పుణ్యాత్మురాలా!

ఇటీవల రాముడు మీకు ఉత్తరములు వ్రాయలేదు. కారణమేమనగా—

(i) రాముడు కొండరవనులలో నిమగ్నుడై యున్నాడు.

(ii) భారతదేశములో ఎవ్వరికిని - పత్రికలకుతప్ప - ఉత్తరములు వ్రాయలేదు.

(iii) మీరు అచ్చట కుశలముగా ఉన్నారని తెలియుచుండుటచే ప్రస్తుతము రాముడు ఉత్తరముల ఆవశ్యము లేదని తలంచెను.

(iv) మినియోపాలిస్ వదలినపిమ్మట మీనుండి రామునకు లేఖ రాలేదు. ప్రేమానురాగములతో, సుఖశాంతులతో ఉందువుగాక.

నీ అంతరాత్మప్రబోధమననుసరించి నడచుకొందువేని నీవు ఎవరి యెడల ఎట్టి తప్పిదమునుచేయుట జరుగదు. మన మెవ్వరికిని ఋణగ్రస్తులము కాము. ప్రేమసాధనయే మన కృషి. ఎట్టిఋణములు లేకయుండుటయే మన కర్తవ్యము.

ప్రతివ్యక్తి నిరాటంకముగా అనుభవమును పొందుగాక. సాటిమానవులకు సేవచేసి వారి పురోభివృద్ధికి సాయపడుటయే మనకున్న హక్కు. కాని వారి గమనము నిజముగా ముందునకు సాగునదియై యుండవలెగాని ఊహలలో కల్పించుకొన్న ప్రగతి కారాదు. నా మిత్రుల ఆధ్యాత్మికపురోగమునకు నేను సాయపడునప్పుడు నేనును వారిలో ఒకడనై పోవుదును. నీ వేమి చేయుచున్నను, ఎచ్చట ఉన్నను రాముని ఆశీస్సులు, అనురాగము నీకు సర్వదా లభ్యమగుచుండును.

క్షత్రియుండుకొని ఆచరింపదగిన దీక్షావాక్యము :—

నీ స్నేహితునిలో నీవు కనిపెట్టిన అయోగ్యత ఏదైన ఉన్నచో, దానిని మఱచిపొమ్ము.

సంతోషింపదగినది యున్నచో నలుగురికి తెలుపుము. అమూల్యమగు స్వర్ణయోగమువలె అతనిముఖమున, అది సౌగుణ్యయోగ్యతలను నెల కొల్పును.

సూర్యునివలె నిర్భయముగా, నిరంతర దానశీలుడై, ప్రతిఫలాపేక్షలేని సేవానిరతితో, నిర్వ్యాజానురాగముతో కాంతిచైతన్యములను కురియుచు, భగవన్మహిమతో, దివ్యప్రభలతో వెలుగొందుచు స్వార్థరహితమగు మహాను భావస్ఫురణతో నుండుటయే మోక్షము.

దివ్యప్రసాదమే నా ఆహారము
దివ్యామృతమే నా పానీయము
నాలో నా పరిసరములలో
ఆ లోకేశ్వరుడున్నాడు.
అతడు నిత్యము నావాడు.

భవదాత్మ,
'స్వామి రామ్'

3.వ లేఖ

రామతీర్థస్వామి అమెరికాలోనున్న శ్రీమతి పౌలిన్ విట్మన్‌కు రాజ సానములోని పుష్కరమునుండి 1905 వ సం॥ ఫిబ్రవరినెలలో ఈ లేఖ వ్రాసెను. స్వామికి ప్రకృతి సౌందర్యమునెడల ఎట్టి సునిశితదృష్టియున్నదో ఈ లేఖనుబట్టి తెలియనగును.

ధన్యాత్మురాలా!

రాము డిప్పుడు నిశ్చలము, నిర్మలము, గభీరమువగు సరోవరతీరమున నివసించుచున్నాడు. ఆకుపచ్చని శాలువ నిండుగా కప్పుకొనినట్లున్న సుదీర్ఘ

మగు పర్వతశ్రేణి ఒకవంక మన్నది. చక్కని మామిడితోపులున్నవి. రాముని నివాసగృహమున రెండు చిన్న పూలతోటలున్నవి. మనోహరము లైన మయూరములు కేకారవములుచేయుచు ఇచ్చట ముచ్చట గొలుపు చుండును. చెఱువులో ఈదులాడుచు బాతులు చూడ సొంపుగా నుండును.

ఈ సరోవరమును భూదేవి నేత్రమని అందురు. ఘనశ్యామలములగు వనములు నిండియున్న ఈ పర్వతశ్రేణి ఆ నేత్రమునకు కనుబొమవలె నుండును. ఈ కాసారము ఏ రాయి పగులగొట్టలేని పెద్ద అద్దము. దీని పాద రసపుపూత ఎప్పుడును మాసిపోదు - సర్వమాలిన్యములను ఇది కబళిం చును. ఇది వెలుగుల తుడుపుగుడ్డ. రాముడు చూచిన ఉత్తమ మూర్తివిశేష ములలో నిది ఒకటి. తన నైర్మల్యము నిది ఎంత చక్కగా నిలుపుకొను చున్నది। అలలులేచి అణగినపిమ్మట ఒక్క ముడుతకూడ ఉండక నిత్య యౌవనముతో నుండునది ఈ సరోవరము.

మన హృదయములుకూడ ఈవిధముగనే ఉండునుగాక.

పచ్చని ఎఱ్ఱని రంగుల ఉడుపులను
ముచ్చటపడి తొడిగిన విహగములు
తూగెడు తీగల ఊయాలలలో
ఊగుచు హాయిగ బారులుగా
ఇంద్రచాపములు విరిసినవోయన
ఎగురుచునున్నవి కుజములపై :

మధురగాన లహరులలో
మత్తిల్లిన మాదిరిగా
మందమందయానముతో
వనవీధుల విహరించును :

విహగసమితి వినిపించును
మృదుల గానకలరవములు

దూరదూరమున జలపాతపు
ధారల సంగీతమట్లు:
సరసళించి పాడుకొనుచు
సరిసరముల మనలను
పరికింపవు; గమనింపవు.
శాంత్యాశీః ప్రేమార్థమగు

భవదాత్మ,
'స్వామి రామ్'

4 వ లేఖ

1905 వ సం॥ అక్టోబరునెల 11 వ తేదిని ముజఫర్‌పూరునుండి రామతీర్థస్వామి పూర్ణసింగునకు వ్రాసిన లేఖ ఇది. ఉత్తర ఖండపర్వతములలో నుండగా స్వామి తీవ్ర వ్యాధిగ్రస్తుడైనపిమ్మట గాలిమార్పుకొఱకు ముజఫర్‌పూరు వెళ్ళెను.

ప్రియతమ।

విభూతిస్నానముతో చర్మము శుభ్రపడినది. మూడుపర్యాయములు వరుసగావచ్చిన శారీరకవ్యాధులు తమతోబాటు నా త్వగింద్రియజ్ఞానమునుకూడ తీసికొనిపోయినవి. అందులకే నేను వ్యాధులను బాధలను ప్రీతితో అహ్వానింతును.

ఇంటిలో శవము ఉన్నంతవఱకు అపాయకరములగు క్రిమికీటకాదుల వలన హానిజరుగుట కవకాశముండును. మృతకళేబరమును తొలగించినచో ఆరోగ్యమునకు హానిజరుగదు. అట్లే శరీరస్మృతి యున్నంతకాలము ప్రాపంచికరోగములకు అహ్వానము నెఱపుచున్నామన్నమాటే. శరీరమును తత్సంబంధవిషయములను దగ్ధముచేసిన మఱుక్షణమున మనము తిరుగులేని ఏలుబడి చెల్లింపగలము.

ఓహో, ఓహో, ఓహోహో,
లే దసూయ భయములేదు నుంత
ప్రేమాస్పదులలో ప్రియతముడ నేను
పాపములేదు దుఃఖభారములేదు
గతములేదు రేపు లేదు.

తలనెఱపి లంబోదరులై యుండెడి మహాత్ములు: ప్రయోగశాలలలోను నక్షత్రపరిశోధనశాలలలోను అమాయికులగు విద్యార్థులను ఆశ్చర్యచకితులనుగాజేయు కళ్లద్దాల ఆచారవర్యులు: అనాచ్ఛాదితశిరస్కులై ఉపన్యాస వేదికలనుండి గర్జించుచు సభాసదులను నిర్వాక్కులుగా జేయగల మహావక్తలు, ఎల్లప్పుడు దేనికో ఒకదానికి ఆరాటపడుచు అది లేదు ఇది లేదు అని గొణుగుచుండెడి పేదలు, భాగ్యవంతులు - అందరు నేనే!—

*లేఖ*

ఇది రామతీర్థస్వామి వశిష్ఠాశ్రమమునుండి 1906 వ సం॥ జూన్ మాసాంతమున ఆర్. బి. బైజ్‌నాథ్‌కు వ్రాసిన లేఖ.

భగవంతునిదృష్టినుండి పరిశీలించినచో ఈ విశ్వము ఒక అందాలరాశి-మూర్తిగొన్న మహానందము - ఆనందవృష్టి - దర్శనపరిమితత్వము తొలంగిపోయినచో మనకు ఏదియు అసుందరముగా కన్పట్టదు. 'సర్వప్రపంచము చక్కగా రమణీయముగా ఉన్నది' ప్రకృతి శక్తులన్నియు మన కాలు సేతులుగా, ఇంద్రియములుగా పరిణమించును. ఆత్మయే ఆనందము - అదియే సర్వస్వము - కావున ఆత్మజ్ఞానమనగా నా ఆత్మను బ్రహ్మానందముగా - ఈ ప్రపంచరూపమున ముద్దకట్టినదానిగా - ఎఱుంగుటయే. నా ఆత్మరూపమగు ఏ విశ్వము అవతారమెత్తిన మహామాధుర్యము. కాగా నే నెవరిని నిందింపనగును? ఏమని విమర్శింతును?

ఓ! ఆనందమా! తత్సర్వము - నేను - ఓం.

కష్టమును జయమునుగూర్చిన ఆధ్యాత్మికసూత్రమును వేదము లెంత చక్కగా వివరించుచున్నవో చూతము. హృదయాంతరమున ఎవ్వరైనను దేనినైన సత్యమని దృఢముగా విశ్వసించవచ్చును. కాని సత్యమని నమ్మిన ఆ వస్తువు అతనిని మోసగించితీరును. ఈ సూత్రమును భూమ్యాకర్షణ సిద్ధాంతముకంటె బలవత్తరము. అసత్తును సత్తుగా చూచుచున్న మనము భ్రాంతి పొందుచున్నామను సత్యమును ఆత్మ మనకు ఎఱుకపఱుచును.

## ఆంగ్ల భాషలో రాముని పద్యములు

రామతీర్థస్వామి ప్రవక్తయే కాక మంచి కవికూడ. సున్నితమగు ఆయన దృష్టి పరిసరములయెడల త్వరితముగా స్పందింపగలిగి యుత్తేజమును పొందుచుండును. ఈ ఉత్తేజము తఱచు పద్యరూపమున వ్యక్తమగు చుండెడిది. ఒక్కొక్కప్పుడు ఉర్దూభాషలోను, ఒక్కొక్కప్పుడు ఆంగ్ల భాషలోను ఆయన పద్యములు చెప్పుచుండెడివాడు. బహుకాలముగా రామ తీర్థుడు పారశీక భాషాధ్యయనము చేసినవాడు కావున ఆయన వ్రాసిన ఉర్దూ పద్యములలో ఛందోదోషము లంతగా ఉండెడివికావు. కాని ఆయన ఆంగ్ల రచనలవిషయమున అట్లు కాదు. ఆవేశోద్వేగములతో రామతీర్థుడు 'పోపు' వలె అసంఖ్యాకముగా వ్రాసెను. అయినను సరియగు ఛందశ్శాస్త్రశిక్షణ లేకపోవుటచే ఆయన ఆంగ్లరచనలలో సుశిక్షితులైనవారికి కొన్నిలోపములు పొడగట్టును. అయినప్పటికీ రామతీర్థస్వామి రచనలలో రచనావిధానము కంటె విషయమునకే ఈదేశమున మనము ప్రాధాన్యమిత్తుము. మనలో చాలమందికి రచనలోని విషయమే ముఖ్యము.

లక్నోలోని స్వామి రామతీర్థ ప్రచురణసంఘమువారు 8 సంపుటములలో ప్రకటించిన రామతీర్థుని సమగ్రరచనలను గ్రంథమునకు పీఠిక వ్రాయుచు కీ॥ శే॥ పి. ఎవ్. ఆండ్రూస్ ఇట్టి అభిప్రాయమునే వెలిబుచ్చెను. ఆయన ఇట్లు వ్రాసెను :

'ఆయన బాలభాగములు మార్పులుచేసి చాలచోట్ల సంక్షిప్తపఱచి యుండవలసినది. కేవలావేశవశుడై వెంటనే కాగితముపై పెట్టిన పద్యములలోని ఛందస్సునుకూడ ఆయన పరిదిద్దుకొనియుండవలసినది. ఈ విషయమున పాఠకునకు కొంత నష్టము వాటిల్లినను ఒకవంక కొంత లాభముకూడ జరిగినది. నిర్దోషతయందు నిర్మాణసౌష్ఠవమునందు వచ్చినలోపమును రచనలలోని నిత్య నూత్నతయు ఉద్దండతయు పూరించుచున్నవి.'

నిజమునకు ఆండ్రూస్ రామతీర్థుని వేదాంతభావగర్భితమగు కవితాతత్త్వమునకే ఎక్కువ విలువ కట్టెను. ఆ పద్ధతియే రామునిభావనకు నూత్నతను మౌలికతను సంపాదించినది. స్వామి గేయములలో ఆయనకు ప్రకృతియెడ గల పరమానురాగము, తద్దర్శనమున ఆయన పొందిన ఆనందోల్లాసములు వ్యక్తమగుచుండును. సాంఘికముగా, జాతీయముగా స్వామి వేదాంతతత్త్వమును క్రైస్తవసర్వజనహితేచ్ఛను జోడించిచూపుటలో కనబఱిచిన ప్రజ్ఞను ఆండ్రూస్ మిక్కిలి కొనియాడెను. స్వామి తనకు సహజమయిన, ఆనందానురాగమును పద్యములలో పరవళ్లు త్రొక్కించి, వానిమూలమున ఇతరులలోకూడ తన హాసములకు ప్రతిధ్వనులు కల్పించుశక్తినికూడ ఆండ్రూస్ స్పష్టముగా గుర్తించెను.

రామతీర్థుడు ఆంగ్లభాషలో వ్రాసిన పద్యములలో కొన్ని ఇచ్చట ఉదహరింపబడుచున్నవి. ప్రకృతిసౌందర్యమును వర్ణించు తావులలో స్వామి యొసంగదలచిన వేదాంతసందేశము తొంగిచూచుచుండును.

(i)

నా హృదయదేవాలయమున ప్రేమజ్యోతి కాంతిపుంజమును వెదజల్లుచున్నది;

కంటకములచే నొప్పించునట్లు తోచుచున్నను ప్రేమలతాంతములు సౌరభమును వెదజల్లుచున్నవి;

వసంతశోభకు పరవంతానమై స్వేచ్ఛాజీవులగు పసిడితెక్కల పక్షులు ఆనందగీతముల నాలపించుచు స్వాగతము పలుకుచున్నవి।

ఆనందరూప నిత్యవసంతము ఉజ్జ్వలశోభలను వెలార్చుచున్నది।

కేదారములు, సరోవరములు, శైలాగ్రములు ప్రభాతారుణకాంతిరంజితములై మనోహరము లగుచున్నవి.

తరుశాఖలనుండి పుష్పగుచ్ఛములు తేనెసోనలు కురియుచున్నవి.

రమణీయ వర్ణవిలసితములగు ఇంద్రచాపములు మందహాసముతో విశాలదిఙ్మండలరేఖను అలంకరించుచున్నవి.

(ii)

ఈ రచన రామతీర్థుడు కాలిఫోర్నియాలోని 'శాస్తా స్ప్రింగ్సు'లో ఉండగా, ఒక అర్ధరాత్రమున వెన్నెలలు ఆయన కుటీరములోనికి చొచ్చుకొనివచ్చుచున్నప్పుడు ఆ వెన్నెలపై వ్రాసినది—

'ఉన్నతశైలమునుండి నీవు పరిశీలింతువు. లజ్జావిభూషితయగు ముగ్ధవలె నీవు నలుగడల తిలకించి ఎవ్వరు లేకుండుటగని నా ఏకాంతనివాసమును పరిశీలించి భసితసితమగు మనసమున సిగ్గు తొణకిసలాడుచున్నను సాహసముతో గవాక్షమునుండి యింటిలోనికి ప్రవేశించి క్రమముగా నా శయ్యాతలమునుజేరి క్రిందకువంగి నా ఫాలమును కన్నులను ముద్దాడి నన్ను మేల్కొల్పుదువు. ఉజ్జ్వలమగు నీ స్పర్శ, ఏదియో రహస్యము నుపదేశించు నీ నిర్మలతేజము, నీ మధురనిశ్వాసము, నా నిద్రను పారద్రోల నీవు నేను కలిసి ఒక క్షణము గడపితిమి. మనము పరస్పరమైక్యమగువఱకు భవత్సుధారసమును తనివితీర గ్రోలుదును.

(iii)

నాగరకత।

అర్థమాత్రయులేని స్వప్నమా। ఓ నాగరకతా। నీవు బాహ్యములగు నామరూపములకు విలువనిచ్చుచు ఆడంబరమను మూర్ఖతాధూళిని రేపుదువు. అజ్ఞానాంధకారమునబడి నీవేమియు గ్రహింపలేవు. అల్పాల్పకార్యములు

సాధించుటకు అష్టకష్టములు పడుదువు. మమకారమును పెంచుకొనుటకు ఆత్మనాశనమునకైన వెనుదీయవు. ప్రజలమెప్పుకొఱకు పవిత్రమగు ఆత్మను అపవిత్రమొనర్తువు.

క్రొత్తక్రొత్తరుచులకు గ్రుడ్డిగా దాస్యముచేయుచు, మహావంచకుల అభిరుచులకు తలయొగ్గి మెలగుదువు. ఇతరుల కృత్రిమప్రవర్తనను, వద్ధతులను నీ వనుకరింతువు. 'మనకు దీనివలన ఏమైన లాభించునా?' అను ప్రశ్నయే నీ కడుగడుగునకు తోచుచుండును. 'ప్రజ లేమనుకొందురు?' అని అనుక్షణము భయపడుచుందువు - పిరికిపందవు - బలములేని గడ్డిపోచవు - అనుక్షణ భయపీడితవు - మహామారి (అంటువ్యాధి)వలె దేశములందు వ్యాపించి ప్రజలను ఉన్మత్తులుగా చేయుచున్నావు. వ్యర్థములు, వినాశకరములునగు నీ సోకడలనువదలి తెలివిగలిగియుండుము - తెలివిగలిగియుండుము.

(iv)

సౌఖ్యరహస్యము :-

ఉల్లాసము తొణకిసలాడెడి ఓ! విహంగమా!
ఇటురమ్ము! ఇటురమ్ము! నాకొక కథ చెప్పుము.
రేపటిమాటయే తలపునకురాకుండ ఎల్లప్పుడు నీవు సుఖసంతోషములతో
ఎట్లుండగలుగుచున్నావు?
ఆ విహంగము కలస్వనమున రహస్యముగా ఇట్లన్నది :
'కారణము విస్పష్టము. నీకు తెలియునుకదా!
సూర్యకాంతి, నవనవలాడు పచ్చనిచెట్లు, మలయమారుతము - వేయేల,
సర్వప్రకృతి - నాకు పరమప్రియము.
నా చుట్టును ప్రకృతి నవ్వుచు కేరింతలాడుచుండగా నేను దిగులుగా దీనముగా ఏల ఉండవలెను?
నాకు కావలసినదెల్ల సంతోషముతో సమకూర్చుటకు ప్రకృతి ఎల్లప్పుడు
సిద్ధముగా ఉండును. ప్రకృతికిని నాకును అభేదము.

అందులకే నేను ఉల్లాసముతో పాడుదును. సుఖముగా నా పని నేను చేసి కొందును.

ప్రకృతి నాకు నిత్యము వశంవదమై యుండుమ.

(v)

ప్రియుని ప్రతిబింబము :

నా ప్రియుని ప్రతిబింబమును నే నెట్లు పొందగలను ?
అతని రూపసామ్యముగల వస్తువు అసలు ఊహకు అందునా ?
అతని ఛాయాచిత్రమును తీయుట సంభవమా ?
అతని చిత్రమును ఏ చిత్రకారుడు వ్రాయగలడు ?
అతడు రంగులలో, రేఖలలో గోచరించునా ?
ఛాయాగ్రాహి యంత్రము కరగిపోయెను.
అతని తేజఃపుంజము అనంతము । అనంతము.
నా ప్రియుని ప్రతిబింబము నే నెట్లు పొందగలను ?
అతని చిత్రమును తీయుటకు నా హృదయమను ఛాయాగ్రాహియంత్రమును తెచ్చితిని.
కన్నులను అనువుగా అమర్చితిని.
మనస్సును ఏకాగ్రముచేసి ప్రసరింపజేసితిని.
కాని ఈ పరికరములన్నియు కరగిపోయినవి.
అతని తేజఃపుంజము అనంతము । అనంతము.
నా ప్రియుని ప్రతిబింబము నే నెట్లు పొందగలను ?
అతని ప్రతిబింబమును పొందగలుగుట అసంభవము.
కావున అతనినే పొందుదును.
సూర్యుడు అతని ఛాయాచిత్రము, మానవుడు అతని ప్రతిరూపము.
అతడు - తారకలలో మిణుకుమిణుకుమనుచుండును.
మరళికుసుమములలో శుచిస్మితము లొలుకుచుండును.
వరభృతములలో పాటలు పాడుచుండును.

మహావాయువు లాతని ఉచ్ఛ్వాసనిశ్వాసములు.
మనోమనాంబువు లాతని ఆనందాశ్రువులు.
శీతలయామిను లాతని శయనవేళలు.
గలగలసాగెడి సెలయేళ్లు లాతని పరుగులు.
ఇంద్రధనుస్సు లాతని తూగుటుయ్యేలలు.

(vi)

విశ్వాసము :

కులమతములతో నా కేమిపని?
కార్యాచరణము—
నేను కోరునది—
కార్యాచరణము—
తెగలెందుకు?
వర్గము లెందుకు?
మనకు వలసినది
మానవుడు!
మానవుడు.
ప్రేమకు, సుఖదుఃఖములకు
వారమలగు మానవులందున
ఎవడధికుడు? ఎవడల్పుడు?
కొండలు లోయలు
అకసమంబుధి
అందఱివీ—
మానవు లందఱివీ—
కిరీట మెందుకు?
తురాయి ఎందుకు?

విశిష్టచిహ్నమె
విశాలహృదయము
జీవిత శిఖరములను చేరుటకై
కావలయును ఘనయత్నము
వెలయవలయు విశ్వాసము
అమరవలయు ఆకాంక్షయు.

ఈశ్వరు డొక్కడు
మానవులందఱు ఒకటేజాతి
ఈ సత్యము నెఱిగించెడు
మేధ వలయు కనులు వలయు.

(vii)

అంభోధులు ఘూర్ణిల్లును
కూలంకష లుప్పొంగును
నాలో-నాలో-నాలో

కుసుమహాసములు విరియును
మలయమారుతము వీచును
నాలో-నాలో-నాలో-

ఉత్సవ డోలికలూగెను
యుద్ధజ్వాలలు రేగెను
నాలో-నాలో-నాలో

పర్వత విజృంభణమున్నది
ప్రకృతి వికాసంబున్నది
నాలో-నాలో-నాలో

తోకచుక్క లెగురుచుండె
ఉల్కలెల్ల సుడియుచుండె
చలిగాలులు నిట్టూర్చును

ఉరుములు గర్జించును
నాలో-నాలో-నాలో

శత్రువు జగడంబాడును
మిత్రుడు ఆశ్రయమొందును
కన్నతల్లి నిదురించును
చిన్నపావ రోదించును
నాలో, నాలో, నాలో.

# 12. మతభావన

రామతీర్థస్వామి తనజీవితమున క్రియాత్మకములగు శక్తులు వేదాంతమున సమ్యగవగాహనము సాధించుటకు, తాను గ్రహించినది ఇతరులకు బోధించుటకు వెచ్చించెను. ఆయన నూతనమతమునుగాని మతశాఖనుగాని నెలకొల్పలేదు. ఆయన బోధనలన్నియు ప్రాచీనభారతీయ విజ్ఞానరాశియగు వేదముల సారమైన ఉపనిషత్తులకు సంబంధించినవే. నిరంతరాధ్యయన మనన ములతో ఆ విజ్ఞానమును తాను ఆత్మీయమునుచేసికొని, దానిని సులభగ్రాహ్యముగా ప్రజలకు అందించుటయే ఆయనలోని ప్రత్యేకత. ఆయనలో వెలుగొందిన ఆ విజ్ఞానజ్యోతి దగద్ధగాయమానముగా పెక్కెండ్లు వెలిగినది. పిమ్మట ఆయనశరీరము తఱుచు రోగగ్రస్తమగుటచే తదనుగుణముగా మనస్సుకూడ బడలిపోయినది. ఆయన జలగండమునకు ఎరకాకున్నచో, ఆయన దేహారోగ్యము చికిత్సాదులచే కాపాడబడినచో, స్వామి తన కార్యకలాపమునంతను సంపూర్ణముగా నిర్వహించియుండెడివాడనియు, ఆయన కీర్తి వేయిమడుంగులు ఎక్కువ వ్యాపించియుండెడిదనియు అనుటకు సందేహము లేదు. ఈ 'అయితే' 'గియతే'లు చరిత్రలో కరగిపోయినవి. స్వామి తన అల్పకాలికజీవితమునందు ప్రకాశింపజేసిన వెలుగును వ్యాప్తి చేయుటయే మన విధి.

రామతీర్థుడు తన సందేశములకంటె భిన్నమైనవాడు కాడు. కావున ఆయన జీవితచరిత్రగ్రంథమును ముగించుటకుముందు, మతవిషయమున, విశేషించి, వేదాంతమునుగూర్చి, ఆయన అభిప్రాయములను క్రోడీకరించుట సమంజసము. ఈ దిగువ వ్రాయబోవు కొన్ని ముఖ్యాంశములు, ఆయన ఉపన్యాసములనుండి గ్రహింపబడి, ఎడనెడ స్వామివాక్యములతోనే పొందుపఱపబడినవి.

మతనిర్వచనము : మూలహేతువునకు మానవుని గొనిపోవునది మతము. కాని మానవుని మనస్సు లేక బుద్ధి తనకు మూలాధారమగు ఆ అవిజ్ఞేయముమగూర్చి తెలిసికొనజాలదు. వేదాంతభిన్నమగు మతము మనోబుద్ధులను హరింపజేయగల మాంత్రికశక్తి గలది. మహమ్మదీయుడు ప్రార్థన చేయునపుడు తాను చేరదలచుకొన్నది ఎచ్చటనో ఊర్ధ్వముగా, దూరముగా ఉన్నదనుభావమును సూచించుచున్నట్లు చేతులు పైకెత్తును. హిందువుడు, తన చిత్తము లయమయిపోవు ఆ మహాపదార్థము అగోచరము అని సూచించుచున్నట్లు ధ్యానస్థితిలో కన్నులు మూసికొనును. కావున అవిజ్ఞేయమును దర్శించుట మతము. ఆ అవిజ్ఞేయమునందు మనశ్శరీరములు, దేశకాలములు, తదంతఃపాతులగు విషయములు - ఈ ప్రపంచము, తదితరములు - సర్వమును శూన్యములై పోవును. అది వాక్కులకందని స్థితి. ఈ గమ్యమును చేరుటకైన శాస్త్రీయయత్నములే మతముల స్వరూపము.

విగూఢమగు అట్టి గమ్యమును లక్ష్యీకరించుట కావశ్యకత ఏమియని విచారించుటకుముందు మానవుని ఆకర్షించిన ముఖ్యాశయోద్దేశములనుగూర్చి పరిశీలింపవలయును. మొదట బాహ్యసాహాయ్యమునపొందిన జ్ఞానము ఉన్నది. కాని నిజమగు విద్య, బాహ్యసాహాయ్యములవలన గాక, సర్వజ్ఞానమూలమై అంతరముననున్న అఖండత్వమును మానవుడు చేరుటతో మొదలగుచున్నది. యుద్ధరంగములలో అద్వితీయ శౌర్యపరాక్రమములను ప్రదర్శించు యోధులు అపరిమితమగు అధికారోన్మాదము కలవారు. వారికి తమ శరీరము, ఈ ప్రపంచముతప్ప వేరేమియు గోచరింపదు. తమ 'దివ్యలోకము' లోకములో మునిగిపోయినవారు తమకుతామే అన్నట్లు ప్రవర్తింతురు. తెరవెనుకనున్న ఆ అధికారమున లీనమైపోవు ఆ ధైర్యశాలిత్వము కూడ ఒక మతమే.

ఇక *శక్తి* ఉన్నది. కొందఱు ఉత్తమజీవులు తమ సర్వస్వమును దివ్య ప్రణయముకొఱకు త్యాగముచేయుదురు. మానసిక *శక్తి* వేరు; ఆనంద పార వశ్యముతోచేయు ప్రార్థన వేరు. అట్టివారు స్వార్థబాధవిముక్తులే. ప్రేయసీ ప్రియభావస్ఫురణాబంధురమగునదియే ఉన్నతప్రణయము. ఇట్టి యర్థమున ప్రేమకూడ మతమే యగుచున్నది.

*పారవశ్యమన* సౌఖ్యము. మనశ్శరీరములకు, ప్రపంచమునకు బాహ్య మగుదానినుండి పొందిన యీ ఆనందమువలన మనము తాత్కాలికముగా నైనను ద్వంద్వాతీతస్థితి పడయుదుము. ఈ పరిశీలనవలన, జీవితమున ఉదాత్తములు, వాంఛనీయములునగు ఫలితములన్నియు మనస్సు, బహిః ప్రపంచము-అవిజ్ఞేయమగు పరతత్త్వమునందు లీనమయినప్పుడే సిద్ధించు నవి నిరూపింపబడినది. ఇంద్రియసౌఖ్యములుకూడ మతమే కావచ్చును కాని అవి రాజసభలోనికి మురికికాలువ తూములనుండి ప్రవేశించుట వంటివి.

వేదాంతము-మతము : అవాఙ్మనసగోచరమగు దానిలోనికి తొంగిచూచు టకు వేదాంత, విజ్ఞానశాస్త్రములు చేసినయత్నములన్నియు విఫలము లైనవి. దేశకాలములు, కార్యకారణసంబంధము, తత్పరిశోధనయత్నములను విరోధించుచున్నది. తత్త్వశాస్త్రములన్నియు మూఢవిశ్వాసముద్రితములు. ఒకశాస్త్రము మఱియొకశాస్త్రమును ఖండించును. ఫలితముగా ఈ ప్రకృతి రహస్యము అనిర్వేద్యమైనది. మానవుని మస్తిష్కమునకు జగత్తుయొక్క లోతుపాతులు అంతుపట్టుట లేదు.

అయినచో ఈ పరతత్త్వాన్వేషణమంతయు వృథాయానమేనా? మన శక్తియుక్తులనన్నిటిని తుపాకిమందులు తయారుచేయుటకు, రైలుబండ్లు నడుపుకొనుటకుమాత్రమే వినియోగించుకొనవలెనా? ఈవిధముగా విరాశ చెందవలదని *ఉపనిషత్తులు* మనకు బోధించుచున్నవి. మనము ఈ ప్రశ్నలకు సమాధానము లరయవలసిఉన్నది: ఈ జగత్తు పుట్టుక ఎప్పుడు? నేను

ఎందులకు ? ఈ భూమ్యాకాశముల భావమేమి ? నిజమునకు ఈ ప్రశ్నల లోనే వానిరహస్యము ఇమిడియున్నది. రాబందు తా నెగురుచున్న వాతా వరణపరిధి దాటి ఎట్లు పోలేదో అట్లే రెండుభావములు తమతమ పరిమిత పరిధులనుదాటి పోలేవు. ఒకా నొక విశిష్టపరిజ్ఞానముతో మనము గమ్య మును చేరగలిగినచో ఇక అచ్చట ప్రశ్నయు లేదు సమాధానమును లేదు. ఇంద్రియసుఖాదికమునుండి విడివడి వేదాంతము ఆ గమ్యమును లక్ష్యముగా గొని సాగును. ఆ మహాదర్శనము పడసినవాడు బ్రహ్మమే యగును. ఆ దర్శనమును ఒక్క క్షణమాత్రము లభించినను చాలును. ఇక అతనికి భయాందోళన లనునవియే ఉండవు.

భగవంతుడు-మానవునిబాధలు : హిందువులు ప్రతివ్యక్తియు భగ వంతుడనియే విశ్వసింతురు. అట్లయినచో మానవులు ఏల బాధలు పడు చున్నారు ? అనునది ప్రశ్న. వారు బాధలుపడుట బాధలనుండి తప్పించు కొనుమార్గము తెలియకకాదు. నివారణోపాయము భద్రపఱుపబడియున్న పేటికను ఎట్లు తెరువవలెనో తెలియకపోవుటయే హేతువు. అనగా వారు తమ ఆత్మస్వరూపమును తెలిసికొనలేకున్నారన్నమాట. మన ఆత్మస్వరూప మును మనకుమనమే బోధించుకొనుటకు చేయుయత్నమే మతము. మనలో నున్న ఆ 'అమూల్యాభరణము'నకు మనమే చేతులార ఒకతెరను అడ్డము వేసి జీవితమును దుఃఖభాజనము చేసికొనుచున్నాము.

మన కన్నుల కప్పుకొన్న తెరలను తొలగించుటకు చేయు యత్నములే వివిధమత సంప్రదాయములు. కొన్ని సంప్రదాయములలో ఈ తెర పలుచగా ఉండును. అన్నిమతములలోను ఆధ్యాత్మికవేత్తలున్నారు. వారివలన తాత్కా లికముగా ఈ తెరలు తొలగింపబడి సత్యదర్శనమగుచుండును. తక్కిన మత ములకంటె వేదాంతమునందున్న మెఱుగు ఏమనగా అది ఈ అవిద్యాయవ నిక (మాయ)ను సాధ్యమయినంత పలుచగాచేసి జ్ఞానికి బ్రహ్మానందస్థితి కలి

గించును. భగవంతునిలో నైక్యముకాగలస్థితి పొందిన మహానుభావులందరు, ఏ మతమువారయినను, బ్రహ్మానుభవస్థితియందు ఆ తెరలను తొలగించి యుంచుదురు. వేదాంతికూడ అట్టిస్థితియందు ఆ యవనికను తొలగించుటయే కాక తదితరావస్థలయందుపైతము బ్రహ్మానుభూతి పొందుచునే ఉండును.

మతత్రయము: భిన్నభిన్నమతములను మూడు ప్రధానభాగములుగా పేర్కొనవచ్చును. మొదటిదానియందు తెఱ దట్టమైనది. ఇందు భక్తుడు 'నేను భగవంతుని వాడను' అనును. అతడు భగవంతుడు తనకు దూరముగా, అగోచరుడై యున్నాడని భావించును. భగవంతుని ప్రథమపురుషలో పేర్కొనుచుండును. ఈస్థితియే మతమునకు ఆరంభదశ. అతనికి ప్రపంచమంతయు భగవంతునిది. ఇది అతనికి సంపూర్ణముగా ఎఱుకపడినచో అదియు మేలే - ఏమనగా ఈ భావనవలనకూడ అతనికి పరమానందము లభ్యమగును. కాని ఒకమతముగా చూచినచో ఇది ప్రారంభదశ యనియే చెప్పవలెను. ఇక, రెండవదశలో భక్తుడు 'నేను నీవాడనే; నాకు అనుక్షణము నీవే కావలయును' అని భగవంతుని వేడుచుండును. మొదటి దశ మధురము; ఈ దశ మధురతరము. ఇచట భగవంతుడు మనకు ముఖాముఖిగా ఉండును. అయినను భక్తునకు ఈదశలో అవిచ్ఛిన్నభక్తివిశ్వాసములు కొఱవడుటకు అవకాశము లేకపోలేదు. ఇక మూడవదశలో భక్తుడు భగవంతుని 'నేనే నీవు' అని భావించును. ఈ చరమావస్థయందు ఇరువురును, ప్రేయసీ ప్రియులవలె, అవ్యాజానురాగమున ఒక్కరే అగుదురు.

ఇదే అనుభూతవేదాంతము. శలభము దీపమునుచేర్చి శరీర మాహుతి చేసి వెలుగును. ఇది సర్వోత్కృష్టమగు భక్తి. విజ్ఞానమునకు తుదిమెట్టు వేదాంతమే. ఈ తత్త్వమునెఱిగిన కొందరు తామూ తెరను తొలగించుకొని బ్రహ్మానంద మనుభవించుటయేకాక తామే బ్రహ్మమనుభావమును పొందుదురు. వీరినే జీవన్ముక్తులందురు. ఇట్టి వివేకముచేతనే మతమునకు ధాళ

ధర్మ్యముకలుగుటయు. ఆ తెర పలుచనగుటయు జరిగి యా బ్రహ్మభావనచే మాయా యవనిక తొలగిపోవును.

సర్వము భగవన్మయము : వేదాంతము 'నీ ఆనందమును నీవే సాధించు కొనవలెను' అని చెప్పును. ఇందులో ప్రాపంచికవాంఛల కేమి ప్రమేయ మున్నది? సత్యమును దర్శించి విముక్తుడవు కమ్ము. వేదాంతము బోధించు అనుభవము అంత సులభమైనదికాదు. ఏమనగా జనబాహుళ్యము (ముఖ్య ముగా పాశ్చాత్యులు) తాము భగవంతునిగా పరివర్తనము పొందవలెను కాబోలు అనుకొని, తమయందు దైవత్వము సృష్టించుకొనవలెను కాబోలు అనుకొనుచుందురు. కాని వేదాంతము 'నీవే భగవంతుడవు. భగవంతుని కంటె వేరేమియులేదు' అనును. దైవత్వమును సాధింపనక్కరలేదు. ఉన్నదానిని గుర్తించి, తెలిసికొని అనుభవించుటయే. దానిని నీ అనుభవము లోనికి తెచ్చుకొనుట. అంతే. ఒకడు ఒక నిధిని ఎప్పుడో భూమిలో దాచి దానిసంగతి మరచిపోయెను. రెండవవానిదగ్గర అసలు నిధి లేనేలేదు. మొదటివాడు జ్ఞప్తికితెచ్చుకొని నిధిని త్రవ్వి తెచ్చుకొనును. రెండవవానికి ఏమియు లేదు. నిధి అచ్చటనే ఉన్నది. దానిని తీసికొని సుఖపడుము. ఆత్మ సహజముగా అపవిత్రము, పాపపంకిలము కానేకాదు. ఆత్మ ఒక మానవుని పాపమువలన పతనమైపోలేదు. అది మరియొక మానవుని పుణ్యమువలన ఉద్ధరింపబడుననుటయు లేదు.

నల్లమద్దిబల్లను ఎంత తోమినను తెలుపురాదు. కాని దుమ్ము పేరుకొని యున్న అద్దమును శుభ్రముగాకడిగి తుడిచినచో తళతళలాడును. అద్దము నకు తళతళ మనము సృష్టించినది కాదు. అంతకుముందున్నదానినే మనము బయలుపరచితిమి. నల్లబల్ల విషయమున అట్లుకాదు. మానవునకు సహజమై గాఢముగానుండు మోక్షకాంక్షయే తాత్కాలిక ధూసరత్వముపొందిన ఆత్మ యొక్క పావిత్ర్యమునకు గురుతు. మానవుని యధార్థప్రకృతి భగవంతుడు.

అట్లుకానిచో లోకమున ప్రవక్తలు, మహర్షులు అవతరించుటయే జరగదు. కావుననే రామతీర్థస్వామి 'భయపడకుము. పైకిరమ్ము. నీ సర్వశక్తులను సమీకరించి ధైర్యముతో ముందుకువచ్చి నీ జన్మహక్కును స్వాధీన పఱచుకొనుము' అని బోధించెను.

నీ యధార్థస్వరూపము - నీ ఆత్మ - స్వచ్ఛమైన స్ఫటికమువంటిది; దేదీప్యమానమగు వజ్రమువంటిది. దానిని నీవు నల్లనివస్తువుముందు ఉంచితివా, నల్లగా కనబడును. ఎఱ్ఱనివస్తువుముందుంచితివా, ఎఱ్ఱగా కానవచ్చును. నిజమునకు స్ఫటికమునకు రంగులేదు. అది వర్ణాతీతము. అట్లే నీ ఆత్మ. నీ యధార్థస్వరూపము - సర్వవర్ణాతీతము - స్వయంభువము - 'నేను'—

పాపముల స్వరూపము :-ముఖస్తుతి ఘోరపాపము కాదు. అది సార్వజనీనము - పిపీలికాది బ్రహ్మపర్యంతము స్తుతికి వశమగుట ఏల? ప్రతివ్యక్తి ఏల స్తుతికి బానిసయగుచున్నాడు? తాను ఇతరులచే శ్లాఘింపబడవలెనని, గొప్పవాడుగా భావింపబడవలెనని యేల కోరుచున్నాడు? కుక్కలు గుఱ్ఱములుకూడ లాలన కోరును. వేటకుక్క మూడు అంగలలోపోయి జంతువును పట్టుకొనజూచును. ఆ యత్నము విఫలమైనచో అది దిగాలుపడి చదికిలబడును. అప్పుడు వేటకాడు దానిని కొరడాతో ఒక్కటి చఱచును. ఆ దెబ్బతో అది మరల బలము పుంజుకొని పరువెత్తును. దేవతలుకూడ స్తుతిప్రియులు. ప్రతివ్యక్తికిని స్తోత్రప్రయత్నము ఉండును కాని నిజముగా భక్తులస్తోత్రములకు అర్హులగువా రెంతమందియుందురు? దీనినే వేదాంతమిట్లు విశదపఱచుచున్నది: ప్రతివ్యక్తియందు ఆత్మ ఉన్నది. అది మహత్తులన్నిటికంటె మహత్తు. ఎవరైన మనలనుమెచ్చి, స్తోత్రముచేసినచో మనము సంతోషింతుము. ఎందులకు? మన ఆత్మ ఆ స్తుతికి అర్హమైనది కనుక - ఇట్లనుటచే రామతీర్థుడు స్తుతిని సమర్థించుచున్నాడని కాదు.

ఏ స్తుతియైనను ఆత్మ నుద్దేశించియే ఉండవలెను. గాని శరీరపరము కారాదు. ఆత్మనుమరచి శరీరమునే స్తోత్రముచేయుట మనము చేయుచున్న పొరపాటు.

అహంకారము :-ఈ అహంకారదోషము ప్రపంచమున ప్రతివ్యక్తియందు ఉన్నది. శరీరము గర్వపడుటకు కాని ఆధిక్యమును భావించుటకుగాని అర్హమైనదికాదని తెలిసియు ఎవ్వడును అహంకారమునుండి తప్పించుకొనలేకున్నాడు. ఈ వైపరీత్యము మనయందే ఉన్నది. సర్వోత్కృష్టమగు ఆత్మ మనలో ఉన్నది. ఆత్మను తెలిసికొనినచో మనము పొగడ్తలకు వశమగుట ఉండదు. ఆత్మవేత్తృతవలననే హృదయమునకు విముక్తి. మనము భగవంతుని తెలిసికొన్నచో, శరీరమునకుచెందిన పొగడ్తలవలన ఆత్మను కించపఱుచుకొనుచున్నామని తెలియును. కావున ఇట్టి శరీరాహంకారమున కతీతులమై యుండవలయును. మనకు భూమి తిరుగుచున్నదనియు సూర్యుడు స్థిరముగా ఉన్నాడనియు తెలియునుకదా. కాని భ్రమవలన, భూమి చలనమును సూర్యునికి, సూర్యునిస్థిరత్వము భూమికి ఆరోపించుచున్నాము. ఇట్టి భ్రాంతియే శరీరాహంకారగర్వములు కలవారియందును ఉన్నది. నిజమైన వెలుగు - మహామహిమాన్వితమైనది - ఆత్మ ఒకవంక సూర్యునివలె ఉండగా, రెండవవైపున భూమివలె శరీరమున్నది. ఇది నిత్యపరిణామశీలమై ఎట్టి ప్రశంసకు అర్హతలేనిదై యున్నది. కాని మనము ఆత్మకుగల మహిమను శరీరమునకు శరీరముయొక్క వ్యర్థత్వమును ఆత్మకు ఆరోపించి పొరపడుచున్నాము. శరీరమున కాధిక్యమును కల్పింపగోరుటయే ఈ భ్రాంతికి మూలకారణము. ఈ అవివేకమును తొలగించుకొన్నచో గర్వాహంకారములు రూపుమాపిపోవును.

అత్యాశ (తృష్ణ):-అత్యాశ స్త్రీ పురుషులయందు జంతువులయందుసైతము ఉన్నది. ప్రతివానికి, తన చుట్టుపట్లనున్న సర్వవస్తువులు తనకే కావలయు

నన్న వాంఛయుండును. ఎంతపొందినను ఇంకను కావలయును. ఇంకను కావలయును అనుటయేకాని ఈ అత్యాశాగ్ని చల్లారుటయన్నది లేదు.

రాజునకున్న దురాశ రాజోచితముగా ఉండును. పేదవాని దురాశ పేదవానికి తగినట్లుగానే ఉండును. ఇది సర్వసాధారణమయిన దోషము - ప్రతి ప్రవక్తయు మనము దురాశాపరులము కారాదని హెచ్చరించుచునేయుండును. వారిబోధనలు ఒకవంక వినుచునే ఉందుము. ఒకవంక ఈ దురాశాపీడితుల మగుచునేయుందుము. అత్యాశయొక్క సార్వజనీనతనుగూర్చి వేదాంతము వివరించును: ప్రతివ్యక్తికి ఆత్మబలమున్నది. ఆ బలమును క్షయము కానీయక సరియగుమార్గమున వినియోగించుకొనవలెను. ఆత్మ మహిమ నెఱుంగక నీ నా మహిమను శరీరమున కంటగట్టుచున్నావు. అందుచే నీవు దురాశకు ఎర అగుచున్నావు. ఈ భ్రాంతిని తొలగించుకొన్నచో నీవే భగవంతుడవు. ఈ భ్రాంతి తొలగి ఆత్మ ప్రకాశించుచున్నచో శారీరకవిషయానుభవమును వాంఛించుటయన్నది జరుగనే జరుగదు.

అనురాగము - చింత : అనురాగముకలవ్యక్తి తన పరిసరములయందు ఏ మార్పును భరింపలేడు. ఆప్తులమరణమునకు మనము దుఃఖించుటకు ఆ వ్యక్తి శాశ్వతముగా మనయొద్దనే ఉండవలెనన్న కోరికయేకదా హేతువు! కాని ఈ జగత్తులో సర్వము అశాశ్వతమైనదే. మనలో సుస్థిరమై, మార్పు చెందని ఒకపదార్థ మున్నదనియు, అదే ఆత్మఅనియు కాని అజ్ఞానవశమున ఆత్మలక్షణమును శరీరమున కాపాదించుకొనుచున్నామని వేదాంతము ఘోషించుచున్నది. ఇట్టి అజ్ఞానమును రూపుమాపినపుడే మనము ఈ ప్రాపంచికబంధముల కతీతులమైయుండగలము. శాశ్వతముగా కాకపోయినను తాను సాధ్యమగునంత దీర్ఘకాలము జీవింపవలెనని ప్రతివ్యక్తియు కోరుకొనును. మృత్యువు తప్పదనితెలిసియు, దానిపేరు విన్నంతనే వణకిపోవుచుండును. దీనిని వేదాంత మిట్లు వివరించును:- మనలో శాశ్వతమై; మార్పు

పొందని ఆత్మ ఉన్నది. మానవునిలో నాశములేని ఆత్మయొక్క ఉనికియే మరణములేదను భావమును కలిగించుచున్నది. మార్పుపొందు శరీరము ఆత్మ కాదు. ఆత్మలక్షణమును శరీరమునకు ఆరోపించు ఈ పొరపాటును మనము పరిహరింపవలెను.

విమోచనము లేక ముక్తి:-ప్రపంచమున పశుపక్ష్యాదులు, మానవులు - స్వేచ్ఛను కోరుట చూచుచున్నాము. జాతులు తమ స్వాతంత్ర్యమునకై యుద్ధములు పైతము చేయుచున్నవి. మనము స్వతంత్రులముకానిచో స్వేచ్ఛ కొఱకు తహతహలాడుదుము. మనము వాంఛలకు ఆవేశములకు తలుచు బానిసలమగుచుందుము. మతముల లక్ష్యముకూడ (హిందువులలో మోక్షము) విమోచనమే. దేశకాలకారణములను గోడలుగల కారాగారమున మనము బంధింపబడితిమని వేదాంతము చెప్పును. ఇట్లు బంధింపబడి, యధార్థమగు స్వాతంత్ర్యమును కోల్పోయి, విమోచనముకొఱకు కొట్టుమిట్టాడుచున్నాము. దీనికి కారణము మనలోనే ఉన్నది. అపరిమితము నిరవధికమునగు ఆత్మ స్వేచ్ఛనే మనము కోరునది. కాని అజ్ఞానవశమున స్థూలశరీరస్వేచ్ఛయే మనము కోరుచున్నాము.

ఆత్మను మనశ్శరీరములకు జతచేసి దోషియగు మానవు డాచరించు పాపములన్నిటికి మూలకారణము అజ్ఞానము. ఇట్టి అజ్ఞానమును నిర్మూలించినచో సర్వపాపములను పరిహరింపవచ్చును. దోషములకు పురికొల్పు శక్తిని మనము నిర్మూలింపలేకపోవచ్చును కాని వేదాంతశాస్త్రము నాశ్రయించినచో అట్టిశక్తిని ఆత్మతేజస్సుగా రూపొందించుకొనవచ్చును. ఆత్మ శరీరముల భిన్నత్వమునుగ్రహించి, గందరగోళపడక, మసలుకొన్నచో సర్వము చక్కబడును. వాస్తవవిషయములను తారుమారుచేయక - అనగా ఆత్మకు న్యూనత, శరీరమునకు ఆధిక్యము చెప్పి స్వర్గమును నరకముగా

భావింపక - మనలుకొనవలసియున్నది - మనకు నిర్దుష్టమగు దర్శనము కలిగినచో మనమే దైవమగుదుము.

**మతములోని మూడు తెలుగులు** :-ప్రతిమతమునందు తత్త్వశాస్త్రము, పురాణము, ఆచారకాండ ఉన్నవి. వివేకులైన విద్వాంసులకు తత్త్వశాస్త్రము. ఆవేశపరులకు పురాణములు. జనసామాన్యమునకు ఆచారకాండ - నిర్దేశింపబడినవి. వేదాంతకర్మకాండకు, ధరించువస్త్రముల రంగునకు సంబంధమున్నది. ఇచ్చటి ఎఱుపురంగునకు క్రైస్తవులసిలువకు ఒకే అర్థము. క్రైస్తవులకు సిలువ, క్రీస్తు శూలారోపణమునకు, ఆయనకు వారియందలి ప్రేమానురాగములకు చిహ్నము. క్రీస్తు ఎట్లు బాధపొందెనో అట్లే క్రైస్తవులందరు తమ దేహేంద్రియసుఖములను, స్వార్థమును, అహంకారమును త్యాగమొనర్పవలెనని దానిభావము.

భారతదేశములో పసుపుపచ్చరంగు మృతులకు చిహ్నము. కావున పసుపుపచ్చని వస్త్రములను ధరించినవాడు, తాను తుచ్ఛదేహమును త్యజించి తదతీతుడైనాడను అర్థమును సూచించును. అట్టి దుస్తులను ధరించిన బౌద్ధుడు సర్వసుఖవాంఛల మనోవికారముల విషయమున తాను మృతతుల్యుడనని - అనగా జయించినాడనని సూచించును. వేదాంతులవస్త్రములు అగ్నిరంగులో నుండును. అనగా అతడు తన భౌతికశరీరమును, ప్రాపంచిక వాంఛలను దగ్ధమొనర్చినాడని అర్థము. ఇట్లు అగ్నియొక్క సంస్కారలక్షణమును వేదాంతము బోధించుచున్నది. బైబిలు 'దేహమును రక్షించుకొనువాడు ఎప్పుడో ఒకప్పుడు దానిని కోల్పోవలసివచ్చును' అని చెప్పుచున్నది. ఉత్తమజీవితముకొఱకు హీనజీవితమును త్యజింపవలసియే యుండును. ప్రాపంచికదృష్టిమాత్రమే కల జనులు తమజీవితములను క్లేశదుఃఖములకు గురిచేసి దుర్భరము చేసికొనుచున్నారు. వారు సుఖదుఃఖములనడుమ ఊగుచుందురు, వారి భావనలు వారి బంధములగుచున్నవి.

హీనమగు అజ్ఞానమునుండి తొలగిపొందవి వేదాంతము బోధించు చున్నది. శరీరమునకు నరకప్రాయమైన ఈ అజ్ఞానమును కాల్చివేయుదము. జ్ఞానాగ్నివిగ్రహించి సర్వమాలిన్యములను దగ్ధమొనర్చి నూత్నతేజస్సుతో వెలుగొందుము. ఇదియే వేదాంతి ధరించు కాషాయాంబరములకు అర్థము.

మాంసభక్షణము.-మతములోని నిరర్థకనిషేధములయెడ రామతీర్థునకు నమ్మకములేదు. ఆత డెట్టి విధినిషేధములను చెప్పలేదు. ఆయన కోరినది యాంత్రికమగు మతాచరణము కాదు. అంధకారబంధురములగు ఐహికారణ్యములలో తేజోవంతములగు వివేకోన్నతపథములకు దారులు తీర్చుకొనగలిగిన ధీరులు, విచక్షణులునగు మతపరిజ్ఞాతలనే ఆయన కోరుకొనెను.

అమెరికాలో ఒకరు రామతీర్థుని 'వేదాంతులు మాంసము తినవచ్చునా ?' అని ప్రశ్నించిరి. అందులకు ఆయన 'కేవలము జంతువులపట్ల దయాభావముతో వేదాంతము మాంసభక్షణమును నిషేధింపలేదు. మాంసభక్షణము సులభముగా ఏకాగ్రత కుదురుటకు ప్రతిబంధకముగా ఉండును. మాంసాహారమును నీవు వదలిపెట్టలేకపోయినచో దానిని విసర్జింపనక్కరలేదు. సైనికోద్యోగాదులలో పనిచేయునప్పుడు ఆవశ్యకమగుచో మాంసాహారమును ఉపయోగింపుము. అట్టిసందర్భములలో వట్టి కాయగూరలతో కడుపు నింపుకొన నక్కరలేదు. తదితరవృత్తులలోనున్నవారు కొంత సరిపెట్టుకొనవచ్చును. మాంసాహారములేనిచో కొందరు నిలువలేరు. కొందరు బాగుగానే ఉందురు. మాంసాహారముతీసికొని ప్రపంచమునకు ఎక్కువసేవ చేయగలిగినచో నీవు దానినే స్వీకరింపుము. మహోన్నతసత్యపథమున పయనించుటకు అది అడ్డంకిగా నీకు తోచినచో తప్పక విసర్జింపుము. జిహ్వాతృప్తికిమాత్రమే మాంసాహారమును భుజించుటమాత్రము తప్పు. మానవజాతికి మేలుచేయు ఏ మహాకార్యాచరణమునకైన పూనుకొని దానికి తగిన స్థితిలో శరీరము ఉండవలయునని నీవు తలంచినచో మాంసభక్షణము చేయవచ్చును' అని బదులు పలికెను.

రామతీర్థునిపద్ధతి యోగులకు సామాన్యులకుకూడ ఉపకరించునదే. మనము కార్యరంగమునుండి తప్పించుకొని పారిపోవుట కాయన అంగీకరింపడు. ఆయన 'మన మీ జగన్నాటకమున పాల్గొనుచున్నామను విషయమును విస్మరింపకుండ, మనపాత్రను చక్కగా నిర్వహింపవలెను. మనము ధరించిన భూమికలు మనముకాదు అంతకంటె ఉదాత్తులము; ఉన్నతులము. నిజమునకు వివాహము వేదాంతికి ప్రతిబంధకము కాదు - పైగా అది ఆత్మావబోధమునకు చక్కని అవకాశములను సమకూర్చును' అని తెలిపెను.

మన మహిమను, ఘనతను మనము గుర్తించితీరవలెనను నిర్బంధమాయన ఎన్నడును చేయలేదు. పరమాత్మ జీవాత్మలు భిన్నులనుభావమాయనకు నచ్చదు. అతివేలమయిన వినయముకూడ బానిసతనమునకు దారితీయును. ఏమనగా మన భావన ననుసరించియే ఫలితము నుండును. 'రామతీర్థుని బోధనలకు పాశ్చాత్యుల స్వీయస్థైర్యసిద్ధాంతమునకుగల భేదమిది; రామతీర్థుడు సర్వాతిశాయి అగు ఆత్మస్థైర్యము కావలెనను. వారు భిన్నభిన్నవ్యక్తులతో భిన్నభిన్నముగాతోచు శరీరమునకు ప్రాధాన్యమిత్తురు. ఆయన ప్రేమోపాధికమగు ఏకత్వమునకు దారితీయగా వారు వైరోపాధికమగు వేరుపాటునకు త్రోవతీయుచున్నారు.' అన్నిమతములను 'ప్రేమయే భగవంతుడు' అని ఘంటాఘోషముగా చెప్పుచున్నవి. కావున ప్రేమయే సర్వప్రపంచమును పరిపాలించును గాక :

## తెలుగులో వెలువడిన పుస్తకములు

### భారతదేశము - ప్రజలు

| | | | వెల రూ. | పై. |
|---|---|---|---|---|
| 1. | భారతదేశ ఖనిజములు | — | 5 | 75 |
| 2. | పెంపుడు జంతువులు | — | 4 | 50 |
| 3. | సామాన్య వృక్షములు | — | 4 | 25 |
| 4. | నికోబార్ దీవులు | — | 5 | 50 |
| 5. | జనాభా | — | 3 | 75 |
| 6. | ఉద్యాన పుష్పములు | — | 6 | 00 |
| 7. | భారతదేశ ఆర్థిక భూగోళము | — | 5 | 25 |
| 8. | భారతదేశ భౌతిక భూగోళము | — | 4 | 50 |
| 9. | అడవులు - అటవీశాస్త్రము | — | 6 | 00 |
| 10. | పూలచెట్లు | — | 5 | 50 |

### జాతీయ జీవిత గ్రంథమాల

| | | | రూ. | పై. |
|---|---|---|---|---|
| 11. | సముద్రగుప్తుడు | — | 1 | 25 |
| 12. | శంకరాచార్యులు | — | 2 | 00 |
| 13. | అహిల్యాబాయి | — | 2 | 00 |
| 14. | చంద్రగుప్త మౌర్యుడు | — | 1 | 50 |
| 15. | సుబ్రమణ్య భారతి | — | 2 | 25 |
| 16. | గురునానక్ | — | 2 | 25 |
| 17. | త్యాగరాజు | — | 1 | 25 |
| 18. | రాణీ లక్ష్మీబాయి | — | 2 | 00 |
| 19. | కబీరు | — | 1 | 75 |
| 20. | నానా ఫడ్నవీస్ | — | 2 | 00 |
| 21. | రామానుజాచార్యులు | — | 2 | 25 |

## ఇతర పుస్తకములు

| | | రూ. | పై. |
|---|---|---|---|
| 22. భారతదేశము : నేడు - రేపు | — | 0 | 75 |
| 23. కల్కి : లేక నాగరకత భవిష్యత్తు | — | 0 | 75 |
| 24. జ్వాలాముఖి | — | 3 | 75 |
| 25. ఏక ప్రపంచము - భారతదేశము | — | 0 | 75 |
| 26. ఝాన్సీ లక్ష్మి | — | 1 | 50 |
| 27. పోతన | — | 2 | 75 |
| 28. విజ్ఞానం విశేషాలు | — | 1 | 50 |
| 29. నవభారత విద్యా పునర్నిర్మాణము | — | 1 | 25 |
| 30. ప్రాక్పశ్చిమ పవిత్రాంగనలు | — | 5 | 00 |
| 31. మహా విప్లవ వీరుడు | — | 4 | 25 |
| 32. శాస్త్రవిజ్ఞానము మానవజీవితము | — | 2 | 75 |

## ఆదాన్ - ప్రదాన్

| | | | |
|---|---|---|---|
| 33. పంజాబీ కథలు | — | 3 | 50 |
| 34. బన్‌గర్‌వాడి | — | 2 | 75 |
| 35. స్మృతిరేఖలు | — | 6 | 50 |
| 36. తమిళ కథలు | — | 4 | 00 |
| 37. జీవిత సంగ్రహము | — | 4 | 25 |
| 38. వీరేశలింగము | — | 4 | 25 |

# తయారీలోనున్న పుస్తకములు

## ఇండియా - దేశము : ప్రజలు

1. పక్షులు
2. సామాన్య భారతీయపక్షులు
3. భారతదేశము - ఒక పర్యావలోకనము

4. భూమి, మన్ను
5. నాణెములు
6. కూరగాయలు
7. మొక్కల తెగుళ్లు
8. ఔషధ భూజములు
9. పాములు

## జాతీయ జీవిత గ్రంథమాల

10. హర్షుడు
11. గురుగోవింద సింగ్
12. స్వామి రామతీర్థ
13. హరినారాయణ ఆప్టే
14. ఈశ్వరచంద్ర విద్యాసాగర్
15. సూరదాసు

## ఇతర గ్రంథములు

16. మీరు - మీ దేహస్థితి
17. అంతరిక్షయాత్ర